జూలై 2006
పేజీలు : 68
వెల : రు 10/-

# అరుణతార

తెలుగు సాహిత్య సాంస్కృతిక మాసపత్రిక

సంపుటి 25 ● సంచిక 10 ● విజయవాడ



లాల్ సలామ్ మంజీర

























అరుణతార
సాహిత్యసాంస్కృతిక మాసపత్రిక

2006
జూలై
257

సంపాదకుడు
**సి.ప్రసాద్**

మేనేజర్
**ఎస్. రవికుమార్**
5-1307,
దొరసానిపల్లె రోడ్,
ప్రొద్దుటూరు,
కడప జిల్లా - 516 360.

సంపాదకవర్గం
**పాణి**
**కృష్ణాబాయి**
**వి.చెంచయ్య**
**మోహన్**
**నాగరాజు**

రచనలు పంపవలసిన చిరునామా :
**టి. కృష్ణాబాయి**
9-19-3
CBM కాంపౌండ్
విశాఖపట్నం - 530 003.

# సంపాదక లేఖ

'మంజీర' ఒక నది
నది వంటి మనిషి మా మంజీర
విప్లవ కవిగా, రచయితగా, విరసం సభ్యునిగా విప్లవ విద్యార్థి ఉద్యమాల నుండి విప్లవోద్యమ నాయకునిగా సాగిన ఓ సజీవ యాత్ర
కవిత్వం, పాటలు, కథలు వ్యాసాలు అనేకం రాశాడు
యిటీవల మంజీర అంటే నేపాల్ విప్లవోద్యమ, సామాజిక చారిత్రక స్థితిగతుల వ్యాసాల అనువాదకునిగా పాఠకులకు అపరిచిత పరిచయస్తుడు. రెండు పుస్తకాలకు సరిపడా వ్యాసాలు తెలుగులోకి అనువదించాడు

అరుణతారలో సాగిన హోమియో వైద్య చర్చలో ఆయన గతితర్క పద్ధతిని హోమియోకు అన్వయించే దృఢమైన ప్రయత్నం చేశాడు. అంతకు మించి ఆదివాసీ ఆవాసాల్లో హోమియోను ప్రజలకు చేరువచేసిన విప్లవాచరణను కేస్‌స్టడీస్‌లాగా బైటి ప్రపంచానికి అందించాడు

బహుముఖ ప్రజ్ఞ అనే మాటను విప్లవంలో, విప్లవసాహిత్యోద్యమంలో ఆచరణ నుండి నిజం చేసిన సృజనకారుడూ, మేధావీ, రాజకీయవేత్తా

రచయితలు ప్రజా యుద్ధంలోకి సైనికులుగా వెళ్ళడం, యుద్ధం మధ్యనే సాహిత్య సృజన చేయడం ప్రపంచమంతా ఉన్నదే

గర్వించదగిన గొప్ప రచయితలు ఆ కోవలో ఉన్నారు. మనకు పాణిగ్రాహి ఆ ఒరవడి అందించాడు

అనేక మంది విప్లవ రచయితలు నడచిన ఆ దారిలో మంజీర ప్రవహించి విస్తారమైన జీవితాన్ని సాహిత్యీకరించాడు. సాహిత్యాన్ని విప్లవీకరించాడు
నది మంజీర పరివాహకానికే పరిమితం
కవి మంజీర దండకారణ్యంతో సహా అనేక ఆదివాసీ ప్రాంతంలో మానవ సృజన వ్యాపారంలో, సృజనాత్మక పోరాట అనుభవాల్లో కలగలిసిన జీవజల
ఇప్పుడు మంజీర నదికూడా కాదు
నది యింకిపోతుందేమో అనే భయం
కవి మంజీర తెలుగు సాహిత్యంలో, దేశ ప్రజల పోరాటాల్లో సంలీనమై కూడా నిత్యం పోటెత్తే వెల్లువ
తన రచనతో, జీవితంతో, మరణంతో మంజీర విరసంపై ఎగిరే ఎర్రెర్రని జెండా....




| | | |
|---|---|---|
| ఈ సంచికవెల | : | 10 రూ. |
| సంవత్సర చందా | : | 100 రూ. |
| జీవితచందా | : | 1000 రూ. |

చందాలు, బకాయిలు మనియార్డర్, డి.డి.ల రూపంలో మేనేజర్‌కు పంపించండి. డి.డి.లను ఎస్. రవికుమార్, ప్రొద్దుటూరు పేర తీయండి.

లేఖలు

# ముస్లిమేతరుల ముస్లిం సాహిత్యానికి ఆహ్వానం

ఈ మధ్య పత్రికల్లో ముస్లిమేతర సాహితీ మిత్రులు ఎందరో ముస్లింల జీవితాల నుంచి కథలు, కవితలు రాస్తుండడం సంతోషకర పరిణామం. పుట్టుకతో ముస్లింలైనా ముస్లిం సబ్జెక్ట్ ముట్టకుండా ఇతర జీవితాలనే కథలుగా కవితలుగా రాస్తూ వచ్చారు చాలా మంది. మరి తమ చుట్టూ ఉన్న ముస్లిం జీవితాల్లోంచి వారి సమస్యలెందుకు విషయం కాకుండా పోయాయన్నది ప్రశ్న. దానిని అధిగమించి ఇవాళ ఆ జీవితాల్లోంచి కవితలు, కథలు వస్తుండడం ప్రజాస్వామిక వాతావరణానికి నిదర్శనం. 'ఈమధ్య ఎక్కడ చూసినా ముస్లిం వాద సాహిత్య చర్చే జరుగుతుంద'ని అన్నారు ఓ మిత్రులు. చివరి రెండు 'అరుణతారల్లో' మూడు కథలు రావడం ఆ ప్రభావం వల్లనేనేమో. మన సమాజంలో 20 శాతంగా ఉన్న ఒక సమూహం జీవితాలు ఇన్నాళ్ళకైనా బాధిత, పీడిత వర్గంగా చర్చకు వస్తుండడం ఆహ్వానించదగ్గ పరిణామమే. (రోజురోజుకీ అణగారుతున్న ముస్లిం జీవితాలపై కథలు, కవితలు రాస్తూ వారి బతుకు గోసల్ని రికార్డు చేయాలని ముస్లింవాద రచయితలుగా మేము తెలుగు సాహితీకారులందరినీ కోరుతున్నాం. ఆ సాహిత్యాన్ని సంకలనాలుగా వేసే బాధ్యత మాది.)

'అరుణతార' మే సంచికలో రాము కథ 'దర్ద్ కీ నసల్' బాగుంది. మొదట్లో కాస్త గజిబిజిగా అనిపించినా తర్వాత సమజైంది. లోతైన అబ్జర్వేషన్! రాము మంచి కథకుడవుతాడని ఈ కథతో హామీ దొరుకుతున్నది.

ఏప్రిల్ సంచికలో వడ్డెబోయిన శ్రీనివాస్ కథ 'ఆమె తలాఖ్ అన్నది' బాగుంది. మధ్య కొంచెం సాగదీసినట్లనిపించింది. ఖాజా, లక్ష్మణ శాస్త్రి చేయించిన పనులు కొంచెం కృతకంగా, అనవసరంగా కూడా అనిపించాయి. వడ్డెబోయిన భాషలో ఉర్దూ పదాలు చదువుతుంటే ఎంత అబ్బురమనిపించిందో అంత సంబరమేసింది. తెలంగాణ తెలుగులో కలిసిపోయిన ఆ ఉర్దూ పదాలు ఎంతో సొగసుతో నప్పాయి. 'సుల్తానా' కథలోని సుల్తానాలకు భిన్నమైన సుల్తానను వడ్డెబోయిన చూపించారు.

అదే సంచికలోని సుభాషిణిగారి కథ 'సంకెళ్ళు నీకు బై బై... మంచి కథ. ఈ విషయం మీద ఎంతో చర్చ జరగాల్సి ఉంది. కొంత చర్చ ఈ కథ చేసింది. ఆధిపత్య కులాలవారు, ప్రాంతాలవారు, మతాలవారు అణగారిన కులాల, ప్రాంతాల, మతాలవారిని చేసుకుంటే వారి ఆధిపత్య భావజాలమే చెలాయించబడుతున్న సమాజమిది. అందులోనూ ఆధిపత్య స్థానంలో ఉన్న పురుషుడు ఏ స్త్రీని చేసుకున్నా (కొన్ని మినహాయింపులు తప్ప) అన్ని చోట్లా పురుషుడి ఆధిపత్య సంప్రదాయమే చెలాయించబడుతున్నది. ఇది కానరాని అణచివేత. కాబట్టి ఈ విషయంమీద ఎంతో చర్చ జరగాల్సిన అవసరం ఉంది. దాని నుంచి ఎన్నో విషయాలు నేర్చుకోవాల్సి ఉంది.

సుభాషిణిగారు కథను బాగా నడిపించినప్పటికీ, అన్నేళ్ళ పరిచయంలో అన్వర్ ఆ మాత్రం అర్థం చేసుకోకుండా నిఖా చేసుకుందాం అంటాడా? అనే సందేహం కలుగుతుంది. అంటే కథలో ఎక్కడో చిన్న చిన్న లోపాలున్నట్లు అర్థమవుతుంది. షాల్, బుర్ఖా గురించి, మతపరమైన మ్యారేజెస్ గురించి అన్వర్‌కి ప్రతిభ జవాబులు సూటిగా, స్పష్టంగా ఉన్నాయి. కాని 'ఎక్కడ కొట్టాల్నో అక్కడ కొట్టింది'. స్ట్రాంగ్ డోస్ ఇవ్వాల్సిందే లాంటి వాక్యాల ముగింపులు చీప్‌గా అనిపించాయి. సుభాషిణి గారి నుంచి ఇంకా ఇలాంటి లోతైన చర్చ జరిగే కథలు ఆహ్వానిద్దాం. ఈ మధ్య మతాంతర వివాహం చేసుకున్న ఓ 'ప్రతిభ' గురించి తెలిసింది. ఒక అమ్మాయి పుట్టాక ఇప్పుడు నమాజ్ నేర్చుకొమ్మని ఆమెని ఆ ఇంట్లో వత్తిడి చేస్తున్నారట! ఆమెకు ఇష్టం లేకున్నా ఆ బలవంతం ఏమిటని మేము బాధపడ్డాం. ఇట్లాంటి వెన్నో కథలు... వెతలు....!

సుభాషిణిగారి కథ గురించి ఓ ఇద్దరు మిత్రులు 'నీ కథ(ల)కు కౌంటర్ కథ' అనేశారు నాతో! ఆశ్చర్యపోయాను. కాని నాకు అలా అన్పించలేదు. ఇట్లాంటి కథలకు నేను పూర్తి మద్దతుదారుణ్ణి. కాని చాలా మంది నా కథల్ని అపార్థం చేసుకుంటున్నట్లు తోచింది. అందుకు ఈ కాస్త చర్చ -

'సుల్తానా' కథలో సుల్తానా ఒక హిందువుని చేసుకొని హిందువుగా మార్చబడడాన్ని వ్యతిరేకించాను. అట్లే ఒక ముస్లిం ఒక హిందువుని చేసుకొని ముస్లింగా మార్చడాన్ని కూడా నేను సమర్థించను. అది ఆయా వ్యక్తుల ఇష్టానుసారంగా జరిగితే అది వేరే విషయం.

జవాబ్ కథ (2006, అరుణతార)లో సైదులు సున్తీ చేసుకోవడాన్ని కొందరు తప్పుగా అర్థం చేసుకుంటున్నారు. ముస్లింగా మారడాన్ని ఇక్కడ సపోర్టు చేస్తున్నానని కాదు. గుజరాత్‌లో అన్ని వేలమందిని పొడిచో, ముక్కలుగా నరికో, తగులబెట్టో చంపడాన్ని వ్యతిరేకించాలనుకున్న ఒక బీసీ యువకుడు ముస్లింలకు సంఘీభావం తెలపాలనుకున్న ఆ బహుజనుడు - ముస్లింగా గుర్తించడానికి బట్టలు చింపి మరీ సున్తీ చూసి చంపడాన్ని జీర్ణం చేసుకోలేకపోయిన ఒక ముస్లింల మిత్రుడు - తాను సున్తీ చేసుకోవడం ద్వారా హిందూత్వవాదులపై తన కసిని వ్యక్తం చేస్తాడు. పరోక్షంగా తనను కూడా ముస్లింగా భావించి చంపమని ఎద్దేవా చేస్తాడు. ఇంకా ఎన్నో అర్థాలు ఆ చర్య వల్ల స్ఫురిస్తాయి. అంతేగాని కేవలం ముస్లింగా మారడమే ఇక్కడ విషయం కాదు.

ఇష్టంలేని వారిపై ఏ మతాన్నైనా బలవంతంగా రుద్దడాన్ని కాసింత జ్ఞానం ఉన్న ఎవరూ సమర్థించలేరు.

కాని ఇక్కడో మెలిక ఉంది. 'వై ఐ యామ్ ఎ ముస్లిం' అనే కవిత (జాగ్నే కి రాత్) లో 'చాతుర్వర్ణాలుగా ఖండించిన దేహాన్ని గుసూల్ నీళ్ళతో కడిగేయడాన్ని నేనివాళ గర్విస్తున్నా' అన్నాను. 'అంటరానితనం (వర్ణవ్యవస్థ కూడానేమో) వదిలించుకోవాలంటే ఇస్లాం స్వీకరించడం తప్ప మరో మార్గం లేదని' పెరియార్ అప్పటి పరిస్థితుల్లో చెప్పాడు. అంబేద్కర్ సైతం బౌద్ధం స్వీకరించడానికి పిలుపునిచ్చాడు. ఆ కోణం నుంచి చూస్తే ఈ విషయంపై ఎన్నో రకాల చర్చ జరగాల్సిన అవసరం ఉంది.

-స్కైబాబ,
హైదరాబాద్.

## రచయితలకు విజ్ఞప్తి

అరుణతారకు రచనలు పంపండి.

కథలు, కవిత్వం, పుస్తక సమీక్షలు, విమర్శా వ్యాసాలు, సామాజిక రాజకీయ సిద్ధాంత వ్యాసాలు, యితర భాషల్లోనుండి తెలుగు పాఠకులకు అవసరమైన అనువాదాలు పంపించండి.

అరుణతారలో అచ్చవుతున్న రచనలపై ఉత్తరాలు రాయండి. రచనలను మెచ్చుకునే ఉత్తరాలకంటే గుణదోషచర్చలు చేయగల ఉత్తరాలు పత్రిక ప్రమాణాలు పెంచుతాయి. పాఠకుల విమర్శనాత్మక ఉత్తరాలు పత్రికా నిర్వహణకూ తోడ్పడుతాయి.

మీ రచనలు అరుణతార సాహిత్య, సిద్ధాంత స్థాయిని పెంచుతాయని నమ్ముతూ -

- సంపాదకవర్గం

## ఈ సంచికలో...

**కథలు :**

దృశ్యాలు మూడు... ఒక ఆవిష్కరణ - సుంకోజి దేవేంద్రాచారి

ఇన్సానియత్ - డా.దిలావర్

నదిని నిర్మిస్తున్న వాళ్ళు - కె.వి.కూర్మనాథ్

చిట్టి చేతులు - జన్ను చిన్నాలు

**నివేదిక :**

విరసం 20వ రాష్ట్ర మహాసభల ప్రసంగాలు, వివరాలు

**కొత్త పుస్తకాలు :**

మహాసభల్లో ఆవిష్కారమైన పన్నెండు పుస్తకాల పరిచయాలు

**వ్యాసం :**

నది ఆచూకీ - వరవరరావు

**పుస్తక సమీక్ష :**

మావూరి మహావైద్యగాడు - పలమనేరు బాలాజి

దేవపుత్ర 'బందీ' కథలు - పి. వరలక్ష్మి

**పుస్తక పరిచయం :**

సీమ వ్యవస్థలోని పతన విలువల చిత్రణ - జి. వెంకట క్రిష్ణ

నేనూ మా అమ్మ - ఆర్. శశికళ

**కవిత్వం :**

మంజీర, జి. వెంకటక్రిష్ణ, దేశరాజు, యార్లగడ్డ రాఘవేంద్రరావు, కె.వి. కూర్మనాథ్, కాశీం, శివలక్ష్మి

**నవలిక :**

శికారి - పాణి

**విరసం మహాసభల తీర్మానాలు, సందేశాలు**

**ముఖ చిత్రం :** మహాసభల దృశ్యాలు
పతాకావిష్కరణ,
ముదిగంటి సుజాతారెడ్డి, బొజ్జాతారకం, కన్నబిరన్,
అబ్బూరి ఛాయా దేవి, ఎం.టి.ఖాన్, కానూరి, జ్వాలాముఖి, శివారెడ్డి.

**చివరి కవర్ పేజి :** కొడవటిగంటి కుటుంబరావు కుమార్తె శాంతి సుందరి, సహచరి వరూధిని గద్దర్, వంగపండు, గోరటి వెంకన్న, అందెశ్రీ, సంధ్య, దేశపతి శ్రీనివాస్, ఓల్గా, హరగోపాల్, తెలకపల్లి రవి, ఎస్వీ, వాసిరెడ్డి నవీన్, పాపినేని శివశంకర్, దేవీ ప్రియ, నందిని సిద్ధారెడ్డి, జూలూరి గౌరీశంకర్, స్త్రైబాబ

☆ సుంకోజి దేవేంద్రాచారి



# దృశ్యాలు మూడు... ఒక ఆవిష్కరణ

"బిన్నే యెలబారబ్బోదా... కరెంటొచ్చే యాళయింది" ఇంటి ముందుకొచ్చి పొద్దు కళ్ళా ఎగజూసి చెప్పినాడు నారాయణ.

చేతిలో ఉన్న పుస్తకంలోనించి చూపు మరల్చి గోడగడియారాన్ని చూసి "తొమ్మిదే గదా... పదికి కరెంటొచ్చేది. ఇంగా గంట ఉండాదిలే. పోతాను" బదులిచ్చినాడు భాస్కర్ ఇంట్లోనించీ.

"ఎదుర్రాయ్యే... ఎన్నిసార్లు చెప్పాల నీకు" కసురుకున్నట్టుగా అన్నాడు నారాయణ.

అంతవరకు వంటగదిలో పనిలేకపోయినా ఏదో పనున్నట్టు తిరుగులాడుతున్న సావిత్రమ్మ వీధి గుమ్మంలోకి వచ్చింది.

తడులు తగ్గిన చెరుగ్గడలా ఉన్నాడు నారాయణ. అతని వంటిపైనున్న బట్టలు ఉతికినవే అయినా మాసినట్టుగా ఉన్నాయి. ఎడమ భుజం పైన రంగువెలసిన టర్కీటవల్ వుంది. అతనికి ఎదురుగా ఎముకల గూడులా ఉన్న రెండు ఎద్దులు. వాటి మెడల్లోని పలుగులను ఎడమచేత్తో పట్టుకుని నిలబడుకోనుండాడు నారాయణ.

బక్క ఎద్దులను, భర్తను చూడగానే గుమ్మంలోనే ఆగిపోయింది సావిత్రమ్మ.

'గొడ్ల సంతకా...' అడిగినాడు గరికపోచలా ఉండే సిద్దారెడ్డి. నారాయణ సమాధానం చెప్పకముందే "ముల్లుబరగ తీసుకోలేదే" అన్నాడు తిరిగి తనే.

"ఇంట్లో పుట్టి పెరిగినోటియి. పద్దైదేండ్లమింటీ ఈటితో సేద్దెం చేసినా. ఏ పొద్దేగానీ ముల్లు బరగ ముడ్డిమింద పెట్టిందిలే. నోరులేందొగటే. మనసలకన్నా ఎక్కువ" అన్నాడు నారాయణ.

అతని గొంతులో దుఃఖం ధ్వనించిందో, సంతోషం ధ్వనించిందో అర్థం కాలేదు సిద్దారెడ్డికి. భర్త మాటలతో సావిత్రమ్మ కనుకొలకుల్లో నీళ్ళు నిలిచాయి. ఇంటి లోపలివైపు తల తిప్పి పైట చెంగుతో కళ్ళు తుడుచుకుంది.

"నిరుటికి వానలు పడితే ఏం చేస్తావుబా... సేద్దెం చేయవా...?" సిద్దారెడ్డి.

"అందాకా బతికుండాల గదాన్నా. ఈటినమ్మితే రెండు మూడు నెల్లు బత్తెమున్నా వస్తాయి. లేకుంటే ఆకలితో సస్తామేమో అనిపిస్తాంది" దిగులు ధ్వనించింది నారాయణ గొంతులో.

"నిజమే... దిగవీదిలో అప్పులు, ఆకలితోనే గదా సుబ్బయ్య పురుగుల మందుతాగి సచ్చిపోయింది. ఏం చేద్దాం రైతుల బతుకులు అట్లుండాయి. మా కొడుకయితే ఉండే నేలంతా అయిన కాడికి తెగనమ్మేసి తిరుపతికి పదామంటా ఉండాడు. ఇంగా ఎట్లా కాలం వస్తాదో ఏమో... ఈ సారన్నా వానలు పడతాయనే అనే ఆశతో ఉండా. వస్తాప్పా.... పనుండాది" అక్కడి నుంచి వెళ్ళిపోయాడు సిద్దారెడ్డి.

మృత్యుమేఘాలు వూరంతటికీనీ కమ్ముకున్నట్టనిపించింది నారాయణకు. ఆకాశం కళ్ళా చూసినాడు. కొత్త చీపురుతో శుభ్రంగా ఊడ్చినట్టుంది.

'ఎదుర్రాయే ఎన్నిసార్లు చెప్పాల" కసురుకున్నట్టుగా అన్నాడు భార్యతో. ముక్కులు ఎగబీలస్తా ఎద్దులకు ఎదురు వచ్చింది సావిత్రమ్మ.

"వోన్ని బోరు కాడికి పొమ్మని చెప్పు. కరెంటొస్తాది" అని మళ్లీ ఒకసారి చెప్పి, ఎద్దులను తోలుకొని చింతమాకలపల్లి గొడ్ల సంతకు ఎలబారినాడు నారాయణ.

సావిత్రమ్మ మౌనంగా వంటింటింలోకి పోయింది. మరో పది నిముషాలకు పుస్తకాన్ని పక్కన పెట్టాడు భాస్కర్. చెప్పులు వేసుకుని వీధిలోకి పోతూ అలవాటు ప్రకారం "అమ్మా... ఎద్దుల తోలుకోని అన్న మెత్తుకొనిరా.... నేను తోటకాడికి పోతాండా" చెప్పి బయట పడ్డాడు భాస్కర్.

దారి పొడవుకూ మలమలా నేల మాడిపోయిండాది. ఆకులు రాలిన సీతాఫలం చెట్లు చిగిరించకుండా నల్లగా కమిలిపోయిండాయి. అప్పుడే పొయ్యిలోనించీ తీసిన చింతనిప్పు మాదిర్తో ఉండాడు సూర్యుడు. ఎక్కడో... నీటి ఆదరువు ఉండే దగ్గర కొంచెం కొంచెం నేల పచ్చపచ్చగా కనిపిస్తా ఉండాది. అరగంటలో తోటకాడికి చేరుకున్నాడు. ఎకరా నేలలో చెరకు నాటిండారు. నీళ్ళు తక్కువయ్యి అరెకరా నేలలో చెరుగ్గెడలు ఒరుగులమాదిరి అయిపోయిండాయి. మిగిలిన అరెకరాలో కొనూపిరితో ఉన్నట్టుండాయి.

తోటనే కొంచేపు చూసి స్టార్టర్ కాడికి పోయి స్విచ్ వేసినాడు. కరెంటు రాలా, గెనంమింద ఉండే కానగచెట్టు కింద నిలబడుకోని తోటనే చూస్తా ఉండాడు భాస్కర్.

"అల్లుడూ... ఎండిండే తోటను ఎంచేపు చూస్తావు... కరెంటొచ్చిండాది. మోటరెయ్యి" నీరసంగా మాటలు వినిపిస్తే తలతిప్పి చూసినాడు. ఎదురుగా సుధాకర్ నాయుడు. "కరెంటొచ్చిందా..! ఇంతకుముందు చూస్తే రాలేదే... యాడికి పోయిన్నేవు మామా" అంటా గబగబా పోయి స్విచ్ నొక్కినాడు భాస్కర్.

సుధాకర్‌నాయుడు ఏదో చెప్పినాడు. మోటార్ చప్పుడులో భాస్కర్‌కు వినిపించలా. పైపులోనించీ నీళ్లు సన్నగా వస్తాండాయి. పన్నోటియి పన్నెట్లే యిమిరి పోతాండాయి. యిమిరినాంక నత్తనడిచినట్టు నీళ్లు కాలవంటీ పోతాండాయి.

పైపు దగ్గర సుధాకర్ నాయుడు పుల్లుగా నీళ్ళు తాగి కానగచెట్టుకిందికి పోయినాడు. పార పక్కన పెట్టుకోని కుచ్చోనుండాడు భాస్కర్.

"ఏం మామా... అన్ని నీళ్ళు తాగితివే.." నవ్వతా అడిగినాడు.

"తినింది అరక్క తాగినా అబ్బోడా..?" అన్నాడు.

అర్థంకానట్టు చూసినాడు భాస్కర్.

"ఒగ పక్క చూస్తే ఈ వానదేవుడు ఎవురో నెత్తిన మెడ్తో కొట్టినట్టి కురిసేదే మానుకున్నేడు. ఇంగో పక్క మేం పండించే జిలకర మసూర బీమన్నం ముక్కల్దాకా తినేది నువ్వు... వడ్డీలకు దుడ్డిచ్చి చక్రవడ్డీలు తీసుకుంటా జలగమాదిర్తో మమ్మల్ని పీల్చి పిప్పిచేసేది నువ్వు. మేము అప్పులతో, ఆకలితో, అవమానాలతో సస్తాంటే తినింది అరక్క సస్తాండారు మీరు అంటావా... కడుపుకు కూడుతిన్నోడు మాట్లాడే మాటలేనా ఇయ్యి...?" ఆవేశంగా అన్నాడు సుధాకర్‌నాయుడు పైగుడ్డతో చెమట తుడుచుకుంటా.

భాస్కర్ బిత్తర పోయాడు. ఎవరిని తిడతా ఉండాడో అర్థం కాలేదు.

"ఏంది మామా... పిచ్చి పట్టినోని మాదిర్తో మాట్లాడతా ఉండావే" అన్నాడు.

"అవును... నాకు పిచ్చే పట్టిండాది. నెలకు మూడు వానలు పడతాండాయి. ఎకరాకు నలభైమూటలు వడ్లు పండతాండాయి. మూడు పూటలా ముక్కల్దాకా తింటాండాము. అప్పుల్లేవు. ఇంట్లో ఎవురూ ఎసనంతో సావలా..." అంటా వలవలా ఏడ్చేసినాడు సుధాకర్ నాయుడు.

భాస్కర్‌కు అర్థమయ్యీకానట్టుగా ఉండాయి ఆ మాటలు. కాలవలో ఎండిన నీళ్ళకు చెరుకాకులు అడ్డం పడింటే పోయి వాటిని తీసేసి వచ్చి మౌనంగా

KLVA101M133

కూర్చున్నాడు భాస్కర్.

కాసేపటి తర్వాత పైపు దగ్గరికి పోయి ముఖం కడుక్కుని వచ్చి చెట్టుకింద కూర్చుని భాస్కర్ వైపు చూసి బలవంతంగా నవ్వాడు సుధాకర్ నాయుడు.

భాస్కర్ కూడా నవ్వి వూరుకున్నాడు. సుధాకర్ నాయుడు మాటలు కొనసాగించాడు.

"మాది ఉమ్మడి కుటుంబరం... తెలుసుకదా అబ్బోడా. ఇప్పటికి పన్నెండు బోర్లేసినాం. నీళ్ళులే. అప్పులయిపోతిమి. దినమ్మూ ఇదే ఏసనంతో మా అన్న నెలకింద కయ్యకాడ చెట్టుకు ఉరేసుకోని సచ్చిపాయ..." మాటలాపేశాడు. గొంతుకు ఏదో అడ్డుపడ్డట్టుగా మాటలు పెగల్లేదు. తెపరాయించుకున్నాక "వాన పడలా. నీళ్లు లేకుంటే సేద్యం లేదుగదా. వానలేదు. బోరెయ్యాల్సిందే. మన ఇలాకాలో దుడ్డుండే మనిషి మీ వూరి సర్పంచేగదా. ఎవురికి అప్పుకావాలన్నా ఆయన దెగ్గిరికి పోవాల్సిందే. కడాసారిగా బోరేద్దామనుకున్నేం. ఈ సారి నీళ్లు పడకపోతే అయిన కాడికి తెగనమ్మేసి అప్పులకు కట్టేసి టౌనుకు పోతాం. ఆడ కూలి చేసుకున్నే బతికి పోవచ్చు. బోరేసేదానికి దుడ్డుకోసరమని సర్పంచుకాడికిపోతి. వూగే కుర్చీలో కుచ్చోని ఎనిక్కీ ముందుకూ వూగతా ఆయప్ప 'తినింది అరక్క రైతులు సస్తాండారు' అంటాడా. వోడు మనిసే నంటావా" మళ్ళా కోపం వచ్చేసింది సుధాకర్ నాయుడుకు.

"నువ్వేమన్నేవు మామా"

"ఏమంటాను... కాలం మనదిగాదు. పేదోనికోపం పెదవికి చేటుగదా. గమ్మున వచ్చేసినా. ఎవురితో చెప్పుకోలా అబ్బోడా. ఇంట్లో పెద్దోళ్ళమందరమూ రెండు దినాలనించీ పస్తుండాం" అతని గొంతు మూగబోయింది.

చాలాసేపు మౌనంగా వుండిపోయారు ఇద్దరూ.

"ఇంటికి పోతాండా అబ్బోడా" లేచినాడు సుధాకర్ నాయుడు.

"వుండుమామా... అమ్మ అన్నం తెస్తాది" అన్నాడు భాస్కర్.

"ఆ మాట చాల్లే అబ్బోడా. తిన్నంత తృప్తి. ఇంగోసారి కడుపు నిండుకు నీళ్ళు తాగిపోతా" అని నీళ్లుతాగను పైపు దగ్గరకు పోయాడు సుధాకర్ నాయుడు.

నీళ్లు తాగుతున్న సుధాకర్ నాయుడిని చూస్తుంటే భాస్కర్ మనసు పాతాళభైరవితో కలబెట్టినట్టయింది.

## 2

"ఈసారి దరిద్రం తీరిపోయినట్టే..." అన్నాడు నారాయణ బీడీపొగ నోటినిండుకూ లాగి వదులుతా.

చుట్టూ పరిశీలనగా చూసి "ఔన్నా" అన్నాడు నాగులయ్య కూడా బీడీతాగుతా.

"ఈ మాదిరిగా వాన పడి ఎన్నాళయిందినా... మాయమ్మి పెద్ద బిడ్డయిన సమచ్చరం పన్నేయి వానలు. ఆయమ్మికి పెండ్లయ్యి ఇద్దురు బిడ్డలుగూడా..". కలగజేసుకున్నాడు గంగులయ్య.

వాడుమొగం పెట్టినాక వానపడితే కళకళలాడే వేరుశనగ చెట్టు మాదిరిగా ఉండాడు నారాయణ. పంచెను పుట్టుగోసి చెక్కిండాడు. తలకు రుమాలు చుట్టిండాడు. వంటి మీదుండే గాడాగుడ్డ బన్నీను దుంకలు పడిండాది. మోకాళ్లదాంకా బురదుండాది. గోసీమీదా బురద చుక్కలుండాయి. మిగిలిన ఇద్దరూ దాదాపు అదే విధంగా ఉండారు.

"ఎంతన్నా.. నాలుగెకరాలా...?" అడిగినాడు చేడకేసిండే మడికల్లా చూసి నాగులయ్య.

"బాయికింద ఉండేదంతే గదా. చెరువుకింద రెండెకరాలు..."

"అంతా మడే.నాటేస్తాండారాన్నా..." అన్నాడు గంగులయ్య.

"నాటనీరా... నీళ్ళున్నెప్పుడు గూడా మడినాటుకోకుంటే ఎట్ల? చెరువుకింద నాటేస్తే ఉద్దరకు పండిపోతాయి కదా. మిషనెయ్యాల్నా పాడా.. ఈడన్నా కరెంటుండాల" అన్నాడు నాగులయ్య.

పొడవు నిక్కరు, బన్నీను వేసుకోని పారతో అండచెక్కతా ఉండే భాస్కర్ మోకాళ్ళమింద చేతులానించుకోని తలపైకెత్తి 'ఎంచేపు మీరు బీడీలు తాగేది. అన్న మేళ అయితాండాది. రాండి బిన్నే" అన్నాడు.

"వస్తాండాంలేప్పా... అర్సద్దు... ఈనికెప్పుడూ పనిమిందే లోకం" అని గబగబా రెండు దమ్ములు లాగి బీడీని మడి కయ్యిలో ఏసి "రాండి పోదాం" అంటా కయ్యిలోకి దిగినాడు నారాయణ. నాగులయ్య, గంగులయ్య బీడీలను ఆర్పి చెవుల్లో చెక్కోని కయ్యిలోకి దిగినారు. మడకల దగ్గరుండే ఎద్దులు నెమురేస్తా నిలబడుకోనుండాయి. బురదలో చెక్కిండే ముల్లుబరగ తీసుకోని ఎడం చేత్తో మేడి పట్టుకోని "హయ్... హయ్.." అని ఎద్దుల్ను అదిలించినాడు నారాయణ. అతన్ని అనుసరించారు మిగిలిన ఇద్దరూ.

కనిపించేంత దూరం పచ్చగా ఉండాది. పచ్చగా లేనితావనంతా నీళ్ళుండాయి. చెరువులూ, బావులూ నీళ్ళతో తొణకతా ఉండాయి. మడికయ్యలన్నీ చేడకేసిండారు. దాదాపు రైతులందరూ సేద్యం పనుల్లో ఉండారు. కొందరు హుషారుగా పాటలు పాడతాండారు.

"అన్నో.. ఒదిన అన్నమెత్తుకోనొస్తాండాది" అన్నాడు గంగులయ్య.

"పొద్దు పదిబారలుగూడా ఎక్కలా. కడుపులో నక్కలు దూరినాయంటరా" నవ్వతా అడిగినాడు నాగులయ్య.

"ఈ పొద్దు సద్దిగూడా తాగలా..., నారాయణన్నోళ్ళ పనిగదా. అట్లే వచ్చేసినా." బదులిచ్చినాడు.

"రండిబ్బా.. తిందురు..." కానగ చెట్టుకింద అన్నం గంపను దింపి పిల్చింది సావిత్రమ్మ.

"పొండి పొండి... తిందాము... ఓ...ఓ..ఓవ్..." అంటా పగ్గాలు బిగపట్టినాడు నారాయణ. ఎద్దులు తలలు పైకెత్తి నిలబడిపోయినాయి.

ఎనక మడకలు కూడా నిలిపేసినారు. పగ్గాలను మేడికి చుట్టి, ముల్లుబరగలను పక్కనే బురదలో చెక్కి గెనంమిందికి వచ్చినారు.

"ఏం కూరొదినా..." అడిగాడు నాగులయ్య.

"ఏదోలేప్పా... ఊరిమిండో పచ్చిపులుసో...కలిగింది చేసుకోనొచ్చిండాలే రాండి" అనింది సావిత్రమ్మ.

భాస్కర్ కూడా అండ చెక్కేది ఆపేసి గెనంమిందికి వచ్చినాడు. అందరూ కానగ పుల్లలు యింకోని నమిలి ఇట్ల నాలుగుసార్లు అట్ల నాలుగుసార్లు తోమి బయికాడికి పోయి నోర్లు, కాళ్ళు, చేతులు కడుక్కున్నారు.

బాయినిండి పొళ్ళుతాండే నీళ్ళను చెర్లోకి పొయ్యే వంకలోకి మళ్లించిండారు. బోరు మోటారు తీసి బాయిగడ్డన పెట్టి సంచిపట్టలతో కప్పెట్టిండారు.

పచ్చగా ఉండే నారును చూసి "ఎన్నాళయిందినా నారుపోసి" అడిగినాడు గంగులయ్య.

"ఈ పొద్దు శుక్రారం కదా. రేపటికి సరిగ్గా నాలుగు వారాలు అవుతాది." చెప్పినాడు నారాయణ.

"ఎప్పుడు నాటాలని?"

"జిలకర మసూర కదా. ఆరువారాలకు నాటదామని. చేడకేసేసి ఆకు తొక్కి వొదిలి పెట్టేసినా మంటే... మళ్ళ నాటేది" అన్నాడు నారాయణ.

"ఆకేడుండాదినా..."

"చేనికాడ కానగచెట్లు, యాపచెట్లు ఉండాయి గదా. ఉండేకాడికి ఏసేది" అన్నాడు భాస్కర్.

అందరూ చెట్టుకిందకు వచ్చినారు. భాస్కర్ బిందె తీసుకొని పోయి బాయిలో నీళ్ళు ముంచుకొని వచ్చినాడు. వర్సగా కుచ్చిన్నారందరూ. మర్రి ఆకులతో కుట్టిన విస్తరాకులు ఇచ్చింది సావిత్రమ్మ. ఆకుల్లో నీళ్ళు చల్లుకున్నాక అన్నం పెట్టి చెన్నిగ్గింజల ఊరిమిండి వేసింది.

అన్నం చూస్తానే "ఏంది ఒదినా... స్టోర్ బియ్యమన్నం మాదిరిగా ఉండాదే"

అన్నాడు నాగులయ్య.

"స్టోర్ బియ్యం కాక ఈడ మీ అన్నేమన్నా రాజనాలు పండించినాడాప్పా" అడిగింది నవ్వుతా సావిత్రమ్మ.

"పండించేదానికి మీ దొదేమన్నా వాన కురిపించిందేమో అడుగుప్పా" అన్నాడు నారాయణ ఒక ముద్ద కండ్లకద్దుకొని పక్కన పెడతా.

"ఎప్పుడూ జిలకరమసూరానే కదాన్నా పండిస్తాండారు" అడిగినాడు గంగులప్ప.

"పండిస్తే... అయ్యి ఎవురో మారాజులు తినేదానికి. ఉద్యోగస్తులు, మన మండల ప్రెసిడెంటు..., ఎంపిపిలు, ఎమ్మెల్యేలు, మంత్రులు తినేదానికి, మనం తినేదానికా...?" ఎదురు ప్రశ్నించినాడు నారాయణ.

"ఆరేండ్లసంచీ స్టోర్ బియ్యమే తింటాండాం. ఒగోసారి అయ్యి కొనుక్కోవాలన్నా కష్టమయితాండాది" చెప్పినాడు భాస్కర్.

కొంతసేపు అందరూ మౌనంగా ఉండిపోయారు.

"కూలోల్లమూ స్టోర్ బియ్యమే తినేది, రైతులూ స్టోర్ బియ్యమే తినేదా..." గొణిగినట్టుగా అన్నాడు నాగులయ్య.

"మీరే మేలుబ్బా... పనులుండే వూర్లకు పోయి కూలిపని చేసి సంపాదించుకొని తింటారు. మేమది కూడా చెయ్యలేమే. ఇంట్లో పుట్టి పెరిగిన ఎద్దులను అమ్ముకొని బియ్యం కొనుక్కోని తిన్నేమే" అనింది సావిత్రమ్మ. ఆమె గొంతులో జీర ధ్వనించింది. అన్నం తినేంత సేపూ ఎవ్వరూ మాట్లాడలేదు.

అన్నం తిని చేతులు కడుక్కుంటా ఉండగా సుధాకర్ నాయుడు వచ్చినాడు. మనిషి బాగా అలిసి పోయినట్టుగా ఉండాడు.

"బాగుండారా సుధాకరా... యాడికి పోయింటివిప్పా..." అడిగినాడు నారాయణ.

"...బీడీ ఒగటీమామా.. తలనొప్పిగా ఉండాది" చెట్టుకిందికొచ్చి అన్నాడు సుధాకర్ నాయుడు.

నారాయణ బీడీ అగ్గిపెట్టె ఇచ్చినాడు.

"అన్నం తినున్నా" అంది సావిత్రమ్మ.

"అన్నం తినేది మానేసిండామ్మా... దినమ్మూ కడుపు నిండాకు మా అమ్మ నెత్తురు తాగతాండా..." అన్నాడు బీడీ ముట్టించుకొనేది కూడా ఆపేసి.

అక్కడున్న ఐదుమందీ ఆ మాటలతో బిత్తర పోయినారు. పిచ్చివాన్ని చూసినట్టు సుధాకర్‌నాయుడు వైపు చూసినారు.

సుధాకర్ నాయుడు బీడీ వెలిగించి దమ్ములాగి పొగ వదులుతూ అందరివైపూ చూసినాడు. ఆ చూపుల్లో దేనిమీదో, ఎవరిమీదో..., కసి కోపం కనిపించాయి.

"ఏంది సుదాకరా... నువ్వు చెప్పింది నాకేం అర్థం కాలా.." అన్నాడు నారాయణ మెల్లగా.

"ఎందుకర్తమయితాది... కాదు... అయినా కానట్టేగదా ఉంటావు. రెయ్యీపొగులూ కడుపులు అంటగట్టుకోని కష్టపడతాండేది మేము. నెత్తురునంతా చెమటరూపంలో కార్చి జిలకర మసూర పండిస్తాండేది మేము. అయ్యి ఇంట్లో కుచ్చోని పలావన్నం పండించుకొని తింటాండేది నువ్వు. కడుపుతో ఉన్నె ఆడబిడ్డ జిలకర మసూరన్నం కావాలమ్మా అంటే పెట్టేదానికి ఇంట్లో ఒక పావుగూడా లేవు. మేం పండించి నోటియన్నీ తింటాడేది మేమా నువ్వా... మా నెత్తురు కూడు తినేది నువ్వు.. మేము మడిచేస్తే తల్లి నెత్తురు తాగిందాంతో సమానం అంటావా" ఆవేశంగా అన్నాడు సుధాకర్ నాయుడు.

భాస్కర్‌కు తప్ప ఎవరికీ అర్థం కాలేదు ఆ మాటలు.

"మళ్లా ఎవురన్నా ఏమన్నా అన్నేరా మామా" అడిగినాడు భాస్కర్.

"ఎవురన్నా ఎందుకంటారు. వోడే... ఆ ఎంపిపి. ఇంతకు ముందు సర్పంచుగా ఉన్నేడు కదా. ఇప్పుడు ఎంపిపి అయ్యేలకు కండ్లకావరం పెరిగిపోయిండాది. వానలు పన్నేయి కదా. వడ్ల నారు పోసిండా. నాలుగెకరాలు మడి నాటాల. ఊరికే అయితాదా. చేడకెయ్యాలంటే దుడ్డుకావద్దా. అందుకని ఆయప్ప ఇంటికి పోతి ఆయనంటాడు... 'వానలు పన్నేయి..., నీళ్లుండాయిగదా అని సంబరంగా మడి నాటతాండారా... అందురూ మడినాటితే నీళ్ళు ఎన్నాళ్ళుంటాయి. కరెంటు యాట్నించి తెచ్చిస్తాం... 'మడినాటితే తల్లి నెత్తురు తాగినట్టే' అంటాడా?... సరిపోయిందా నేయం. ఇన్నేండ్లు మడి చెయ్యక తిండికి లేక అల్లాడినాం. ఇప్పుడు నీళ్ళుంటే మడి చెయ్యకుండా ఎట్లుంటాం. కరెంటు సరిపోకపోతే ఈళ్ళెందుకుండేది. పెరికేదానికా..?" మళ్లా కోపం వచ్చేసింది సుధాకర్‌నాయుడుకు.

ఆరిపోయిండే బీడీని వెలిగించాలని నాలుగైదు అగ్గిపుల్లలు గీసినాడు. చేతులు వణుకుతుండటంతో బీడీని వెలిగించలేక పోయినాడు. బీడీని ఇసిరి పారేసి తమ వూరి బాట పట్టినాడు.

"అన్నం తినునా.." అంటున్న సావిత్రమ్మ మాటలను కానీ, "మామా... మామా..." అని పిలుస్తున్న భాస్కర్ మాటలనుగానీ పట్టించుకోలేదు. వెనక్కు తిరిగి కూడా చూడలేదు.

అందరూ అతడినే చూడసాగారు.

సుధాకర్ నాయుడు కదులుతున్న దుఃఖ పర్వతంలా కనిపించాడు భాస్కర్‌కు. ఎంపిపి మాటలు తలచుకుంటే కోపం గొంతుదాగా తన్నుకొచ్చింది.

## 3

"రామేశ్వరం పోయినా శనేశ్వరం పోలేదంట అబ్బోడా"

గెనమిమిందుండే గడ్డిని కక్కలకొడవలితో కోస్తాండే భాస్కర్ పని ఆపి తలెత్తి చూసినాడు. ఎదురుగా సిద్దారెడ్డి.

"ఏం పెద్నాయనా అట్లంటివే" అడిగినాడు భాస్కర్.

"మడంతా నేల నెర్రెలిచ్చిండాదే. నీళ్ళులేవా?" ప్రశ్నించాడు సిద్దారెడ్డి.

"నీళ్లుంటే... కరెంటు సక్రమంగా ఉండద్దా" ఎదురు ప్రశ్నించాడు భాస్కర్.

"అదే నేనంటాండేది" అన్నాడు సిద్దారెడ్డి బీడీ వెలిగించుకుంటా.

అవునన్నట్లుగా తల వూపుతూ కోసిన గడ్డిని తెచ్చి కానగ చెట్టుకింద వేసినాడు భాస్కర్.

"ట్రాన్స్‌పారం ఎప్పుడు బాగవుతాదంట అబ్బోడా?" అడిగినాడు సిద్దారెడ్డి.

"స్టాకు లేవంట. ఇంగా నాలుగు రోజులు పడతాదంటా ఉండాడు ఎయి" బదులిచ్చినాడు భాస్కర్.

నాలుగెకరాల్లో నాటిండే వరి మొత్తం పాలకంకి మీదుంది. పక్కన అరెకరాలో నాటిండే మిరపచెట్లు నిండుకూ మిరపకాయలున్నాయి. అయితే చెట్లన్నీ వాడు మొగం పెట్టిండాయి. వాటికాపక్కనుండే సిద్దారెడ్డి సేద్యం కూడా అట్లే ఉంది.

"ఇప్పటికే నాలుగు దినాలయితాండాది ట్రాన్స్‌పారం కాలిపోయి. మళ్ళన్నీ పగుల్లిచ్చినాయి. తోటలన్నీ వాడుమొగం పెట్టిండాయి. ఎండ చూడు ఎట్ల కాస్తాండాదో. ఇంగ నాలుగుదినాలకు రిపేరు చేస్తే.. అందాకా పాణంతో ఉంటాయా ఇయ్యి" అన్నాడు వరిపైరుకల్లా చేత్తోపనా

చూపుతూ సిద్దారెడ్డి

"ఏం చేద్దాం పెద్నాయనా మన చేతుల్లోపనా...

ఫీజు పొయ్యింటే ఎప్పుడో ఏసుకోనుందుము. అందురూ కెపాసిటర్లు బిగించుకుంటే కాలిపోయిండదు అంటాడు ఎయి" అన్నాడు భాస్కర్ మళ్ళీ గెనం వద్దకు పోయి గడ్డికోస్తా.

"వోళ్ల మొగంలే. అప్పుటికి నువ్వు పుట్టినావో లేదో. ఇరవై ఏండ్ల ముందే చానా మంది రైతులం కెపాసిటర్లు బిగించుకోనుంటిమి కదా. మీ నాయన గూడా బిగించిన్నేడు. నాలుగైదు నెల్లకు మించి పనిచెయ్యలా.. అప్పుడు కాలిపోలేదా ట్రాన్స్‌పారాలు?"

"ఔనంట... మా నాయన చెప్పినాడు"

"ఔనబ్బోడా.. మీ నాయన నాలుగుదినాలమింటీ కనపల్లేదే. అక్కోళ్ల

ఇంటికి పోయినాడా?" అడిగినాడు సిద్దారెడ్డి.

"యాడికీ పోలా పెద్నాయనా.. ఇంట్లోనే ఉండాడు. చికున్ గున్యా అంటనే... అదొచ్చిండాది. కీళ్ళు కీళ్ళు వాపులొచ్చిండాయి. ఇట్లుండే కాలు తీసి అట్ల పెట్టలేకుండా ఉండాడు" చెప్పినాడు భాస్కర్.

"అయ్యయ్యో.. అదొచ్చిందా... ఆస్పత్రికి పోలా"

"గర్నిమిట్ట గవుర్మెంటాసుపత్రికి పిల్చక పోయిన్నే... సూదులేసి మందులిచ్చినారు"

"పీలేరుకు పొయ్యిండకూడదా...? టౌనుకు పోతే మంచి డాక్టర్లు ఉంటారు. బాగ చూస్తారు బిన్నే బాగయితాది" అన్నాడు సిద్దారెడ్డి.

"పోతే బాగయితాదీ... దుడ్డేడుండాది పెద్నాయనా... మడి దున్నకాలకు, నాట్లకు, కలుపులకు అంతా అప్పే కదా. రెండు సార్లు ఎరువులు ఏసినాం. అయ్యో అప్పే. ఇంట్లో ఒకరూపాయి లేదు. టౌనుకు ఆస్పత్రికి పోయి రావల్లంటే పూరికే అయితాదా. మున్నూరు రూపాయలన్నా కాదా" దిగులుగా అన్నాడు భాస్కర్.

చాలా సేపు మౌనంగా వుండిపోయాడు సిద్దారెడ్డి.

"ఏం చేద్దాం అబ్బోడా. మా పరిస్థితి కూడా అట్లే ఉండాది. కెపాసిటరు బిగించాలని మున్నూరు రూపాయల కోసరం వారం దినాలమింటీ తిరగతాండా. యాడ దొరకలా" అని చెప్పి ఇంకో బీడీ వెలిగించాడు.

"హయ్... హయ్ ఎవురో గొడ్లు వదిలేసిండారే" అంటా గెనం మింద పరిగెత్తా పోయినాడు భాస్కర్.

మిరపతోటలోకి వస్తాండే ఆవు ఆన్నే ఆగిపోయింది. రెండు క్షణాలు భాస్కర్‌నే చూసి ఆట్నించి అట్లే వెనక్కు పరిగెత్తింది.

"గొడ్ల మేతకు తోలుకుని పోయినోళ్ళు ఎనకంటీ ఉండి, ఇండ్లకు తోలుకోనొస్తే కదా." అంటా వచ్చినాడు భాస్కర్.

సాయంకాలం అవుతోంది. మేతకు పోయిండే పశువులు వూరి దారి పట్టించాయి. భాస్కర్ కోసిండే గడ్డిని దారాలతో మోపుగా కడతాండాడు.

"ఏం రమణా... పందెం పుంజునెత్తుకొని పోతాండావే... యాడన్నా పందెమా?" అన్నాడు సిద్దారెడ్డి.

"పందేలకేడ పోతాండా మామా... చానా ఏండ్లాయనే నిలిపేసి... ఆ ఎంపిపి ఇంటికిగినీ..." అన్నాడు రమణ దోవలోనించీనే.

"ఎంపిపి ఇంటికా... ఎందుకు?"

"ఏదన్నా కష్టం తీరాలంటే గర్నిమిట్టమ్మకు పొట్టేలిని ఆగతిస్తాం కదా. అట్లే ఏదన్న పనికావాలంటే ఈయప్పకు పందెం కోడిపుంజును ఆగతివ్వాల. అట్లయితేనే పని బిన్నే అయితాది" అన్నాడు నవ్వలేక నవ్వతా రమణ వాళ్ళ దగ్గరకు వచ్చి.

"ఏం చేస్తాడు అయ్యన్నీ... పందేలకు పోతాడా" అడిగినాడు భాస్కర్.

"ఆ.. తినేదానికి సాలవు ఇయ్యన్నీ... ఒగ కోన్ని కోసి ఏంచి పెడితే.., మందు తాగతా ఒగడే తినేస్తాడంట. ఒగ తునక కూడా మిగిలీడంట".

"ఎవరు చెప్పినారప్పా నీకు" అన్నాడు సిద్దారెడ్డి.

"ఎవురో చెప్తే ఎట్ల తెలస్తాది. ఆయన దెగ్గిర ఉండ్లా గుమాస్తా... వోడు చెప్పినాడు ఒగదినం. కోడేకాదు... దాంట్లోకి మళ్ళా జికర మసూరాతో పలావన్నం కూడా వుండాలంట. అట్ల తిండి తినే కదా దేవెద్దు మాదిర్తో ఉండాడు" చెప్పినాడు రమణ.

"సుధాకరా... ఏం మాట్లాడకుండా పోతాండావే... రా పోదువుగానీ..." దోవలో పోతాండే సుధాకర్ నాయుడుని పిల్చినాడు సిద్దారెడ్డి.

దగ్గరకు రాకుండా దోవలో నిలబడుకోని వీళ్లవైపు చూసినాడు సుధాకర్ నాయుడు.

"ఏంనా... ఉరిమి చూస్తాండావే..." అన్నాడు రమణ నవ్వతా.

"ఇప్పుడే ఫుల్లుగా తాగేసి వస్తాండా... పలావన్నం తిన్నే... జ్యోతిలక్ష్మి సినిమా చూసినా..." అంటా వాళ్ళ దగ్గరకు వచ్చినాడు.

"ఏందిరా తిక్కలోని మాదిరిగా మాట్లాడతాండావే" అన్నాడు సిద్దారెడ్డి.

"ఎవునికి మామా తిక్క... నీకు తిక్కేమో... మీ మాదిరిగా నేనేమన్నా దినమ్మూ టౌనుకు పోతాండానా...? హోటల్లో పలావన్నం తింటాండానా...? మందు తాగతాండానా...? సినిమా చూస్తాండానా? కోపంగా అడిగినాడు సుధాకర్ నాయుడు.

మళ్ళా ఏదో అయ్యింది అనుకున్నాడు భాస్కర్.

"అర్థమయ్యేటిగా చెప్పరా" విసుక్కున్నాడు సిద్దారెడ్డి.

"నీళ్ళుండాయా అబ్బోడా..." అడిగినాడు భాస్కర్‌ను.

"లేవు మామా... ట్రాన్స్‌ఫారం కాలిపోయి మూడు దినాలయితాండాది" అన్నాడు భాస్కర్.

"ఇన్నిన్ని కోట్లు దేనికి దేనికో ఖర్చు చేస్తాండారు కదా... అట్లే కెపాసిటర్లు కూడా బిగించింటే ఈళ్ల అబ్బ గంటేమి పోయిండు. అయ్యి లేకనే అంట కదా కాలిపోతాండేది" అన్నాడు సుధాకర్‌నాయుడు. అందరూ మౌనంగా వుండిపోయారు.

"మా వూర్లో గూడా ట్రాన్స్‌ఫారం కాలిపోయి వారం దినాలయితాండాది. ఆ ఎయికి దినమ్మూ చెప్తాన్నే పట్టించుకోలా... పంటలన్నీ వాడుమొగం పెట్టినాయి. ఎంపిపికి చెప్తే ఎయిని అరస్తాడు. కొత్తది బిగిస్తారని అనుకుంటి. అందుకనే వోనింటికి పోతి. అందలమెక్కాలకు మనమెవ్వరం కానరావడం లే. పరిస్థితంతా ఇదీన్నా అని చెప్తే... కెపాసిటర్లు బిగించుకోండి అనె. సరేన్నా... పంటరానీ... ఇప్పుడు దుడ్డేడుండాది అంటి... దానికేం చెప్పాల... మీరే చెప్పండి" అన్నడు సుధాకర్ నాయుడు.

ఎవ్వరూ మాట్లాడలేదు. తిరిగి తనే మాటలందుకున్నాడు.. "దినమ్మూ టౌనుకు పొయ్యి మందుతాగేది, పలావన్నం తినేది, సినిమాలు చూసేది... ఒగరోజు మానుకో... ఆ దుడ్డుతో కెపాసిటర్ కొనుక్కోవచ్చు అంటాడా... మనిసేనా వోడు" కోపంగా అన్నాడు సుధాకర్ నాయుడు.

"రైతులను చూస్తే అట్లుండాది నాయకులకు... ఏం చేద్దాం..." అన్నాడు సిద్దారెడ్డి.

"కండ్ల కావరం మామా... కండ్ల కావరం... యాడికి రమణా.. పందేనికా" అన్నాడు సుధాకర్ నాయుడు.

'కాదన్నా... ఆ ఎంపిపికిచ్చేదానికి. దుడ్డు పదివేలు కావాల. నెల నించీ తిరగతాండా. ఇప్పుటికి నాలుగు పందెం కోళ్ళు ఇచ్చినా..." అన్నడు రమణ దిగులుగా.

రమణ చేతుల్లోని పుంజు "కొక్కొరో...కో..." అంటా కూతేసింది.

సూర్యుడు పడమర కొండల మీదున్నాడు.

ఒక్కసారిగా పూనకం వచ్చిన వాడిలా రమణ చేతుల్లోని పుంజును లాక్కొని దాని గొంతు కొరికి రక్తం తాగేసినాడు సుధాకర్ నాయుడు. అందరూ బిత్తర పోయి చూస్తా నిలబడుకోనుండారు. రక్తం తాగేసినాక కోడిని ఇసిరి కొట్టి "ఏ నాకొడురా... రైతుల్ను తక్కువచేసి మాట్లాడేది. వోని నెత్తురు తాగతా... రైతంటే ఏమనుకోనుండారో..." అంటా ఏదేదో గట్టిగట్టిగా అరుస్తాండాడు సుధాకర్‌నాయుడు. మనిషి వూగిపోతాండాడు.

"వాంట్లోకి గర్నిమిట్టమ్మ వచ్చినట్టుండాది" అన్నాడు సిద్దారెడ్డి.

అరిచీ అరిచీ అక్కడే స్పృహ తప్పిపడిపోయాడు. నీళ్లకోసం రమణ వూరివైపు పరుగులు తీశాడు.

"సుధాకరా... సుధాకరా..." అంటా వూపతా ఆందోళనగా పిలస్తాండాడు సిద్దారెడ్డి. అచేతనంగా పడివున్న సుధాకర్‌నాయుడిని చూస్తాంటే భాస్కర్ పిడికిళ్ళు బిగుసుకున్నాయి. అస్తమిస్తున్న సూర్యకిరణాలు భాస్కర్ కళ్లలో కదలాడతాండాయి.

*

☆ డా. దిలావర్

# ఇన్సానియత్




రాంరెడ్డి మేడమీన బంకుల జువ్వాట జోరుగ ఆడబట్టిండ్రు.

సావిట్లె కూకొని పంచాతులు పైసలా జెయ్యకున్న సుత రెడ్డికి బుగులుండదు. గని ఒక్కరోజు సోపతిగాండ్లతోని పేకాట ఆడకుంటె మట్కు తల్లడమల్లడమైతడు. గాయన జాయిజాద్, దర్జ, ఫకర్ తెల్వనోడు ఆ యిలాకల ఒక్కడు సుత లేడు. గట్లనే గాయనంత జువ్వబాజిగాడు సుత ఆ యిలాకల ఒక్కడు సుత లేడు. పేకాటల గాయన తోటి ఆడి గెల్సినోల్లు సుత ఎవ్వలు లేరు.

రంగాచారి ముక్కైతే ఎత్తుకున్నడుగని మల్ల ఏ ముక్క ఎయ్యాల్నా అని తటపటాయిస్తుండు.

"ఆర్నీ.. ఆయగారూ....! గిదేమన్న మంత్రాలు సదవటమనుకుంటివా? జల్ది ఎయ్యెహె..." కసిరిచ్చుకున్నడు రాంరెడ్డి.

ఏ ముక్కేత్తె ఏం తంటో అని లోపట్ల ఫికరు పడుకుంటనే ఆటీను రాణిని డిస్కార్డు జేసిండు రంగాచారి.

"థూ నీయవ్వ.... గీ అయగార్లకు మోకాల్లల్ల వుంటదెహె దమాకు. గిప్పుడే సుబాని ఆటీను జాకీ ఎత్తుకోంగ సూడనె సుత్తిమి. మల్ల ఆటీను రాణి ఏత్తివేంది?" నోట్లెవున్న పొరచుట్టను దూరంగ వుంచుకుంట అన్నడు రాంరెడ్డి.

గోడమీదున్న బల్లి పురుగును లటుక్కున మింగినట్టు ఆటీను రాణిని ఆత్రంతంగ అందుకొని 'షో' అన్నడు సుబాని.

"అర్రెరెరె......" నాల్కె కర్సుకున్నడు రంగాచారి.

"గిప్పుడు పచ్‌తాయిస్తె ఏం ఫాయిదా? ముందుగాల్నె వుండాలె కయాలు....." అన్నడు రాంరెడ్డి. గాయనకు అయగారి బొండ్గె పిస్కి పారెయ్యాలన్నంత కోపమస్తంది.

"అయగారు ఆగం ఆగంగ ముక్కేత్తె.... అడుగు బడ్డట్టు నాది ఫుల్ కౌంటయింది...." కాపోల్ల ఎంకన్న లోపట లోపట్ల గుల్గుడు షురూ జేసిండు.

ఈ పాలి ముక్కలు కలిపెయ్యటం రంగాచారి వంతు. రెండు చేతుల్లకు సగం సగం ముక్కలు దీస్కొని 'కట్' చేసి అందర్కి పంచిండు.

"అయగారూ...! గీపాలి గిన్క ముక్కలు సరింగ పడక పోవాలె.... గప్పుడు జెప్పుత నీ సంగతి...." బెదరగొట్టిండు రాంరెడ్డి.

రంగాచారి గుండెలు దడదడ కొట్టుకున్నయ్.

"ఆర్నీ అన్నాలెంగూల. ఏం ముక్కలయ్యా గియ్యి? మీరే ఆడుకోండ్రి. నేను డ్రాప్ జేత్తన్న" అనుకుంట చేతిలున్న పేక ముక్కల్ని సాపమీన్కి యిసిరేసిండు రాంరెడ్డి. "బోడ ముండకు దండం బెట్టె నువ్వూ నా లెక్కనె వుండు అన్నదట. గీ అయగార్ని నమ్ముకుంటె మనకు సుత బూడ్దే గతి". మల్ల తనే అన్నడు కసితీరక.

ముక్కలు చేతులు మారుతున్నయ్. రాంరెడ్డి మొకంల రంగులు మారుతున్న కొద్దీ రంగాచారి గుండెలు బేజారైపోతన్నయ్. సుబాని మాంచి వూపుల వున్నడు. జరసేపట్కే 'షో' అన్నడు వుషార్గ.

రాంరెడ్డికి మండుకొత్తాంది. శాన కష్టం మీన సంబాలించుకుంటాండు. నిప్పుల మీన కూకున్నట్టు అనిపిత్తాంది గాయనకు.

గీపాలి కాపోల్ల ఎంకన్న ముక్కలు కలిపేశిండు. 'యాడున్నవే శనేశ్వరమా అంటె నీ ముడ్డెన్కనె దాక్కున్న' అన్నదట. గట్లనె వున్నది గిది సుత అనుకున్నడు రాంరెడ్డి. సరైన ముక్క ఒక్కటి సుత పడ్తలేదు. గని డ్రాప్ జెయ్యదల్సుకోలేదు. మేకపోతు గాంభీర్యంతోని ఆడ్తన్నడు రాంరెడ్డి.

ఈ పాలి సుబాని ఆట యింకా మా జోరుగున్నది. మూడు జోకర్లచ్చినయ్. మూడు రౌండ్లకే 'షో' అన్నడు.

రాంరెడ్డికి పేకాటల వోడిపోతన్నట్టుగ లేదు. తన దర్జ, దర్పం ఒక్కొక్క మేడమెట్టు మీదికెల్లి జారిపడ్తన్నట్టుగ అనిపిస్తాంది. సుబాని కొడ్తన్న ఒక్కొక్క 'షో' తన కాన్దాన్, తన మషూర్, తన యిజ్జతి మీన కొడ్తన్న ఒక్కొక్క దెబ్బోలె అనిపిస్తాంది. ఈ యిలాకల్నె తనతోని పేకాట ఆడి గెల్సిన మొగోడు లేడు అన్న నామ్ కమాయించుండు. అ నామ్ గిప్పుడు గీ సుబాని గాడు జెయ్యబట్టి బద్నామ్ అయ్యేటట్టుగుంది. భార్యను జువ్వల వోడిపోయిన దరమరాజు ఎట్ల వొర్సుకున్నడో గని తనకు మాత్రం పెయ్యిమీన వున్న గుడ్డలూడగొట్టి బరిబాతల బజాట్ల నిలబెట్టినట్టు అనిపిస్తాంది.

గీ తుర్కోడు జమాయించి మూడు 'షో'లు జెయ్యటమేంది? తను ఫుల్ కౌంట్లియ్యటమేంది? ఉక్కురోశం లోపట్లనుంచి తన్నుకొని వస్తాంటె కలెపెల మర్గుకుంట ఆవిర్లు గక్కె ఉడ్కు నీల్లోలె అయితాండు రాంరెడ్డి.

"ఎంత జేసిన గీతుర్క లత్కోర్ గాల్లకి యిశ్వాసం వుండెదెహె...." అన్నడు రాంరెడ్డి. గట్లన్నంక ఆవిర్లు మూతను తన్నుకొని బయట పడ్డట్టు గాయన మనసు జర్రంత తేలికైంది.

దెబ్బకు దిమ్మెర పోయిండు సుబాని.

"గదేందె చిన్నాయన.... గట్లంటివి?" అఫ్‌సోస్గ రాంరెడ్డి కెల్లి సూస్కుంట అన్నడు.

"ఒక్క పేకాటే కాదు మల్ల, ఇంకే ఆటైనా గంతే. క్రికెట్‌ల పాకిస్తాన్ అగర్‌చ గెలిస్తే పండగ జేస్కుంటరు బే యిమాన్ గాల్లు". అమ్ముల పొదిల కెల్లి ఒక్కొక్క బాణం తీస్కొని గురితప్పకుంట ఏత్తాండు రాంరెడ్డి.

ఏటు తిన్న పచ్చోల్లె గిలగిల తన్నుకుంటాడు సుబాని.

"అంత గట్లనె వుంటరా చిన్నాయన? పాకిస్తాన్ మీన ఆడి జహీర్‌ఖాన్ ఐదు వికెట్లు తీస్కోలేదా? కైఫ్ సెంచరీ చెయ్యలేదానె? నీకు తెల్వని ముచ్చెటా చిన్నాయన?" లోపల కలికలి అయితాంటె మనసు వుగ్గబట్టుకొని అన్నడు సుబాని.

"నువ్వెన్ని జెప్పు... తుర్కోల్లంత గంతె.... తినేది యిండియా సొమ్ము... పాడేది పాకిస్తాన్ పాట...." కసితోని మాటల్ని గడ్డపారలోలె సుబాని గుండెలల్ల దింపుతాండు రాంరెడ్డి.

ఎప్పటి సందో కల్శి మెల్శి వున్న జిగ్రీ దోస్తులు సుత తమ తమ నెలవులు తప్పంగనె కులాలను, మతాలను అతియార్లుగ జేస్కొని అవతలోని ఆయువు పట్టుమీన పొడిశి పారెయ్యటం రివాజయ్యింది. మోక దొర్కితె సాలు నెత్తురు మర్గిన సైతానే నర్సిమ్మ సాఁవోలె ఉగ్రంగ బయటపడ్తది. మనిషిల దాక్కున్న సిమ్మం ఆకలితోని జూలు దులుపుకుంట ఎగబడ్తది. పగబడ్తది.

'ఆజాద్ జంగుల, చైనా యుద్ధమప్పుడు, కార్గిల్ జంగుల ఎంతమంది ముస్లిం వీరజవాన్లు షహీద్ అయిండ్రు! పాకిస్తాన్ చొరబాటప్పుడు ఎంతమంది తన గుండెల్ని జెండాలుగ సరిహద్దుల్ల పాతిండ్రు! 'హిందూ సితా హమారా' ఎంత మంది 'మాఁ' పాదాల మీన పువ్వులోలె రాలిపోయిండ్రు! అష్ఫాకుల్లాఖాన్, హమీద్, చందోలు హాజీ బాషా... గీల్లంత 'మా' కు ముద్దుబిడ్డలు గారా?, సోంచాయించిన కొద్దీ సుబాని మనసు కలెపెల వుడ్కబట్టింది.

కండ్లపొంటి నీల్లు గిర్రున తిర్గుతాంటె గుండెల్ల నొప్పిని గుండెల్లనే కుక్కుకొని మొకం నేలకేసిండు సుబాని.

"మీ పేకాట మీన, మీ మీన మన్ను వొయ్య. పొల్లగాడు నొప్పి తోని గిజ్జ గిజ్జ తన్నుకుంటాండె. యిగనన్న లేవరాదుండ్రి...." రాంరెడ్డి తల్లి రత్తమ్మ లోపట్ల కెల్లి లాశిగ అర్సుకుంచ్చింది.

"రామేశ్వరం బోయినా శనీశ్వరం దప్పదంటే గిదేమల్ల.." యిసుక్కుంట లేశిండు రాంరెడ్డి.

రాంరెడ్డికి ఎంకట్రెడ్డి ఒక్కడే కొడుకు. గీమధ్దెన గాయనకి కిడ్నీలల్ల బగ్గ నొప్పి అస్తందంట. తాగుడెక్కువై కిడ్నీలు కరాబైన వంటరు. ఆడ్కి దవాకానకు దీస్కపోతనే వున్నరు. గని నయం గాలె.

కాపోల్ల ఎంకన్న, రంగాచారి, సుబాని మాట ముచ్చెట లేకుంట యింటిదారి పట్టిండ్రు.

***

దిగాలుపడి యింట్లె కొత్తన్న సుబానిని సూపింది తల్లి పాతిమ.

"నెలలు నిండి రేపోమాపో అన్నట్టుగున్న పెండ్లాన్ని యింట్లె బెట్టుకొని రాత్రనకుంట, పగలనకుంట గా పేకాటేందిర?" అన్నది పాతిమ.

సుబాని ఏం మాట్లాడలే. ఒక పాలి భార్య సల్మకెల్లి సూశిండు. కడుపుతోటి వున్న సల్మ నిండుగోదారి లెక్క కదల లేక కదల లేక నిమ్మలంగ రసోయిలకి పోయింది.

"ఏం బేటా? చిన్నబోయి కండ్లబడ్తన్నవ్? రాంరెడ్డి కొడుక్కి పానం బాగలేదట గద? బలువుగున్నదా?" మల్ల తనే అన్నది పాతిమ.

"ఎందుకు చిన్నబోయిన? మంచిగనె వున్న. ఎంకట్రెడ్డిని ఖమ్మం పెద్ద దవాకానకు దీస్కపోయిండ్రు." కుక్కి మంచంల కూలబడి అన్నడు సుబాని.

సుబాని మునుపటోల్లె వుషారుగ లేడనుకున్నది పాతిమ.

"ఏమైంది బేటా? నీ మొకం జూత్తంటె తెల్వటం లేదా? గా ముచ్చెటేందో నాకు జెప్పగూడదా?" గుచ్చి గుచ్చి అడిగింది పాతిమ.

జర్రసేపు సుబాని ఏం మాట్లాడకుంట కామూష్క వున్నడు. కడుపుల వున్న బాద కక్కితేగని తీరదు అనుకున్నడు. రాంరెడ్డి తనను అన్న మాటలన్నిట్ని పొల్లుబోకుంట జెప్పిండు సుబాని.

పాతిమ బరువుగ వూపిరి పీల్చుకో బట్టింది.

"ఏం బద్మాష్ రోజులచ్చినయ్ బేటా! ఎన్కట మీ బాపు సోందు సాబు బతికున్నప్పుడు ఎట్లుండేవి యీ వూర్లు....!" పాతిమ మనసు పురాన జమానలకు యీదుకుంట బోయింది.....

"ఏం రాదమ్మత్తా! అంత మంచేనా?" అని అడిగిండు సోందు సాబు. గాయన హర్రోజు రాదమ్మ యింటికి సల్లకోసమత్తడు.

"బానే వున్న పోరగా! మీరంత మంచేనా?" అన్నది రాదమ్మ.

"మంచేగనే.... మరే.... మరే..." సిగ్గుతోని మెల్కెలు దిర్గి పోతాండు సోందు సాబు.

"ఓర్నీ సిగ్గు దొంగలు దోస్కపోను. సల్లకొచ్చి ముంత దాస్తవేంది పోర్గా? ఏం ముచ్చెటో జప్పున చెప్పక పోతివి?" అన్నది రాదమ్మ.

"ఏందో అత్తా... నాకు మా సిగ్గైతంది. ఎట్ల జెప్పాల్నో సమజైత లేదు. ....మరె.... మరె..... మా ఆడ్డి...." నోరు పెకలడం లేదు సుబానికి.

"ఆ.... మీ ఆడ్డి....? ఏం జేసినవ్ పొల్లను?" ఆరాటంగ అన్నది రాదమ్మ.

"ఏం జెయ్యలె.... మా ఆడ్డి నీల్లు పోస్కున్నది...." సోందు సాబు బుగ్గలు సిగ్గుతోటి ఎర్రబడ్డయ్.

"ఏం జెయ్యలేదంటవ్... పొల్ల నీల్లు పోస్కున్నదంటవ్? ఏంది పోరడా యీ వుల్టా పల్టా....?" కావాల్ననే రాదమ్మ కొంటెగ అన్నది.

"పో అత్తా..... నీకేజెప్పినా దిల్లగే జేస్తవ్.... మా ఆడ్దానికి చింతకాయ తొక్కు తినబుద్దైతందంట.... గింత పెట్టియ్యత్తా...." కండ్లు కిందికి వాల్చుకునే అడిగిండు సోందు సాబు.

"ఓర్నీ.... గింత మాత్రం దానికే తల్లడమల్లడవైతివేంది అల్లుడా. పెట్టిత్తతియ్...." అని గద్దె గిన్నెల చింతకాయ తొక్కుపెట్టిచ్చింది రాదమ్మ.

గా ముచ్చెట పైన పైనాలుగ పాతిమ తోటి జెప్పిండు సోందుసాబు. ఈ పాలి పాతిమ సిగ్గుల మొగ్గైంది.

ఒకపాలి "ఓరారీ! సోందు సాబూ! చింతచెట్టెక్కి చింతకాయ దులుపుతావుర? నీ కష్టం వుంచుకోను గని...." అన్నది జానకమ్మ నాయనమ్మ.

సోందు సాబుకు చెట్లెక్కటం, పుట్టలెక్కటమంటె మస్తు వుషారుగుంటది. కోతి కొమ్మచ్చులాటల కాడ్నుంచే గా యికమతులన్ని వొంటబట్టినయ్ సోందు సాబుకు.

చిటారు కొమ్మల్ల కెక్కి ఒక్క కాయలేకుంట మొత్తం చెట్టును ఓ దులుపు దులిపుండు సోందు సాబు.

జానికమ్మకు మా సంబరమైంది. యిస్తట్లె బువ్వపెట్టి, మావిడి కాయ తొక్కేసి చారెడు నెయ్యిపోసి సోందుసాబు ముందు పెట్టింది జానికమ్మ. సోందుసాబు యిస్తరి మలిచి తుండు గుడ్డల కట్టుకుంటాంటె - "గదేంది పోరగా? బువ్వదినమంటె తువ్వాల్ల మలిచి పెట్టుకుంటున్నావ్?" అన్నది జానికమ్మ.

"నాయనమ్మా....! మీ మనవరాల్కి దీస్కపోత" అన్నడు సోందుసాబు.

"మా దీస్కపోయినవ్ తియ్. గా పోరికి యేరే పెట్టిస్తగని నువ్ తిను" అని తినే దన్క పట్టుబట్టింది జానికమ్మ. అటెంక పదిరూపాయలూ, యిస్తట్లె బువ్వ మూటగట్టి సోందు సాబు చేతుల పెట్టింది.....

కోమటోల్ల అలివేలమ్మక్కైతే దినాం బీరాకుల ఏదో ఒక కూరంటు పెట్టిచ్చెడిది....

పెరట్లె పెంటకుప్పలు కండ్ల బడకుంట గుమ్మడి పాదు అల్లుకున్నట్టుగ కులాల అంటు సొంటు లేకుంట ఊరంత 'వరసలు' అల్లుకునేటివి. నూటికో - కోటికో ఎవడో ఒక్కడు తప్ప పేరుబెట్టి పిల్సెటోడే లేకుండె..... అలనాటి ముచ్చెట్లు కొడుక్కి పూసగుచ్చినట్టు యిగురంగ చెప్పింది పాతిమ. అటెంక జరసేపు కామూష్ గున్నది.

"బేటా! వూల్లెకు రజాకార్లొత్తె ఊరోల్ల పానానికి తన పానం అడ్డమేసెటోడు మీ బాపు. ఊరోల్లు సుత మీబాపును పానంల పానంలెక్క సూస్కునేటోల్లు. గిప్పుడు జమాన మారిపోయింది. వూల్లల్లకు ఎర్రబస్సులొత్తన్నయ్. పేపర్లొత్తన్నయ్. టీవిలొచ్చినయ్. గివన్నిటితోని జనం తెలివిపార్తన్నరో - తెలివి మీరుతన్నరో సమజైతలేదు. మనిషికి మనిషికి మద్దెన ఎడం ఎక్కువైతన్నది. మనమే మనకు పరాయిల్లెక్క కండ్ల బడ్తన్నమే. గీ దుష్మనీ, కచ్చలు, నరుక్కోటం, సంపుకోటం - మత పిచ్చిగాల్లు - రామ్, రహీంల నడ్మ చిచ్చు పెట్టటం... గియ్యన్ని... ఎన్కటి జమానల మేం ఎరగం బిడ్డా.... ఒకలకు ఆపతొత్తే ఒకల్లు ఆదుకునేటోల్లు.... ఒకలికి కష్టమొత్తె... ఒకలు అర్సుకునేటోల్లు... గిప్పుడు వూల్లన్ని గాయిరి గాయిరైపోతన్నయ్... బేటా! మనం తుర్క కులంల పుట్టటమే పచ్చబొట్లతోని బుట్టినం. గవి చెరిపితె చెరిగిపొయ్యేటివి గావు. మోక దొర్కితె పతొక్కడు మనకెల్లి ఏలుపెట్టి సూపిత్తడు. మన నియ్యత్‌ను ఎవడు పట్టించు కుంటడు? కాలం మీన భరోసాతోని బతుకుడే. గంత కంటె మనం ఏం జెయ్యగల్గుతం?" లోపట్ల గుండెను ఎవరో కైమ కైమగ కొట్టుతున్నట్టుగ తండ్లాడ బట్టింది పాతిమ.

సుబాని బేచైన్‌ల కెల్లి బైటపడలేక పోతన్నడు.

* * *

రమేష్, సుబాని మంచిదోస్తులు. మార్కెట్ల మిర్చి ధర కనుక్కునేటందుకు రమేష్ బైక్ మీన ఖమ్మం బయలుదేరిండు. తనకు తోడు రమ్మంటే సుబాని సుత రమేష్‌తోని బయలుదేరిండు.

జరదూరం దాక పయానం మంచిగనె సాగింది. ముంగట పోతన్న ట్రాక్టర్‌ను ఓవర్ టేక్ చెయ్యబోయి ఎదురుంగ వత్తున్న లారీని గుద్దింది బైక్. పొంచుకొని వున్న గండం లారీ రూపంల రావటం సూసిన రమేష్ చిన్న చిన్న దెబ్బలతోని తప్పిచ్చుకున్నడు. ఎన్క కూకున్న సుబాని తలకు, ఛాతీకి జబర్దస్త్ దెబ్బలు తగిల్నయ్. బగ్గనెత్తురు పోయింది. సుబాని తెలివి తప్పిండు. గా ట్రాక్టర్‌లనె సుబానిని దవాకానకు దీస్క పోయిండ్రు. తల్లి పాతిమ, భార్య సల్మ గుండెలు బాదుకుంట. గోసగోసగ ఏడ్సుకుంట దవాకానకు చేరుకున్నరు. ఇంటెన్సివ్ కేర్‌ల వుంచిన సుబానిని సూసిన డాక్టరు పెదవు యిర్సిండు. "పేషెంటు దాదాపుగ సచ్చిపోయినట్టె. యాడ్నో జరంతడుక్కుంది. మెదడు యింకా సంకేతాలు పంపుతున్నది. గవి ఆగిపొంగనె అధికారికంగ 'డెత్' అయినట్లు ఏలాన్ జేస్తం!' అని చెప్పిండు డాక్టర్.

గది యినంగనె సల్మ సోయిదప్పి నేలమీన కూలబడ్డది. పాతిమకు మెదడంత ఖాళీ అయినట్టు అనిపిచ్చింది. పిచ్చి సూపులు సూస్కుంట ఏడ్వటానికి సుత దమ్ముచాలక ఢీలా పడ్డది.

డాక్టర్ అక్కడ్నుంచి నాలుగో వార్డుల వున్న స్పెషల్ రూంకు పోయిండు. గండ్లనె రాంరెడ్డి కొడుకు ఎంకట్రెడ్డి వున్నడు. గాయన ఆలతు బగ్గ ఆందోళనకరంగా వున్నది. కొడుకు పక్కెంబడి బిక్కమొకం ఏస్కొని కూకున్నడు రాంరెడ్డి.

"చూడండి. ఇపుడే యాక్సిడెంటై వచ్చిన పేషెంటు ఇంటెన్సివ్ కేర్‌ల వున్నడు.

గాయన ఏ ఆలతుల సుత బత్కడు. గాయన కిడ్నీలను దానం జేస్తరేమో కనుక్కోండి. పన్నెండు గంటల్ల మీ పిలగానికి మంచి కిడ్నీలు అమర్చకపోతే ఆలతు మనచేతుల్ల వుండదు. అటెంక మీ యిష్టం". అన్నడు డాక్టర్.

రాంరెడ్డి లోపట అడుగంటిన ఆశ తిర్గి పానంబోసుకున్నది. గబ్బగబ్బ ఇంటెన్సివ్ కేర్ యూనిట్‌కు పోయిండు. గక్కడ సల్మను, పాతిమను సూడంగనె పక్కన పిడుగుబడ్డట్టు అదిరిపడ్డడు.

"మర్దీ! సీమకు సుత అపకారం చెయ్యని నా కొడుకుని సూసి ఓర్వలేక ఆ అల్లా తీస్కపోతన్నడు..." గప్పటి దాంక గడ్డకట్టిన దుక్కం రెడ్డిని సూడంగనె కట్టలు తెంచుకున్నది. గుండెలు బాదుకుంట ఏడ్సుడు షురూ జేసింది పాతిమ.

రాంరెడ్డికి ఎట్ల మాట్లాడాల్నో తోసడం లేదు. గాయన మనసు యిర్కటంల బడ్డది. "నీ కొడుకు ఎటైన సత్తడు గని నా కొడుకును మాత్రం ఎట్లనన్న జేసి బతికించాలె" అని తను ఎట్ల అడగాలె? వర్దల కొట్టకపొయ్యే టొన్కి గడ్డిపోస దొర్కినట్టు గీ ఒక్క ఆశ మిన్కుమిన్కుమంట కండ్ల బడ్తాంది. గా దాన్ని ఎట్ల వొదులు కోవాలె? వొదులుకుంటె ఎంకట్రెడ్డి మల్ల కండ్ల బడడు. ఏంజెయ్యాలె...? తన గుండెను ఎవలో రంపం తోటి కోస్తున్నట్టు అనిపిస్తాంది రాంరెడ్డికి.

"పాతిమా! గిసుంటి ఆపతిల తల్లి మనసు ఎంత తండ్లాడ్తదో నాకెర్క లేక గాదు.... జర అటూ యిటుగ నేను సుత నీ వోల్గెనె వున్న. ఎంకెట్రెడ్డి సావు బతుకుల్ల వున్నడు. గాని పానాలు గిప్పుడు మీ చేతుల్ల వున్నయ్....." దుక్కం తోటి రాంరెడ్డికి గొంతు పెగలడం లేదు.

గంత పరేషాన్ల సుత పాతిమ అఫ్‌సోస్గ రాంరెడ్డికెల్లి తలెత్తి సూసింది. "నా కొడుకు కిడ్నీలు పూరాగ పాడైపోయినయ్. పన్నెండు గంటల్ల ఏరే కిడ్నీలు దొరక్కుంటె నా ఒక్కగా నొక్క కొడుకు నాకు దక్కడు పాతిమా.....! నీకు చేతులెత్తి మొక్కుత.... సుబాని కిడ్నీలు....." రాంరెడ్డి గొంతు వొణికింది. తనమాటలు తనకే వికృతంగ అనిపిస్తాంటె పూరాగ అనలేకపోయిండు రాంరెడ్డి.

పాతిమకు ఒక్క నిమిషం షాక్ తిన్నట్టుగ అనిపించింది. సుడిగాలిల ఎండుటాకు లెక్క వణికిపోయింది. ఆమె మనసు కుదేసినట్టుగ అనిపిచ్చింది. గా చీకట్లె గా తుపాన్ల గా తంటల సన్నగ దీపాంత ఎల్తురేదో మెరిసినట్టనిపిచ్చింది.

"మర్దీ! కడుపు కోత ఎట్ల అగులు బుగులుగ వుంటదో అనుబగిత్తన్న - నా కడుపు గాలినట్టు ఇంకొకల్లకు ఎందుక్కావాలె? నా కొడుకును మట్టిల గల్పుకుంటన్న. గా మట్టిల్నుంచి ఒక చిన్న మొక్క పానం బోస్కోనికి మోక వుంటె ఎందుకడ్డం పడాలె? నా కొడుకు పానమసుంటిదే నీ కొడుకు పానం. నా కొడుకు హయాత్ సుత బోస్కోని నీ కొడుకు నిండ నూరేండ్లు బత్కనీ. గందుకు నన్నేం జెయ్యమంటె గజ్జేస్త...." గుండెలు అవిసిపోతంటె దుక్కాన్ని అణ్సిపెట్టుకుంట అన్నది పాతిమ.

కండ్ల పొంట నీళ్ళు దారగ కార్తాంటె రెండు చేతులెత్తి మొక్కిండు రాంరెడ్డి. "సుబానీ! నీతోని నేనొక్క పేకాటల్నే వోడిపోయిన అనుకున్న గని నీ సావు సుత నన్ను వోడిచ్చింది. మనిషికి గావల్సింది ఇన్సానియత్ గని కులాలూ, మతాలూ గావని సచ్చి సుత సాటి చెప్పినవ్...." అని మనసుల అనుకున్నడు రాంరెడ్డి.

*

# మహాసభల తీర్మానాలు

## బి.సి. రిజర్వేషన్లులకు మద్దతు

కేంద్రీయ విశ్వవిద్యాలయాలు, ఐఐటి, ఐఐఎంలలో బి.సిలకు 27 శాతం రిజర్వేషన్లు కల్పించాలనే ప్రతిపాదన కేంద్ర ప్రభుత్వం చేసింది.

అయితే దేశంలో ఉన్న అగ్రకుల విద్యార్థులు, పెట్టుబడిదారులు దీనిని వ్యతిరేకిస్తున్నారు. ఢిల్లీలోనైతే వైద్యులు వీధుల్లోకి వచ్చి నిరసన తెలియజేశారు. మండల్ కమీషన్ - 1 కాలంలో ముందుకు తీసుకొచ్చిన 'ప్రతిభ' అనే అంశాన్ని ముందుకు తెస్తున్నారు.

నిజానికి 'ప్రతిభ' అనే వాదం సరైంది కాదు. లక్షలాది డొనేషన్లు చెల్లించి విద్యను కొనుక్కునే అగ్రవర్ణాల విద్యార్థులకు ప్రతిభ ఉందనటం డొల్లతనం. వేల సంవత్సరాలుగా సామాజికంగా వెనకబడిన వర్గాలకు రిజర్వేషను కల్పించడం అవసరం. కాబట్టి కేంద్ర విద్యా సంస్థలలో బి.సీలకు 27 శాతం రిజర్వేషను కల్పించడం కోసం జరిగే పోరాటానికి విరసం సంపూర్ణ మద్దతు తెల్పుతుంది. సాహిత్యం, సాంస్కృతిక రంగాలలో ఈ అంశానికి సంబంధించిన కృషి చేస్తుంది.

## సంతాప తీర్మానం

మే నెలలో సౌరీస్, పరాభి, జూన్‌నెలలో బూదరాజు రాధాకృష్ణ కన్ను మూశారు.

చలం కూతురు సౌరీస్. అంతేకాదు, ఆయన ఆలోచనలకీ, భావజాలానికి, దృక్పధానికి మానవ రూపం అనవచ్చు. ఆమె మంచి రచయిత్రి కూడా. ఆనావీలర్, సుందర్ మొదలైన రచనలు చేశారు.

తెలుగు పురాణ, జమీందారీ భావకవిత్వాల మీద తిరుగుబాటు బావుటా ఎగరేసిన విలక్షణ కవి పరాభి. అతని ఫిడేలు రాగాల డజన్ అనే ఖండకావ్యాన్ని గిట్టనివాళ్ళు 'ఫిడేలు రోగాల డజన్' అని నిరసించారు. అయినా అతని కవితా శక్తి చెక్కుచెదరలేదు.

బూదరాజు రాధాకృష్ణ మనం గర్వించ దగ్గ సాహితీవేత్త. అటు ప్రాచీన, ఇటు ఆధునిక సాహిత్యాలు అయనకి కొట్టిన పిండి. అంతేకాదు, భాషా రంగంలో కూడా ఆయన విశేష కృషి చేసి చేవగల ఫలాలను అందించారు.

ఈ ముగ్గురి మృతికి విరసం తన సంతాపం తెలియజేస్తోంది.

## డావెన్సీకోడ్ సినిమాపై నిషేధం తగదు

డావెన్సీకోడ్ అనే సినిమా క్రైస్తవుల మనోభావాలను దెబ్బతీసేలా ఉన్నదని, విశ్వాసాలను గాయపరిచేలా ఉన్నదని దీనిపై నిరసనలు చెలరేగాయి. దీన్ని కొన్ని రాష్ట్రప్రభుత్వాలు నిషేధించాయి. ఆంధ్రప్రదేశ్ రాష్ట్ర ప్రభుత్వం నిషేధించింది. అది ఒక నవల. దీన్ని సినిమాగా తీశారు. అయితే ప్రజల్లో ముఖ్యంగా క్రైస్తవుల నుండి నిరసన వచ్చింది కాబట్టి నిషేధించామని ప్రభుత్వం చెప్పుకుంటుంది. ప్రభుత్వం చూపే ఈ కారణాన్ని, ఈ వైఖరిని విరసం గర్హిస్తున్నది. ప్రజల మనోభావాలను గౌరవించే, ప్రజాస్వామిక దృక్పథం ఈ ప్రభుత్వాలకు ఎంతమాత్రం లేదు. నిత్యం ప్రజావ్యతిరేక కార్యకలాపాలు సాగించే ప్రభుత్వానికి ఈ మాట అనే నైతికత లేదు. ఏ సినిమా అయినా, సాహిత్యమైన ప్రజలకుగాని, ప్రజల్లోని ఒక సమూహానికి గాని అభ్యంతరకరంగా ఉన్నప్పుడు సమాజంలో దాని గురించి సవ్యమైన చర్చ జరగాలి. అలాంటి భావ సంఘర్షణ ద్వారానే ప్రజలు ఆ కళారూపంపైన సరైన వైఖరి తీసుకుంటారు. అందులో ఉండే లోపాన్ని గుర్తిస్తారు. తమ విశ్వాసాలను గాయపరిచే పద్ధతులు సమాజంలో కొనసాగడానికి వీల్లేని భావవాతావరణాన్ని తీసుకొని వస్తారు. అంతేగాని ప్రభుత్వాలు జోక్యం చేసుకోవడం, నిషేధించడం అప్రజాస్వామ్యం. అట్లాగే సాహిత్య రంగంలోనైనా సినిమా రంగంలోనైనా సంచలనం కోసమైనా సరే ప్రజల మనోభావాలు దెబ్బతీసేలా ఎవరూ ప్రయత్నించరాదని విరసం అవగాహన.

☆ కె.వి.కూర్మనాథ్

# నదిని నిర్మిస్తున్న వాళ్ళు




**జల ఎక్కడి నుంచి పుట్టుకొస్తుందో తెలియడం లేదు. నేలలోని ఏ ప్రాంతం నుండి ఊటలూరుతోందో అర్థమవడం లేదు. మొన్నటి వరకు సన్నటి పాయవలె, ఇసుక దిబ్బలోంచి సన్నగా, పీలగా ప్రవహించిన వంశధార ఏయే జవసత్వాలను పొంది ఎట్లా పరుగులెత్తుతుందో! ముందు ఎవ్వరు గమనించేరో తెలీదు. బహుశ మనిషిలో సహజంగా ప్రమాదాన్ని సూచించే అసంకల్పిత చర్య మేల్కొల్పినట్టు వీధి వీధంతా మేల్కొంది. ఇంకా లేవని వాళ్ళను కొందరు నిద్రలేపుతున్నారు. ఈ గొడవకి కొందరు తమంత తామే నిద్రలేస్తున్నారు.**

**"ఓలె శాంతా! ఏరొస్తొందే. లేయె, లేచి శాలకెళ్ళి కన్నెలిప్పియ్యే" అని అప్పలస్వామి కూతుర్ని కేకేసేడు. నులక మంచంలో ముడుచుకు పడుకున్న శాంత, లేచి కూచుంది. కళ్ళు నులుముకుని చూసింది. అర్ధరాత్రిపూట వీధిలో గొడవేమిటా అని చూస్తోంది.**

మోణింగి సరస్వతి, కెంగున కృష్ణమూర్తి వాళ్ళమ్మ, యింకా మరికొందరు పసుపు కుంకుమలు పళ్ళేల్లో పట్టుకుని అప్పటికే శాజ్జాల చెరువు దగ్గరకొచ్చిన ఏటి దగ్గరకెళ్ళి వదిలేరు.

"ఇంటికొచ్చిన ఆడబడుచుకి పసుపు కుంకాలు పెట్టమా!" అంది సరస్వతి, అప్పుడే తలుపులు తెరుచుకుని బయటకు వచ్చిన పట్నాయఖ్ భార్య రత్నంలో.

"ఏటొదిన పసుపు కుంకాలంటున్నవు. అర్ధరాత్రి వూట ఎవులొచ్చినారేటి?" అంది రత్నం.

"ఎవులంతా వేటే. అమ్మ ఘంగమ్మ తల్లి యింటి ముంగటి కొచ్చినా అగుపించనేదేటే" అంది సరస్వతి.

"ఓలమ్మోలమ్మో, ఏటోదిన గంగమ్మ తల్లి వచ్చినాదా! ఓలమ్మో ఎంత పనయిపోయిందిర నాయానా! దెయ్యింగాని వోలీనాదేటోనే. తొంగుడి పోన్ను" అంది రత్నం. పైట సర్దుకుని, కొప్పు ముడేసి యింట్లోకి పరిగెత్తింది రత్నం. క్షణంలో బయటికొచ్చింది స్టీలు పళ్ళెంలో పసుపూ కుంకుమ పట్టుకుని.

వీధిలో హడావుడి పెరిగిపోయింది. పెద్దవాళ్ళందరూ లేచిపోయారు. పిల్లలు కూడా నిద్రలేస్తున్నారు. పశువులు భయంతో అరుస్తున్నాయి. వేళకాని వేళ వాతావరణంలో అసహజమైన మార్పు అర్థం కాక కాకులు అరుస్తూ ఎగురుతున్నాయి. కుక్కలు అరుస్తున్నాయి. ఇంకా పడుకునే వున్న తమ్ముడ్ని లేపేను. అప్పటికే అమ్మ, అక్క, నాన్నమ్మ నీళ్ళ దగ్గరకెళ్ళి పూజలు చేస్తున్నారు.

ఎక్కడో కిలోమీటర్ దూరంలో వున్న ఏరు వూళ్ళోకి రావడం నాకు చాల చిత్రమనిపించింది. చాల ఉత్సాహంగా వుంది. నేను గడియ గడియకూ పరిగెట్టి వెళ్ళి ఏరు ఎంతవరకు వచ్చిందో చూసి వస్తున్నాను. వరద గురించి ఎవరెవరు ఏమేం మాట్లాడుకుంటున్నారో వింటున్నాను.

ఎక్కడ్నుంచి వచ్చేడో చూళ్ళేదుగాని చాకలి మోహన్ వచ్చి 'కోరాడీదిలోకి వచ్చీసింది" అన్నాడు. అది విని అప్పలస్వామి 'అయితింకేటి మనీది కూడా మునిగినట్టే' అన్నాడు.

అవ్వ సామాన్లన్నీ సర్దుతోంది ఒక గోనెబస్తాలోకి. నాన్నమ్మ కూడా మొదలుపెట్టింది. ఎంతలేపినా తమ్ముడు లేవడం లేదు. 'ఏరొచ్చిందిరా, ఏరు లే' అని చేత్తో తోసేను వాడ్ని. కళ్ళు నలుముకుంటూ లేచేడు వాడు. అప్పటికి శాజ్జాల దాటి లింగుబరోల యింటి వరకూ వచ్చేసింది - చాల నిశ్శబ్దంగా. సుళ్ళు తిరుగుతూ బురద బురదగా వున్నాయి నీళ్ళు. వీటికీ మొన్నమొన్నటి వరకూ ఏట్లో చూసిన నీళ్ళకూ ఎక్కడా పోలికేలేదు. అప్పుడైతే చాల నెమ్మదిగా, శుభ్రంగా, స్వచ్ఛంగా వుండేవి. నీళ్ళలోంచి స్పష్టంగా యిసక కనిపించేది. కానీ యిప్పుడు పూర్తిగా వేరు. మట్టి, పుల్లలూ, పొదలూ, కొమ్మలూ - ఈ ఏరు, ఆ ఏరంటే నమ్మబుద్ధి కాలేదు. చాల మెల్లగా అంగుళమంగుళం దాటుకుంటూ వస్తోంది. ఇంతదూరం వచ్చింది కదా, యిక మా యిల్లు దాటి వెళ్ళదులే. అనుకున్నాను. అంతకంటె నీళ్ళు ఎక్కడుంటాయిలే అనుకున్నాను. కానీ, ఎక్కడి నుంచి పుట్టుకొస్తున్నదోకాని జల జరజరా వచ్చెస్తున్నది. చప్పుడేమీ లేకుండా నేలమీద జరుగుతూ, జారుతూ వచ్చే నాగుపాములె వచ్చేస్తున్నాయి నీళ్ళు, గట్టూ గడపలూ దాటుకుంటూ. పసుపు కుంకుమలు తీసుకుని వెళ్ళిపోతుందనుకుని చూస్తున్న వాళ్ళ మోకాళ్ళదాకా వచ్చేసాయి నీళ్ళు.

ఇంటి ముందటి సిమెంట్ సోఫామీద కూచుని ఎప్పట్లాగానే కబుర్లు చెబుతున్నాడు పట్నాయక్. గతసారి వరదొచ్చినపుడు తనెట్లా భుజమ్మీద కూచోపెట్టుకుని ఎంతమందిని వీధి దాటించేడో చెబుతున్నాడు. కానీ అప్పలస్వామి ఎప్పటిలాగా "ఆహా! ఓహో! అని వంతపాడలేదు. చేష్టలుడిగి కూచున్నాడు. కళ్ళల్లో నీళ్ళు తిరుగుతున్నాయి. ఎదురు గుమ్మంలో అప్పలస్వామి భార్య రాటకు చేరబడి చూస్తోంది భర్తవైపు. దిగాలుగా కూర్చుని వుంది. ఏమాటంటే ఏమంటాడో అన్న భయంతో చలనం లేకుండా కూచుని వుంది. వరద తీసేసేక పొలంలో మేటపడితే ఏం చెయ్యాల్రా నాయనా అని దిక్కుతోచక కూచున్నాడు అప్పలస్వామి. మొగుడి ఆలోచనలు తనవీ అయి కూచుంది. బ్రతుకు బుగ్గయి పోయిందనుకుంది.

ఏరు పొంగుతూనే వుంది. ఎవ్వరి యిష్టాయిష్టాలతో సంబంధం లేకుండా, ఎవ్వరి కోపతాపాలను లక్ష్యపెట్టకుండా ఏరు విస్తరిస్తూనే వుంది. ఇళ్ళూ, వీధులూ, వూళ్ళకు పాకుతూ వుంది. గంగమ్మ తల్లి క్రోధం చూసి మిగతా ప్రకృతంతా నివ్వెరపోయి చూస్తోంది.

అవ్వ గుడిసె బయటకు వచ్చి చూస్తోంది. ఏటి దుక్కు అవ్వకు పగలే సరిగా కనిపించదు. ఈ చీకట్లో ఏంకనిపిస్తుంది? చూరులోంచి చుట్టతీసి వెలిగించి గట్టుమీద కూచుంది. మాటలు, కేకలు, ఏడుపులతో వీధంతా కోలాహలంగా ఉంది. అందురు అటూ యిటూ పరిగెడుతున్నారు. నాకు మాత్రం చాల ఉత్సాహంగా వుంది. ఏం జరగబోతోందా అని ఉత్కంఠతో వున్నాను.

ఇన్ని నీళ్ళు ఎక్కడి నుంచి వస్తున్నాయి? ఎప్పుడూ పీలగా వుండే వంశధార ఒకటో రెండో కాదు కొన్ని వేల రెట్లు ఎట్లా పెరిగిపోయింది? అసలు యిన్ని నీళ్ళు యిప్పటికే ఎక్కడ వున్నాయి? మా యింటి దాకా వస్తాయా? మోణింగి మోహన్ యింటి గుమ్మం తొక్కుతుందా? ప్రెసిడెంట్ గారి యిల్లు చూస్తుందా? అసలు ఏరు ఎన్నటికీ యిలానే వుండిపోతుందా మరి వెనక్కి వెళ్ళకుండా?

"రండి యింట్లోకి" పిల్చింది నాన్నమ్మ నన్నూ తమ్ముడ్ని.

"నీళ్ళొచ్చెస్తున్నాయి యింట్లోకి రండి" అంది.

నాకు పోవాలని లేదు. నీళ్ళు ఎట్లా వస్తున్నాయో చూడాలని వుంది. ఏరు బలమెట్లా పుంజుకుంటుందో తెలుసుకోవాలని వుంది. వెడల్పు విస్తరించుకుంటూ లోతునెట్లా పెంచుకుంటోందో చూడాలని వుంది. అందుకే నాన్నమ్మ పిలిస్తే యింట్లోకి వెళ్ళలేదు.

"ఒరేయ్ నువ్వెళ్ళిరా" అని తమ్ముణ్ణి పంపించి నేను అవ్వ పక్కకెళ్ళి కూచున్నాను. మా యింటి దగ్గర కొచ్చేసాయి నీళ్ళు. దూరం నుంచి సైరన్ మోగింది. బహుశ మరిన్ని గేట్లు వదిలేస్తారని సంకేతం కావచ్చు. ఇంకా ఎక్కువ నీళ్ళొస్తాయి కావచ్చు. అప్పటికే అటు గొట్ట నుండి సుబలై గుట్టలను తాకిన వంశధారకు, బ్రిడ్జి గేట్లు తెరచి వుండడమో లేక మూసి వుండడమో అన్నది పెద్ద తేడా రాలేదు. ఒక్కొక్క యిల్లే దాటుకుంటూ, ఒక్కొక్క వీధి చుట్టుకుంటూ ఏరు వూరిని కమ్మేసింది. తనలో మునిగేవాటిని ముంచుకుంటూ, తేలేవాటిని తేల్చుతూ, అడ్డువచ్చిన వాటిని పెకలించుకుంటూ మహోధృతంగా పారుతోంది ఏరు.

అవ్వ వైపు చూసేను. నిశ్చలంగా కూచుంది. అడ్డ చుట్ట పెట్టుకుంది. నేనడగాలని తనూ, తను చెప్పాలని నేను అనుకున్నట్టు కూచున్నాం. తనే మొదలు పెట్టింది.

"ఇంతొరద నేనెపుడు చూడ్లేదు బావ్. నేను నీ అంతున్నప్పుడొచ్చింది. అది కూడా ప్రెసిడెంట్‌గారి తోట వరకె. మా అమ్మమ్మ నడిగేను వరదెందుకొచ్చిందే అని. నీళ్ళకోసం ఏటికెళ్తే గంగమ్మ తల్లి మా అమ్మ నడిగిందట 'ఏమే లచ్చుమమ్మా ఎందుకే దిగులుగున్నావ'ని. ఈ ఏడు కూడా వర్షాల్లేవమ్మా ఏం నాటాలి, ఏం కొయ్యాలీ, పిల్లలకేం పెట్టాలీ అని. గంగమ్మ తల్లి రాజు దగ్గరకెళ్ళి 'వర్షాలు కురిపించు, పిల్లలు ఆకలితో ఎండిపోతున్నారూ' అని చెప్పింది. రాజు పట్టించుకోలేదట, పైగా గసిరేసడట గంగమ్మ. తల్లికి కోపమొచ్చిందట, గైరమ్మ తల్లిని పిల్చిందట. కొండదేవతను పలికించిందట. వాగునూ, వంకనూ రమ్మన్నదంట, అందర్నీ కలుపుకుని మా పొలం తడిపిందట" అన్నది అవ్వ.

"కానీ యిప్పుడింత దూరం వచ్చిందెందుకవ్వా?" అని అడిగేను.

"చెప్పిన కద బావ్! ఎండిన పొలాలను చూడలేక, ఏడ్చే పిల్లలను చూడలేక గుండెలు బాదుకుంటూ వస్తోంది ఏరు" అంది.

'బంగళా కూడా మునిగిపోయింటాది' అంది.

బంగళ పేరు విన్న వెంటనే ఆకుల శంకర్రావు గుర్తొచ్చాడు. బంగళా పక్కనే శంకర్రావిల్లు. నాగుండెలు జారిపోయాయి. వాడున్నాడా కొట్టుకుపోయాడా? అన్న సందేహం చుట్టుకుంది నన్ను. దిగాలుగా యింట్లోకి వెళ్ళిపోయాను. అది మునిగిపోయిందట, యిది కొట్టుకుపోయిందట అన్న పుకార్లు పుట్టేయి. అబద్ధానికి కొన్ని నిజాలు జోడించి, నిజాలకు కథలు చేర్చి చెప్పుకుంటున్నారు. చాపకింద నీరులా ఏరు మాత్రం పరుచుకుంటూనే వున్నది. ఎప్పుడు నిద్ర పట్టిందో తెలీదు. ఆరూ ఏడవుతుందనగా అక్కలేపితే తెలివొచ్చింది. "రాత్రి వచ్చింది పీడకలనా" అనుకున్నాను.

"లే, గబగబా మొఖం కడుక్కో, మనం వెళ్ళిపోవాలి" అంది.

పందిరి మంచం దిగేను. పాదాలకు నీళ్ళు తాకేయి. పీడకల కాదు! వరదే! నీళ్ళు ఎర్రగా, మడ్డిగా వున్నాయి. గబగబా వీధిలోకి వెళ్ళి చూసేను. వీధికి సగం దూరం వరకూ వచ్చేసింది వరద. నాన్న యింటికి తాళం వేసేడు. అందరం బయటపడ్డాం వరదకు అందని వీధిలో తలదాచుకునేందుకు.

***

అంత పెద్ద బీభత్సం ఆ ఊళ్ళో ముసలి వాళ్ళెప్పుడూ వినలేదు. కొండలూ గుట్టల మీంచి మైదానాన్ని చుట్టుముట్టి ఊపిరాడనివ్వని అంతటి పెను విపత్తు చరిత్రలో అంతకు ముందెప్పుడూ జరగలేదు. సాదాసీదా నీటికి అంతటి శక్తి వుంటుందని పెద్దలెప్పుడూ వూహించలేదు. చిన్నపిల్లలకు అదొక పెద్ద వింత. యువతీ యువకులకు అదొక కనువిప్పు. లలితంగా, సరళంగా, అమాయకంగా వుండే నీళ్ళు, జీవనాధారమైన నీళ్ళు, కోపమొస్తే వందల ఏళ్ళ మర్రిచెట్లను కూకటివేళ్ళతో పెకలించి వెయ్యగలవని తెలుసుకున్నారు. కొండలను కదిలించి, కరిగించి కొత్తమట్టిని ఎర్రమట్టిని తీసుకువచ్చి మైదానాలను సుసంపన్నం చేస్తుందని తెలుసుకున్నారు. కొందరికది కదిలే కార్చిచ్చులా కనిపించి వణికించింది. కానీ చాలా మందికి ఊతమిచ్చింది.

***

వరద తీసేసింది కానీ పోటెత్తే నది తమకేమివ్వగలదో ఊరూవాడా తెలుసుకున్నాయి. అది తెలుసుకున్నాక మొదలయ్యాయి - నదిని నిర్మించే ప్రయత్నాలు - పెద్దదీ, బలమైనదీ అయిన నదిని నిర్మించే ప్రయత్నాలు. నది ఎక్కడెక్కడ ఒడుపు తప్పిందో తెలుసుకున్నారు. ఎక్కడెక్కడ దుందుడుకు అనిపించిందో తరచి చూసుకున్నారు. వాగుల్నీ, వంకల్నీ కలుపుకుంటేనే నది పరిపుష్టమౌతుందని అనుకున్నారు. అందుకే ఉన్నచోట వాగుల్ని కలుపుకొచ్చే వాళ్ళను తయారు చెయ్యాలని లేనిచోట వాగుల్ని సృష్టించే వాళ్ళను పంపించాలని నిర్ణయించేరు.

అది మొదలు ఎక్కడెక్కడి వాళ్ళో నదిని సృజించే పనిలో పడ్డారు. వాగుల్నీ, వంకల్నీ, పాయల్నీ గుర్తిస్తూ, కలిపేస్తూ, సృష్టిస్తూ వాళ్ళే వాగులూ వంకలూ పాయలూ అయ్యేరు. సరికొత్త నది ఒకటి మొదలై పాతగట్లనూ, కొత్తగట్లనూ తెంచుకొని దాటుకుని మొండెంఖల్ కొండల్నీ, ఆరావళి వింధ్య పర్వతాల్ని ఆసరాగా తీసుకొని గంగా, యమున, గోదావరీ, ప్రాణహిత, శబరి, మంజీర, మహేంద్ర తనయ నదుల్ని కలుపుకుని కొత్త ఉరకలు మొదలు పెట్టింది.

*

## మనవి

అరుణతార రిజిస్ట్రేషన్‌లోని సాంకేతిక కారణాల రీత్యా జూన్ సంచిక రావడం లేదు. దీన్నే జూన్, జూలై సంచికగా చదువుకోవాలని పాఠకులకు మనవి.

సం.

## చందాదారులకు విజ్ఞప్తి

అరుణతార సకాలంలో, సక్రమంగా అందడం లేదనే ఫిర్యాదులు చందాదారుల నుండి వస్తున్నాయి. మీ ప్రాంతంలోని పోస్టాఫీస్‌లో కనుక్కొని, ఆ తర్వాత తెలియజేయండి. మీ అడ్రస్ మారి ఉంటే వెంటనే కార్డు మీద కొత్త అడ్రస్ తెలియజేయండి.

పత్రిక ఆర్థిక స్థితి గురించి అరుణతార పాఠకులకు తెలియంది కాదు. చందా గడువు అయిపోయాక వెంటనే రెన్యువల్ చేయించుకొని సహకరించగలరు. సంవత్సరాలుగా చందా కట్టని పాఠకులు కూడా ఉన్నారు. మీ బకాయి చెల్లించకపోతే పత్రిక మీకు పంపించలేకపోవడమే కాదు, పత్రిక నడవడమే కష్టమైపోతుంది.

- ఎస్. రవికుమార్, మేనేజర్



# చిట్టిచేతులు



☆ జన్ను చిన్నాలు

విప్లవంలో కొందరు మనుషులు బయటకు కనిపించరు. చాలా చిన్నపనులు చేస్తున్నట్లుంటారు. మామూలుగా వాటికి గుర్తింపు ఉండదు. కానీ, విప్లవంలో అత్యంత కీలకంగా ఉంటాయి. కంటికి కనిపించని మర మొత్తం యంత్రం నడవడానికి కారణమౌతుంది. ఇట్లాంటి 'చిన్న' వ్యక్తుల ఆలోచనలు, శ్రమ బయటి సమాజానికి తెలియకపోవచ్చు. కానీ, ఉద్యమాలు వాళ్ళ పాత్రను గౌరవనీయంగా తలచుకుంటాయి. తెలియని వాళ్లు తెలుసుకుంటే ఉద్వేగం కలుగుతుంది. ఆ తెలుసుకోవడం కథ రూపంలో అయితే యింకా గాఢంగా తాకుతుంది.

*గత సంచికలో జన్నుచిన్నాలు రాసిన 'తల్లికోడి' చదివే వుంటారు. ఈ సంచికలో ఈ కథ చదవండి. మనం అనేక అజ్ఞాత హృదయాలను దగ్గరగా చూసి సంభ్రమానికి గురవుతూ వుంటాం. అలాంటి వాళ్ల గురించీ, వాళ్ళ ఆచరణ గురించీ కథలుగా రాసిపంపండి. ఈ శీర్షికని ఇలా కొనసాగిద్దాం.*

సం.

పోలీస్ స్టేషన్ ఆవరణ.....

ఇప్పటి - కొట్టొచ్చే రంగుల, కట్టుదిట్టమైన గోడల అత్యాధునిక హైటెక్ పోలీస్ స్టేషన్ కాదు.

కడుపు మండిన వాళ్ళెవరో బాంబులు పెట్టి పేల్చేయక ముందటి సంగతి. గూనపెంకుల వసారాతోటి, పీల్ మట్టిరంగు గోడల తోటి వున్న పాత కాలపు భవంతి. చుట్టూ నాలుగడుగుల ఎత్తు కాంపౌండ్ గోడ వున్న ఆవరణ.

నిద్రో, మెలకువో, స్పృహ వున్నదో లేదో తెలవని స్థితిలో బోర్లా పడుకొని వున్న.... కాదు కాదు పడేయబడి వున్న చిట్టి కొంచెం కదిలి తలెత్తి చూసిండు. తనెక్కడున్నాడో కూడా గుర్తు పట్టలేకపోయిండు కొంచెం సేపు.

మధ్యాహ్నపు ఎండకు వేడెక్కిన ఉక్కె, వొంటిని కాలుస్తూ వుంటే స్పృహలోకొచ్చి చుట్టూ చూసిండు - కాంపౌండ్ గోడమీది నుంచి బస్సులు, రిక్షాలు, సైకిళ్ళు, కదిలిపోతూ వున్న మనుషులు కనిపించి, అయితే 'ఎన్‌కౌంటర్' కాలేదా అనుకున్నడు.

'ఎన్‌కౌంటర్' మాట మెదట్లో తట్టగానే ఒక్కసారిగా వణికిపోయిండు. అక్కడి నుంచి లేచి నిలబడి గట్టిగా "నన్ను పోలీసులు పట్టుకున్నారు" అని అరవాలనుకున్నాడు. అరుపు కాదు కదా కనీసం శబ్దం కూడా బైటకు రాలేదు. కాళ్ళూ చేతులూ చచ్చుబడి పోయి వున్నయ్.

"మాకు చెప్పురా షాపులు 'బంద్' చెయ్యకపోతే ఏమైతదో"

"సర్కారు తిండి తినే అంత మొనగాళ్ళయింరా"

"ఎవడ్రా మిమ్మలనిట్ల తయారు చేసేది"

"చెప్పరా" ఐదడుగుల లేత శరీరం మీద లారీ వాతలు తేలినయ్.

'టార్చర్' గురించి ఎక్కువగా విని వుండడం వల్లనేమో - ఇవేమీ కొత్తగా అనిపిస్తులేవు చిట్టికి. ఇది వరకెప్పుడో అనుభవించిన ఫీలింగ్. ఏం చేసినా నోరు విప్పొద్దనేదొక్కటే బండగుర్తు.

కొట్టి కొట్టి అలసిపోయిన కానిస్టేబుల్‌తో ఎస్ ఐ అంటున్నడు బైటెయ్యండిరా వాణ్ణి, నేను చూసుకుంటా'.

ఒక్కసారి చేతివేళ్ళల్లోకి రక్తం పారినట్లయింది. చూసుకుందామనుకొని ఊరుకున్నడు.

"టిఫిన్ బాక్సులు పట్టుకపోతరు కదరా"

"అన్నం కలిపి తినిపిస్తరా"

ఉక్కెలో పరచిన లేత చేతివేళ్ళ మీద కర్కశమైన బూటుకాళ్ళ విన్యాసం.

"గవర్నమెంటు హాస్టళ్ళు పెట్టి మేపుతున్నది గదరా. తిండి ఎక్కువయింది మీకు".

సోషల్‌వెల్ఫేర్ హాస్టల్లో ఎర్రపప్పు సాంబారు, ముక్కిపోయిన బియ్యపన్నం గుర్తొచ్చినయ్ చిట్టికి. మంచి కూరగాయల ముక్కలతోటి పప్పుచేసినప్పుడో ఆకుకూర వండినరోజో - తలా ఓ ముద్ద తీసి బాక్సులో పెట్టుకొని - కెనాల్ కట్ట దగ్గరికి పోవుడు గుర్తొచ్చింది.

'అవునూ ఆ రాములు' శంకర్‌లను కూడా పట్టుకొచ్చింరా? శంకర్‌గాడైతే ప్రాణంబోయినా చెప్పడు. అయినా ఆ సమావేశం తర్వాత అందర్ని అక్కడి నుంచి పంపించిన తర్వాతనే తనుపోతనన్నడు అన్న. ఎక్కడికి పోయిండో ఎవరికి తెలుస్తది'.

కదలక మెదలక పడున్న ఆ పిల్లగాణ్ణి చచ్చిండో బతికిండో కూడా తట్టి చూస్తులేరెవ్వరూ. తలెత్తి రోడ్డువైపు చూసిండు చిట్టి.

ఏదో తరుముకొస్తున్నట్టు హడావుడిగా పోతున్నరందరూ. పోలీసు స్టేషన్ ముందరి నుంచి తీరిగ్గ నడిచే వాళ్ళెవరుంటరు?

పోతున్న వాళ్ళలో కొందరు ఆగినట్టు, ఆగి ఆగి నడుస్తున్నట్టు, గోడ మీది నుంచి తొంగి చూస్తున్నట్టూ, చూడనట్టే నటిస్తూ వెళ్ళిపోతున్నట్టూ ఊహించుకున్నాడు చిట్టి.

ఏమైనా తనను తీస్కొచ్చి అప్పుడే నాలుగ్గంటలయింది. ఇంకేమీ కాకపోవచ్చు.

"వాణ్ణింకా అక్కడెందుకుంచింరా" అనుకుంటూ బైటికెళ్ళిపోయిండు ఎస్సై.

ఒళ్ళంతా దెబ్బలే. కమిలిపోయి పచ్చిపుండు లాగ అయింది ఒళ్ళు. లేపడానికి దగ్గరికొచ్చిన కానిస్టేబుల్‌కు తన తండ్రి వయసుంటది. అడిగిండు -

"లక్ష్మయ్య కొడుకువా నువ్వు, చిన్నోడివా"

అవునన్నట్టు తలూపిండు చిట్టి.

"ఏం చదువుతున్నావ్"

'ఏడో క్లాస్'

అయ్యో అన్నట్టు తలకొట్టుకున్నడు ఆ పెద్ద మనిషి. 'ఉన్న ఇద్దరు ఇదే అయితే మీ అమ్మ నాయిన గతేందిరా' అనుకున్నడు మనసులో. పైకి అన్లేదు.

మంచినీళ్ళ గ్లాసు అందిస్తూ "సరెండరయితడేమో అడుగు మీ అన్నను" అని మాత్రం అన్నడు.

సరెండరయి తల్లిని సాదుదామనుకున్న సదానందంను ఏం చేసిండు? దుకాణంల కూచున్నోణ్ణి తల్లి ముందరినుంచే పట్టుకపోయి 'మిస్సింగ్' అన్లేదా. పన్నెండేళ్ళ చిట్టికి రాజకీయాలను నేర్పింది లాఠీలు, పోలీసు బూట్లే.

అర్థరాత్రుళ్ళు హాస్టళ్ళమీద పడి తలుపులను తన్నుకుంటూ, చేతికంది నోళ్ళను జుట్టు పట్టి ఈడుస్తూ "ఎవడున్నడ్రా లోపల, ఎవడు మీకివన్ని నేర్పుతున్నది. ఎవడెవడు బైటి మీటింగులకు పోతున్నడు" అంటున్నప్పుడు నిజంగా చిట్టికేం తెల్వదు.

దొంగతనంగా తరలిపోతున్న రేషన్ బియ్యాన్ని పట్టుకొని (కొందరు యువకులు) రాడికల్స్ ఆ వాడ జనాలందరికీ పంచిపెడుతున్నరని హాస్టల్ పిల్లలంతా ఉరికురికి చూసొచ్చిండు. బియ్యంబస్తాల బండి చుట్టూ మూగిన జనం - తట్టలల్ల బియ్యం పోయించుకొని పోతూ ఒకటే సంతోషం. "అరే - మీ అన్న కూడా వున్నడు కదరా వాళ్ళల్ల" అని ఫ్రెండ్స్ అడుగుతుంటే తనేం మాట్లాడలేదు. అది మంచిపనో, చెడ్డపనో తెల్వదు.

కానీ గొల్లపల్లిల - తన అన్న పోలీసులకు దొరికిపోయినప్పుడు - వాడ ఆడోళ్ళంతా అడ్డంపడి అన్నను విడిపిచ్చి పోలీసులను ఎళ్ళగొట్టిండని తెల్సినప్పుడు - ఆలోచన మొదలయ్యింది.

"పురుగుల అన్నం మాకొద్దు. రేషన్ కోటా పెంచాలె" అని హాస్టల్ల అన్నం కంచాలు బోర్లిచ్చి నిరసన చేసినప్పుడు ఆలోచనకు ముందడుగు పడింది.

తన హాస్టల్‌నించి బైటికొచ్చి అన్ని హాస్టళ్ళూ తిరిగిండు. సోషల్ వెల్ఫేర్ హాస్టళ్ళ సమస్యలన్ని అందరూ చర్చించుకున్నారు. స్కూలు దగ్గర కూడా ఆందోళన మొదలయింది.

ఎప్పుడు కూలి మీద పడ్తయో అన్నట్టున్న క్లాసు రూములు. కుర్చీలు, బల్లలు లేవు. టీచర్లు రారు. వచ్చినా పెరిగిన సిలబస్.

పెంచిన సిలబస్ తగ్గించాలని, నోట్‌బుక్స్ సప్లయ్ చెయ్యాలని, క్లాసు రూములు కట్టించాల్నని క్లాసులు బాయ్‌కాట్ చెయ్యడం, రోడ్లమీద ధర్నాలు - సాయంత్రాలు మళ్ళీ విద్యార్థులందరూ ఇండ్ల దగ్గర కలుసుకొని మాట్లాడుకునుడు - కార్యక్రమాలు ఊపందుకున్నయ్.

హైస్కూలు విద్యార్థుల అరెస్టులు జరిగే వరకు - ఇంక వాళ్ళను విడిపించుకోడానికి మళ్ళీ ఆందోళన - పోస్టర్లు వెయ్యడం, వాయిస్‌లు రాసి అంటించడం. అప్పటికి జిరాక్స్ కూడా లేదు - కార్బన్‌లు పెట్టి రాత్రంతా కూచొని వాయిస్‌లు రాసేవాళ్ళు. తెల్లవారి ఎవరూ లేవకముందు పోయి అంటించిరావడం.

ఓసారి కరపత్రాలు పంచుకుంటూ పెట్రోలింగ్ పోలీసులకు దొరికిండు - ఇంత చిన్న పిల్లగాడికేం తెలుస్తది. ఎవరో చాక్లెటిచ్చి పంచిరమ్మన్నరు అనుకొని - 'ఎవరు ఇచ్చిండురా నీకివి. చూపిద్దుపా' అని జీపెక్కించుకున్నారు. జీపు కొంచెం దూరం పోయినాంక ఒక ఇంటి ముందర ఆపమని - ఆ ఇంట్ల వున్న ముసలమ్మను చూపించిండు - 'ఇగో ఈ అమ్మే ఇచ్చింది' అని. తర్వాత ఆ సంగతి చెప్పుకొని ఎన్నిరోజులు నవ్వుకున్నరో.

అరెస్టు చేసిన వాళ్ళను ఇరవై నాలుగ్గంటలలోపు కోర్టులో హాజరు పర్చాలని పోస్టర్లు రాసుకొని పొయ్యి బస్‌డిపో ముందు నిలబడితే, తెల్లవారి ఐదుగంటలకు ముసిముసి చీకట్లలో - ఆర్‌టిసి డ్రైవర్లు ఎట్ల కనిపెట్టిండ్రో ఏమో కానీ, ప్రతొక్క బస్సు డిపో ముందాపి - దిగి సిగరెట్ ముట్టించుకొని, అటు తిరిగి ఇటు తిరిగి పోస్టర్లు పడ్డయని గమనించిన తర్వాతనే బస్సులు కదిలినయ్.

చీకటిపడి దోమలు ముసురుతున్నయ్. బైటి నుంచి పరిచయమున్న గొంతులు.... లాకప్ లోపట ఉచ్చవాసనతో కడుపుల తిప్పినట్టయింది చిట్టికి. ఆకలి గుర్తొచ్చింది. పొద్దుననంగ హాస్టల్ల తిన్న సాంబారన్నం. స్కూలుకని చెప్పి బైటపడి కరపత్రాలు పంచుకుంట తిరిగిండు.

'బూటకపు ఎన్నికలను బహిష్కరించండి'

కొత్తగా పార్టీ పెట్టి నక్సలైట్లే దేశభక్తులంటున్న ఎన్టీఆర్ దగ్గరి నుంచి ఎర్రషర్టుల కమ్యూనిస్టుల వరకూ 'ఓట్ల కోసం వచ్చే నాయకులను చెప్పులతో కొట్టండి' అని వున్న కరపత్రాలు.

స్టేషనంతా ఒక్కసారి పొజిషన్‌లోకొచ్చింది. ఎస్.పి విజిట్. తనసీట్లో కూచున్న ఎస్‌పి ముందు నిలబడ్డ సిఐ చెపుతున్నడు

"షాప్స్‌లోకి, ఇళ్ళల్లోకి వెయ్యడానికి వీలుగా ఇట్ల మడిచి పెట్టుకుంటరు" అని నాలుగు మడతలున్న కరపత్రాన్ని ఇప్పి చూపిస్తున్నడు.

ఆ రోజటి కేస్‌ల ఫైళ్ళలోకి చూస్తు.

"సరే, ఆ అమ్మాయిలనూ, మైనర్‌లను వదిలెయ్యండి" అన్నడు.

"పోన్లొస్తున్నయ్' అని గొణిగిండు.

"అవును సార్, ఇప్పుడే సార్లు కూడ వచ్చిపోయిండు".

"అవునవును. వాళ్ళకు మరి వీళ్ళే పౌరులు. వాళ్ళవే హక్కులు" ఎస్‌పి మొహంలో చెప్పలేనంత అసహనం.

"వాడు పికె బ్రదర్ సార్!" అని చిట్టివైపు చూపించిండు ఎస్ఐ - 'ఆహా' అని తలతిప్పి చూసి - లేచి వెళ్ళిపోయిండు ఎస్.పి.

ఇంక ఈ రాత్రి దెబ్బలకు సిద్ధం కావాల్సిందే అనుకున్నడు చిట్టి.

"హాస్టల్‌కెవరెవరొస్తరు"

'తెల్వదు'

"మీ అన్న షెల్టర్లు చూపించు"

'తెల్వదు'

"వాణ్ణి పట్టియ్యక పోతే నిన్ను ఎన్‌కౌంటర్ చేస్తం"

తెల్లారింది - స్టేషన్లో హడావుడి కూంబింగ్ పార్టీ అట. సిఐ పోతున్నడు కూంబింగ్‌కు. వాడల పేర్లు షాట్‌కట్‌లో చెప్పుకుంటున్నరు - ఆర్‌సి, బిజి కొత్తూర్....

కొత్తూరు జెండా - ఉలిక్కిపడ్డడు చిట్టి.

కొత్తూరు జెండా గల్లీలనే కదా అన్న కలిసే షెల్టర్ - ఒళ్ళంత చెమటలు పట్టినయ్. మొకం పాలిపోతూ ఉంటే మెల్లగా 'అన్నాటైమెంతయింది?' అని అడిగిండు ఒక కానిస్టేబుల్‌ను

"తొమ్మిదింబావు"

'హమ్మయ్య' ఒక్కసారి ఊపిరి పీల్చుకున్నట్టయింది.

అన్నతో తనకు ఎపిటి తొమ్మిది గంటలకు. టైమ్ దాటిపోయింది. నలిగిపోయిన చేతివేళ్ళవైపు గర్వంగా చూసుకున్నడు చిట్టి.

**(చిట్టి నిజమైన పేరే. వాళ్ళ అన్నది కూడా. కథలో మారుపేర్లు ఎందుకు పెట్టలేదంటే - నలుగురు సభ్యులను విప్లవోద్యమానికి అందించిన ఆ కుటుంబంలో ఎన్‌కౌంటర్ చేయదగ్గవాళ్ళు ఇంకెవ్వరూ మిగల్లేదు కాబట్టి.)**

*

# విరసం 20వ రాష్ట్ర మహాసభల నివేదిక

# ధిక్కార స్వరంతో ప్రజల మనిషిగా పునరంకితమైన విరసం

**మూ**డు నెలల నిషేధపు చీకట్ల నుండి ప్రజల మనిషిగా తిరిగి తెలుగు జాతి పోరాటాల్లోకి, సాహిత్య సాంస్కృతిక రంగంలోకి ప్రవేశించిన విరసం జూన్ 10, 11 తేదీలలో హైదరాబాద్‌లోని ఆంధ్ర సారస్వత పరిషత్ హాలులో ఇరవయ్యవ రాష్ట్ర మహాసభలు జరుపుకున్నది.



పతాకావిష్కరణ

బండెనక బండి కట్టి... యాదగిరిపల్లెలో

మఖ్దూం ప్రాంగణంలో

పాణిగ్రాహి హాలులో

చెరబండరాజు వేదిక మీద రెండు రోజుల పాటు మహాసభలు జరిగాయి.

10వ తేదీ ఉదయం 11 గంటలకు - విరసం నిషేధకాలంలో పాలమూరులో క్రోబాల విషపు కాటుకు బలైన కామ్రేడ్ కనకాచారి సహచరి సుజాత సుత్తీ కొడవలి ఎర్రజెండాని ఆవిష్కరించారు. విరసం వ్యవస్థాపక కార్యవర్గ సభ్యుడు, విప్లవ సాహిత్యోద్యమానికి తన రచన ద్వారా, జీవితం ద్వారా, మరణం ద్వారా నిత్య స్ఫూర్తిని అందించిన కామ్రేడ్ చెరబండరాజు సహచరి శ్యామల విరసం పతాకాన్ని ఆవిష్కరించారు. విరసం సభ్యుడు, వరంగల్ యూనిట్ కన్వీనర్, కవీ రచయితా అయిన కామ్రేడ్ జనార్దన్ విప్లవ సాహిత్యోద్యమం నుండి అంతకన్నా సువిశాలమైన విప్లవ రాజకీయ రంగంలోకి వెళ్లి, ప్రజల మధ్య అనేక బరువు బాధ్యతల్ని నిర్వహిస్తూ విరసం సగర్వంగా ప్రకటించుకొనే పెన్నూ, గన్నూ సంప్రదాయాన్ని అత్యున్నత స్థాయికి తీసుకువెళ్లే క్రమంలో పోలీసుల బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడు. ఆయన తల్లి అమృత అఖిల భారత విప్లవ సాంస్కృతిక సమితి పతాకాన్ని ఆవిష్కరించారు.

ఉన్నత చదువులు చదువుతూ, తెలంగాణా విద్యార్థి ఉద్యమంలో పనిచేస్తూ విప్లవోద్యమంలోకి వెళ్లిన నాగప్రసాద్ ఇటీవల గుంటూరు జిల్లాలో బూటకపు ఎన్‌కౌంటర్‌లో అమరుడయ్యాడు. ఆయన తల్లి రాధమ్మ అమర వీరుల స్మారక స్థూపాన్ని ఆవిష్కరించారు.

ఎర్రజెండా పాటలతో విరసం పతాక గీతంతో, అమరవీరుల పాటలలో పతాకావిష్కరణ ఉద్వేగభరితంగా సాగింది. తర్వాత విరసం కార్యదర్శి ప్రతినిధులను సభలోకి ఆహ్వానించారు. తెలుగు సాహిత్యంలోని సుప్రసిద్ధ కవులు, రచయితలు అసంఖ్యాకంగా హాజరయ్యారు. ఇరవైవ మహాసభల ఉద్దేశ్యాన్ని వివరించారు. ప్రారంభ సమావేశానికి రాష్ట్ర అధ్యక్షులు కళ్యాణరావును, ఆహ్వాన సంఘం అధ్యక్షులు బొజ్జాతారకం, ముదిగంటి సుజాతరెడ్డి, చేకూరి రామారావులను వేదిక మీదికి ఆహ్వానించారు. ప్రారంభోపన్యాసం చేయవలసిన మరాఠి దళిత రచయిత యశ్వంత్ మనోహర్ అనారోగ్యకారణంతో చివరి నిమిషంలో తన ప్రయాణం వాయిదా వేసుకోవడం వల్ల విరసం వ్యవస్థాపకుల్లో ముఖ్యులు, విరసం సభ్యులు కా.ఎం.టి.ఖాన్‌ను ప్రారంభోపన్యాసం యివ్వాల్సిందిగా ఆహ్వానించారు.



చేకూరి రామారావు

ఆహ్వాన సంఘం అధ్యక్షులు

## విరసం రాష్ట్ర అధ్యక్షులు కళ్యాణరావు అధ్యక్షోపన్యాసం

1970 జూలై 4న యిదే హైదరాబాదులో విరసం ఏర్పడింది. అక్టోబర్‌లో ఖమ్మంలో మొదటి మహాసభ జరుపుకుంది. మళ్ళీ పుట్టినచోటనే నిషేధం తర్వాత ఇరవైవ మహాసభ జరుపుకుంటున్నది. ప్రయాణం చిన్నది కాదు, ముప్పై అయిదేళ్ళు పైబడిన ప్రయాణం. నడచినబాట పూలబాటకాదు, చాలా గతుకులు, ముళ్ళు ఉన్నబాట. ఎక్కడ అడుగుబడితే ఏ ప్రమాదం జరుగుతుందో అనేంత ప్రయాసతో కూడిన నడక. ఒక సంవత్సరం కాదు, రెండుసంవత్సరాలు కాదు. పదేపదే చెప్పుకపోవడం స్వగతం అవుతుందేమోగాని, ప్రపంచ సాహిత్యచరిత్రలోనే యింత సుదీర్ఘ యాత్ర - యింత కష్టాలకు, వొత్తిళ్ళకు, అణచివేతకు గురవుతూ కొనసాగుతున్నది విరసం కావడం గర్వించవలసిన విషయం. ఈ బలం ఎక్కడున్నదంటే - విరసం ప్రజలకు, ప్రజాపోరాటాలకు అంకితం కావడం వల్లనే సాధ్యమైందని మేం సవినయంగా

చెప్పుకుంటున్నాం. 2005లో నిషేధానికి గురైంది. అంతదాకా విరసం కదలికలపై నిఘా, కంటి చూపుమీద నిఘా, కలంపైన నిఘా, కలం రాసిన రాతపై నిఘా, మా గొంతుపై నిఘా, మా శ్వాసపై నిఘా, నిర్బంధాలు, పోలీసుల బెదిరింపులు, కుట్రకేసులు పెరిగి నిషేధం కావడం ఒక చారిత్రక నేపథ్యంలో జరిగింది.

ఈ సభలకు రెండు ప్రత్యేకతలున్నాయి. ముప్పై అయిదేళ్ల పైబడిన ప్రయాణాన్ని ఈ సభలు సూచిస్తున్నాయి. ప్రపంచ సాహిత్య చరిత్రలోనే నిషేధానికి గురైన సాహిత్య సంస్థ జరుపుకుంటున్న మహాసభలు కావడం వల్ల యివి చరిత్రలో ఒక ప్రత్యేకతను సంతరించుకుంటున్నాయి. యిన్ని ఆటుపోట్లు, యిన్ని ఆంక్షలు అనుభవించడానికి శక్తి ఎక్కడి నుండి వచ్చింది. విరసంలో ఏముంది. విరసంలో విప్లవం ఉన్నది. రచన ఉన్నది. సంఘటిత స్వభావం ఉన్నది. యివన్నీ కలిసినందువల్ల విరసం చరిత్ర అయింది, చరిత్ర అవుతున్నది.



స్థూపావిష్కరణ

భావప్రకటనా స్వేచ్ఛ అత్యాశ కాదు. సామాన్యుల దగ్గరి నుండి ఉద్యమాలదాకా మాట కోసం, యిదీ నా భావం అని చెప్పుకోవడం కోసం చాలా ఘర్షణ పడాల్సి వచ్చింది. నాలుగు వందల సంవత్సరాల కిందట జాన్‌మిల్టన్ చెప్పాడు. ఈ పుస్తకం మంచిదా చెడ్డదా? ఈ పుస్తకంలో పవిత్రత ఉందా? అపవిత్రత ఉందా? అని నిర్ణయించవలసింది ప్రజలు. వాళ్ళకు స్వేచ్ఛ ఉంటే వాళ్ళు మాత్రమే ఆ పనిచేయాలి అని అన్నాడు. అదేమాట విరసం యిన్నేళ్ళుగా చెప్పాల్సివస్తోంది. విప్లవకారులు చెప్పాల్సివస్తున్నది. ఏ మాట మంచిది, ఏమాట చెడ్డది, ఏ గొంతు మంచిది, ఏ గొంతు చెడ్డది, ఏ జీవన విధానం మంచిది, ఏ జీవన విధానం చెడ్డది, ఏ ఆలోచన మంచిది, ఏ ఆలోచన చెడ్డది తెల్సుకొనే హక్కు ప్రజలకు యివ్వండి. ప్రజలు కాకుండా పాలకులు, పోలీసులు, రాజ్యం, కోర్టులు ఏది మంచో చెప్పేటట్లయితే ప్రజాస్వామ్యం ఉన్నట్టా? లేనట్టా? నీ అభిప్రాయాలతో నాకు ఏకీభావం కాదు. కానీ నీ అభిప్రాయాలను నీవు చెప్పుకోవడానికి నా ప్రాణాన్నయినా యిస్తాను అంటాడు వాల్టేర్. మన స్వేచ్ఛకు అండ ప్రజలు మాత్రమే. ప్రజాపోరాటాలు మాత్రమే. మనకు ఈ హక్కులను నిలబెట్టి, మన పరం చేశాయి. కానీ పోలీసు రాజ్యం ఆంక్షలు ఉండనే ఉంటాయి. యివాళ పోలీసులు నీవు ఈ రచన చేయి, ఆ రచన చేయకు అంటున్నారు. రచయితలు మౌనరుషులు కారు. పాలకులు ప్రజలకు ద్రోహం చేస్తున్నప్పుడు రచయిత ప్రజలకు తన రాతద్వారా, మాటద్వారా చెప్తాడు. ఏ రచయితయినా నేనీ పని చేయను అన్నా, నాకు రాజకీయాలు లేవు అన్నా నమ్మడానికి లేదు. శ్రీశ్రీ రాజకీయాలు శ్రీశ్రీకి ఉంటాయి. విశ్వనాథ రాజకీయాలు విశ్వనాథకు ఉంటాయి. రాజకీయమంటే పాలకులకు అధికారం మారడం కావచ్చుగాని, ప్రజల భాషలో జీవన విధానం. ప్రజల తరపున ఉన్న రచయితకు కూడా అంతే. షెల్లీ అంటాడు - రచయితలు ప్రజల అనధికార శాసనకర్తలు అని. ప్రజల తరపున రచయిత రాజ్యాన్ని ప్రశ్నిస్తూనే ఉంటాడు. నిఘా, కేసులు, నిర్బంధం, నిషేధం చెల్లుబాటుకావు అనే సందేశం మనకాలం మనకు యిచ్చింది, వర్తమానం మనకు యిచ్చింది. కవులు, రచయితలు, మేధావులు, ప్రజాస్వామ్యవాదులు బైటికి వచ్చి అడిగారు. నిషేధం ఎత్తివేతలో ఈ కాలపు సందేశం ఉంది.

విప్లవ రచయిత నిరంతరం ప్రశ్నిస్తూనే ఉంటాడు. రాజ్యాన్ని ప్రశ్నించకపోతే విప్లవ రచయిత ఉనికి లేదు, జీవన విధానం లేదు. యివాళ నేను ప్రశ్నిస్తున్నాను - కనకాచారిని ఎందుకు చంపారు? మన్నెం ప్రసాద్‌ను ఎందుకు చంపారు, మునెప్పను ఎందుకు చంపారు? విప్లవ రచయితగా ప్రశ్న అడుగుతూనే ఉంటాను. యిది రాజకీయమే. ఈ ప్రశ్న వేయకుండా నేను ఏం రాసినా ప్రయోజనం లేదు. ఈ ప్రశ్న వేయటం నేరం కాదు, వేయపోవడమే నేరం. ఈ పని విప్లవ రచయితేకాదు, ప్రతి రచయిత యివాళ వేస్తున్నారు. రాతలో అడుగుతున్నారు. మౌనంగా అడుగుతారు. మౌనంగా రోధించే గుండె గొంతుకలో ఈ ప్రశ్న నిలబడే ఉంటుంది. అది వాళ్ళ కళ్ళలో కనిపిస్తుంది. అందులో గొప్ప తిరస్కారం ఉంటుంది. ధిక్కారం ఉంటుంది. మా పిన్నిక శ్రీనివాస్‌ను అరెస్టు చేసి చిత్రహింసలు పెట్టారు. మా ప్రశాంత్‌ను మా నాగరాజును, మా మోహన్‌ను అరెస్టు చేసి దారుణమైన హింసలు పెట్టారు. సంస్థకు రాజీనామా చేయమని వొత్తిడి తెచ్చారు. రాజీనామా చేస్తారా? కాల్చేయమంటారా? చాలా సూటిగానే అడిగారు. అయినా ఎవరూ చెక్కు చెదరలేదు. యివాళ కాదు, నేను చెప్పానే ముప్పై అయిదేళ్ళ సుదీర్ఘ ప్రయాణం అని. దారిపొడవునా యిదే అనుభవం. అయినా ఏమీ కాలేదు. ప్రజలు పోరాడుతున్నారు, దాన్ని విరసం సభ్యులు సాహితీకరిస్తూనే ఉన్నారు.



విరసం నిషేధాన్ని చీల్చుకొని బైటికి వచ్చింది. ప్రజలకు పునరంకితమవుతున్నది. యిది విప్లవాల యుగం. దేశాలు స్వాతంత్ర్యం కోసం, జాతులు విముక్తి కోసం, ప్రజలు విప్లవం కోసం పోరాడుతున్నారు. ఆ యుగంలో విరసం తన ఉజ్వల చరిత్రను రాసుకుంటున్నది. ఆ యుగంతో విరసం కలిసి నిలబడింది. ఆ విముక్తి పోరాటాలతో విరసం మమేకమవుతున్నది. ప్రజల విప్లవాలను తన గానంగా విరసం మలుచుకుంటున్నది. విరసం ప్రణాళికను అంగీకరించేవాళ్ళను, వాళ్ళు రచయితులయినా, సాంస్కృతిక కార్యకర్తలయినా, సామాజిక శాస్త్రాల్లో కృషి చేసే వారయినా - వారందరినీ విరసం తనలోకి ఆహ్వానిస్తోంది. విరసం ప్రజల గొంతు. విరసం సమస్తం ప్రజలే. చేతుల్ని కలుపుదాం రండి, హృదయాలను విప్పుకొని మాట్లాడుకుందాం రండి.

విప్లవరచయితల సంఘం వర్ధిల్లాలి

నూతన ప్రజాస్వామిక విప్లవం వర్ధిల్లాలి

మార్క్సిజం లెనినిజం మావో ఆలోచనా విధానం వర్ధిల్లాలి.

# ఆహ్వాన సంఘ అధ్యక్షోపన్యాసాలు

**ముదిగంటి సుజాతా రెడ్డి:** మూడు నెలల నిషేదం తర్వాత విరసం మహాసభలు జరుపుకుంటున్న ఈ సందర్భంలో ఒక బాధాకరమైన వార్త పత్రికల్లో చూశాం. ఒరిస్సాలో కూడా జననాట్యమండలితోపాటు అనేక ప్రజా సంఘాలను అక్కడి ప్రభుత్వం నిషేధించిందని చదివాం. యిదేకాక రోజూ అనేక నిర్బంధాల గురించి, అణచివేతల గురించి వింటూ వున్నాం. ప్రజల పక్షాన నిలబడి సినిమాలు తీస్తున్న ఒక కళాకారుడి సినిమాపై ఆంక్షలు పెట్టడం గతంలో చూశాం. పుస్తకాల మీద, సాహిత్యం మీద నిషేధాలు పెట్టారు. ప్రజాస్వామ్యాన్ని నమ్మేవారికి యివి చాలా బాధ కలిగిస్తాయి.



బ్రిటీష్ పాలనలోగాని, నిజాం సర్కారులోగాని యింతగా నిషేధాలు, నిర్బంధాలు, నిఘాలు ఉన్నట్టు నాకనిపించదు. ఆ రాజ్యాలు ప్రజాస్వామ్యమైనవి కాదు. ప్రజాస్వామ్యం అని చెప్పుకునే ప్రభుత్వాలు కవుల మీద, కళాకారుల మీద, ప్రజాసంఘాల మీద యింతగా అణచివేత ప్రయోగించడం, నిషేధాలు తీసుకురావడం గర్హించాలి. రచయితలు, కవులు, కళాకారులు ప్రజల నుండి వస్తారు. ప్రజలకోసం రాస్తారు. అందువల్ల వాళ్ళు ప్రజల మనుషులు. అలాంటి వాళ్ళను నిర్బంధించడం, వేధించడం ఎట్లాంటి ప్రజాస్వామ్యం అవుతుంది? అని మనం ప్రశ్నించాలి. అరణ్యంలో నెమలి నాట్యం చేస్తుంది. కోకిల పాడుతుంది. ప్రకృతిలోని చైతన్యరూపాలివి. ఆ చైతన్యాన్ని యింకా చైతన్యవంతం చేయడం కోసం అవి చాలా సహజంగా తమ అభివ్యక్తిని వెల్లడి చేస్తాయి. వాటికి ఎవరూ చెప్పరు - నీవు పాడు, ఆడు అని. అవి సహజంగానే ఆడుతాయి, పాడుతాయి. అట్లాగే కవులు, కళాకారులు కూడా భావావేశంతో తమ కళను వ్యక్తం చేస్తారు. అంతేగాని పాలకుల ఆనందంకోసం, వాళ్ల యిష్టం మేరకు రాయరు. రచయిత ఎప్పుడైనా ప్రజల మనిషే.

పాతరోజుల్లో కూడ అప్పటి పాలకుల ఆంక్షలను, కట్టుబాట్లను వొత్తిళ్ళను రచయితలు భరించలేక నిందించారు. ధిక్కరించారు. ఇమ్మనుజేశ్వరాధములు... అనీ, రాజుల్ మత్తులు... అనీ నిర్భయంగా నిందించారు. త్యాగయ్య, అన్నమయ్య మొదలైనవారు రాజుల మీద స్తోత్రపాఠాలు రాయడానికి నిరాకరించారు. సాహిత్య చరిత్రలో ఎన్నో సాహిత్య యుగాలు ఉన్నాయి. ఎన్నో సాహిత్య ఉద్యమాలు వచ్చాయి. అవి అన్నీ రాజులకోసం రాలేదు. ప్రజలకోసం, ప్రజాజీవితం నుండి సాహిత్యంలోకి వచ్చాయి.

ఉదాహరణకు జాను తెనుగు సాహిత్యంలోకి వచ్చిందంటే - తమ భావాలను ప్రజలకు అందించాలనే ఉద్దేశ్యంతోనే. ఇప్పటి చైతన్యం అప్పటి కవులకు, రచయితలకు ఉండకపోవచ్చు. కాలధర్మాన్ని అనుసరించి, యుగస్వభావాన్ని బట్టి, చారిత్రక సందర్భాన్ని బట్టి చైతన్య రూపం వేరుగా ఉండవచ్చు. అయితే ప్రజల్లో చైతన్యం తేవాలని, ప్రజలకు తమ సాహిత్యం చేరాలనే ఉద్దేశ్యం ప్రాచీన సాహిత్యంలో కూడా స్పష్టంగా కనిపిస్తుంది. నన్నయ కూడా చివరికి రాజరాజ నరేంద్రుని కోసం రాయలేదు. 'జగత్‌హితం' అని చెప్పుకున్నాడు. ఆ జగత్‌హితం ఎలాంటిది అని మనం ప్రశ్నించవచ్చు. తిక్కన 'ఆంధ్రావళి మోదంబు అరయునట్టు' రాస్తున్నాను అన్నాడు. కవులు, రచయితలు ప్రజలకోసం అని చెప్పుకోవడం చాలా పాతవిషయం. తిక్కనకు, శ్రీశ్రీకు భావజాలంలో తేడా ఉండవచ్చు. ఉంటుంది కూడా. వాళ్ళవాళ్ళ వ్యక్తీకరణల్లో తేడా ఉంటుంది.

సాహిత్యంపై ఆంక్షలు, నిషేధాలు వస్తే రచయితలంతా ఐక్యమై ఎదిరించి పోరాడే సాంప్రదాయం మనకు ఉన్నది. ప్రజాస్వామ్యం పట్ల గౌరవం ఉన్న రచయితలు ఏ రకమైన నిర్బంధాలనూ అంగీకరించరు. ప్రజాస్వామ్యం అని చెప్పుకొనే ప్రభుత్వాలు ఏం చేస్తున్నాయి? పోలీసులతో, పారామిలటరీతో, తుపాకులతో చీటికిమాటికి ఎన్నికలు జరుపుకొని అధికారానికి రావడానికి ప్రయత్నిస్తుంటాయి. యివన్నీ ఎందుకంటే వాళ్ళ అధికారాన్ని, ఆస్తులను కాపాడుకోవడానికి, పెంచుకోవడానికి. సామాన్యుల పరిస్థితి ఏమిటి? ప్రజాస్వామ్య విలువలు - సంస్కృతి పరిస్థితి ఏమిటి? అనే చింత మన రాజకీయ పార్టీలకు కొంచెం కూడా లేదు. అన్ని పార్టీలు అట్లాగే ఉన్నాయి. తాము అట్లా ఉంటూ ప్రజల గురించి ఆలోచిస్తున్న, రాస్తున్న రచయితలపై నిర్బంధాలు, నిషేధాలు తీసుకొని వస్తున్నాయి. దీన్ని మనం అంగీకరించ కూడదు.



జననాట్యమండలి

రచయితకు భావ స్వాతంత్ర్యం ఉంటుంది. ఎలాంటి అభిప్రాయాలైనా రాస్తారు, మాట్లాడతారు. విరసంకు తన అభిప్రాయాలు తనకు ఉంటాయి. అవి చెప్పుకునే స్వేచ్ఛ, ఆచరించే స్వేచ్ఛ విరసం రచయితలకు ఉంటుంది. దాన్ని కాదనడానికి లేదు. కాదంటే ప్రజాస్వామ్యం లేనట్టే. అందుకే విరసంను నిషేధించినప్పుడు అందరం వాళ్ల గురించి ఆలోచించాం. మాట్లాడాం. ప్రభుత్వ చర్యను ఖండించాం.

ఈ మహాసభలు జరుపుకోవడం విరసంకు చారిత్రాత్మకం. తన సాహిత్య కృషిని విరసం యింకా ముందుకు తీసుకుపోవాలని నా కోరిక. అందరం కలిసి విరసం ఆలోచనలను పంచుకుందాం. ప్రగతిశీల భావాలను నిలబెడదాం. విరసం తెలుగులోని రచయితలందరితో ఒక పెద్ద ఆహ్వాన సంఘం ఏర్పరచింది. రచయిత ప్రజల మనిషి అనుకున్నప్పుడు ప్రజల గురించి ఆలోచించే వాళ్ళందరినీ, ఎన్ని బేధాలున్నా, అందరినీ ఆహ్వానించింది. అందరం కలిసి ఈ సభలు జరుపుకుంటున్నాం. ఆహ్వాన సంఘం తరపున నాకీ అవకాశం యిచ్చినందుకు విరసంకూ, మీకు ధన్యవాదాలు.

**బొజ్జా తారకం :** విరసం ఇరవైవ రాష్ట్ర మహాసభలకు వచ్చిన మీ అందరికీ ఆహ్వాన సంఘం తరపున స్వాగతం. నిషేధంకు గురైన విరసం యివాళ స్వేచ్ఛగా తన సభలను నిర్వహించుకుంటోంది. యిట్లా స్వేచ్ఛ ఎంత మేరకు లభిస్తే అంత మేరకు విరసం కార్యక్రమాలు ప్రజల్లోకి తీసికెళ్ళాలని కోరుకుంటున్నాను. వచ్చే రెండేళ్ళ వరకు అవసరమైన ప్రణాళికను ఈ సభల్లో రూపొందించుకొంటారని, దాన్ని సఫలీకృతం చేస్తారని ఆశిస్తున్నాను.

ప్రజల్లోని ఒక వ్యక్తిగా విరసంకు నేనొక మాట చెప్పదలుచుకున్నాను. భవిష్యత్ కార్యాచరణకు యిది ఉపయోగపడుతుందేమో ఆలోచించండి. విరసం నిషేధం నుండి బైటికి వచ్చింది. ఇది గొప్ప విజయం. రాజ్యం వెనక్కు తగ్గి నిషేధం ఎత్తివేసింది. కానీ మీకున్న స్వేచ్ఛ ఎలాంటి స్వేచ్ఛ? ఈ సందర్భంగా విప్లవరచయితలు, మిగతా రచయితలు, కళాకారులు, మేధావులు అందరం కలిసి ఏ ప్రజల నుండి విరసం వచ్చిందో ఆ ప్రజల్లోకి ఊరేగింపుగా వెళ్ళదలచుకుంటే ప్రభుత్వం దానికి అనుమతి యివ్వలేదు. యిలాంటి 'స్వేచ్ఛ' మీకు దొరికింది. హైదరాబాదులో ఎలాంటి స్వేచ్ఛ ఉన్నదో చూడండి, నలుగురూ కలిసి రోడ్డుమీదికి రాదలుచుకుంటే ఎలాంటి పరిస్థితి ఎదురవుతుందో మనకు అర్థమవుతున్నది. ఎలాంటి నిరసననైనా, అసమ్మతైనా సరే నలుగురు కలిసి వ్యక్తం చేయదలుచుకుంటే అది యిందిరా పార్క్‌దగ్గరి నుండి సుందరయ్య పార్క్‌దాక మాత్రమే సాధ్యమవుతుంది. యిదీ స్వేచ్ఛ. మీ నిరసననైనా, ధిక్కారాన్నైనా యిక్కడ మాత్రమే వ్యక్తం చేసుకోవాల్సి ఉంటుంది.



యిట్లాంటి సందర్భంలో ప్రజల మధ్యకు విరసం వచ్చింది. అయితే ప్రజలు విరసం నుండి చాలా ఆశించే అవకాశం ఉన్నది. ఎన్నో అత్యాచారాలు, దుర్మార్గాలు, మోసాలు ప్రజలపై ప్రభుత్వం నిస్సిగ్గుగా కొనసాగిస్తోంది. అధికారంలో ఉన్న పార్టీలు, రాదలుచుకున్న పార్టీలు అన్నీ యిట్లాగే ఉన్నాయి. ప్రజల తరపున నిలబడి ప్రజల ఆకాంక్షలను నిలబెట్టడానికి ఎవ్వరూ లేరు. విరసం, అలాంటి యితర సంఘాలు ఆ పని చేయల్సి ఉన్నది.

యిక్కడ మీరు ఒక బ్యానర్ పెట్టారు. మంచి సాహిత్యం మానవతాలన్ని స్థాపించేవేళ.... అని ఉంది. కానీ సాహిత్యం రాకముందే మానవత్వం యిక్కడ, ఈ సమాజంలో వెల్లివిరిసింది. మనం చేయవలసింది దాన్ని పెంపొందించాలి. దాన్ని సర్వతోముఖంగా అభివృద్ధి చేయాలి. విరసం ఆ పని చేస్తుంది కాబట్టే నిషేధం విధించారు. ఆయుధాన్ని ప్రయోగిస్తున్నారు. అక్రమకేసులు బనాయిస్తున్నారు.

విరసం నుండి కవిత్వం వస్తే చాలదు. పాట రావాలి. పాట అనేక మంది బాధలను కూడగట్టి, స్వరంగట్టి అందరికీ వినిపిస్తుంది. సమాజాన్ని ప్రభావితం చేయడానికి పాట రావాలి. నవలలు, కథలు యింకా రావాలి. ఏ ప్రజల బాధ చూచినా అది గొప్ప నవల అవుతుంది. ఏ ఎన్‌కౌంటర్ ఘటన లోతుల్లోకి వెళ్ళి చూసినా అదొక గొప్ప నవల అవుతుంది. ప్రజలపై సాగిస్తున్న ప్రతి దమనకాండ ఒక మంచి నవలగా రూపొందాలి. సమాజాన్ని కేవలం ఇన్‌స్పైర్ చేయడం మాత్రమే కాదు, దానికి పాట గొప్పగా ఉపయోగపడుతుంది. కానీ యింకోపని జరగాలి. అదే సమిష్టిసాహిత్య రూపకల్పన జరగాలి. మొన్ననే 'హిందూ'లో చదివాను. వియత్నాం యుద్ధంలో డాక్టర్‌గా పనిచేసిన యువతి డైరీ యిన్నేళ్ళ తర్వాత వెలుగులోకి వచ్చింది. యుద్ధంలో తూటా తగిలి ఆమె చనిపోయిందట. ఆమె డైరీ చదివితే - ఆ యుద్ధ కాలంలోని ఆమె అనుభవాలు అందులో ఉన్నాయి. యుద్ధంలో గాయపడిన తనవాళ్ళను ఆమె మోసకపోయి వైద్యం చేసిన అనుభవాలవి. అప్పుడామె పడిన పాట్లు, వేదన అందులో ఉన్నాయి. ఒక వీరుణ్ణి నేను బతికించలేకపోతున్నానే అని ఆమె పడిన బాధ ఆ డైరీలో గొప్పగా రాసుకుంది. కళ్ళెదుటే యుద్ధవీరుల మరణం ఆమెను ఎంతగా కదిలించి వేసిందో. ఆ పత్రికలో కొన్ని సన్నివేశాలు రాశారు. మన దగ్గర అలాంటి అనుభవాలు చాలా ఉన్నాయి. కానీ అవి రికార్డు కావడం లేదు. విరసం అవన్నీ రాయాలి. విరసం నుండి ప్రజలు యిలాంటివి ఆశిస్తున్నారు. ఎందుకంటే విరసంకు చారిత్రక బాధ్యతలు అనేకం ఉన్నాయి. చరిత్ర తనపై పెట్టిన బరువు బాధ్యతలు అవి. ప్రజల మనిషిగా పునరంకితమవుతున్నామని ఈ సందర్భంలో విరసం ప్రతిజ్ఞ చేస్తోంది. అందుకే ఈ సభలు. కానీ అంత తేలిక కాదు. ప్రజలు తమ బాధలను వ్యక్తీకరించుకోలేని దయనీయ స్థితిలో ఉన్నారు. విరసం దాన్ని బైటికి తీసుకురావాలి. రాజ్యం చూస్తూ ఊరుకోదు. అయినా మనకు చాలా అనుభవాలు ఉన్నాయి. ప్రజల మనిషిగా తిరిగి ప్రజల్లోకి వెళ్ళాలని అనుకుంటున్నారు కాబట్టి ప్రజల గొంతుగా వాళ్ళ బాధలను, పోరాటాలను పలికించాలని, ప్రజల మనిషిగా మీ పాత్ర మీరు పోషిస్తారని నమ్ముతున్నాను.



ఎం.టి.ఖాన్

## కామ్రేడ్ ఎం.టి.ఖాన్ ప్రారంభోపన్యాసం

కామ్రేడ్స్,

ఈ సభల్లో నా రాజకీయ కుటుంబ సభ్యులను కలుసుకున్న ఆనందం నన్ను ఉక్కిరిబిక్కిరి చేస్తోంది. నా సొంత కుటుంబ సభ్యులకన్నా వీరితో నాకు ఎక్కువ అనుబంధం ఉంది. కుటుంబాలకన్నా, కుటుంబ సభ్యులకన్నా రాజకీయాలు, రాజకీయ సహచరులు చాలా ముఖ్యం. రాజకీయాల కోసం అనేక చిత్రహింసలను, నిర్బంధాలను, జైళ్ళను అనుభవించిన వాళ్ళు యిక్కడున్నారు. వాళ్లందరి మీద అపారమైన గౌరవం నాకున్నది. అలాంటి సభ్యులు, రచయితలు ఉన్న విరసం 20వ మహాసభలను ప్రారంభించడం నాకు చాలా గౌరవం. నాకీ బాధ్యత అప్పగించినందుకు విరసంకు ధన్యవాదాలు.

ముప్పై అయిదేళ్ళ కిందటి మాట. ఖమ్మంలో వర్తక సంఘం వాళ్ళ హాలు ఉండేది. జ్వాలాముఖి, నిఖిలేశ్వర్, వరవరరావు, చలసాని ప్రసాద్, నేనూ అక్కడ విరసం తొలి మహాసభలు నిర్వహించిన రోజులు గుర్తుకొస్తున్నాయి. మేమంతా విరసంను నిర్మించాం. రష్యన్ రచయిత పుష్కిన్ ఒకమాట అంటాడు 'ఎలా జన్మించావన్నదికాదు, ఎలా జీవించావన్నది చాలా ముఖ్యం' అని. తమ చుట్టూ జరుగుతున్న పోరాటాల పట్ల ఎలా ఉండాలి? ఎలా భాగస్వాములం కావాలి? అని ఆ రోజుల్లో రచయితలు, కవులు ఆలోచించారు. దాని ఫలితమే విరసం. యివాళ ఆ రోజుల్లో అట్లా

ఆలోచించిన వాళ్ళను, పని చేసిన వాళ్ళను యిక్కడ చూస్తున్నాను. చాలా సంతోషంగా ఉంది. మనందరికి సంతోషమే.

మనమధ్య కొన్ని బేధాలు ఉండవచ్చు. సందేహం లేదు. దేశంలో రాజకీయ పరిస్థితులు మారుతున్న క్రమంలో, ప్రజా ఉద్యమాల అవసరం రీత్యా ఈ బేధాలు తగ్గిపోతున్నాయి. ఆంధ్రప్రదేశ్‌లో కూడా ఈ వాతావరణం చాలా అనుకూలంగా ఉన్నది. ఒకప్పుడు మనలో చీలికలు వచ్చాయి. రాష్ట్రంలో, దేశంలో వచ్చిన రాజకీయ మలుపులు అన్నీ తప్పక రావలసినవే. కానీ మన ప్రయాణం యింకా సుదీర్ఘమైనది. అన్ని విప్లవ సంస్థలకూ రాజకీయ పరిపక్వత వచ్చింది. ఈ విరసం సభల ఆహ్వాన సంఘం కరపత్రం చూసి నన్ను నేనే అభినందించుకున్నాను. దాన్ని నేను వివరించనవసరం లేదు. హృదయంలోనుంచి సంతోషం పొంగివచ్చింది. 70లో మాతోపాటు నడక ప్రారంభించిన వాళ్ళందరూ కనిపించారు. యింకా అనేక మంది కవులు, రచయితలు ఆహ్వాన సంఘంలో ఉన్నారు. అందరూ యిక్కడికి వచ్చారు. ఈ హాల్లో కూర్చున్నారు. అందరం కలిసి మాట్లాడుకుంటున్నాం. విబేధాలు ఉంటే చర్చించుకుందాం. ప్రభుత్వ దమనకాండను వ్యతిరేకించడానికి మనం ఐక్యం అవుతున్నాం. చరిత్ర గతితర్కం యిదే. ఈ ఐక్యత చాలా అవసరం. ఈ ఐక్యత వర్ధిల్లాలి. ఈ సభలను విజయవంతం చేసుకుందామని మీ అందరినీ ఆహ్వానిస్తున్నాను. మనమంతా ఈ ఉద్యమంలో కలిసి ఉన్నాం. కలిసి ఉందాం. దానికి మళ్ళీ విరసం సభలే వేదిక కావడం మనల్ని మనం అభినందించుకోవాల్సిన విషయం.

1974లో అనుకుంటాను, ఢిల్లీలో ఆఫ్రో ఏసియన్ రైటర్స్ మహాసభలు జరిగాయి. అప్పుడు శ్రీశ్రీకి విరసం తరపున ఆహ్వానం వచ్చింది. విరసం తరపున జ్వాలాముఖి, నేను శ్రీశ్రీతో కలిసి ఢిల్లీ వెళ్ళాం. ఈ సభలను విరసం బహిష్కరిస్తోందని ప్రకటించాం. హరివంశరాయ్ బచ్చన్‌కు ఆఫ్రో - ఏసియన్ రైటర్స్ సభల్లో అవార్డు ప్రదానం. కొందరు హిందీ రచయితలు కూడా బహిష్కరించారు. మేమూ, హిందీ ప్రజా రచయిత నాగార్జున, మరోహిందీ నాటక రచయిత కలిసి మాట్లాడుకున్నాం. ఈ బహిష్కరణ దీనికంటే - ఈ సభల్లో పాల్గొనడానికి వచ్చిన చాలా మంది రచయితలకు సామాజిక వాస్తవిక స్థితి తెలియదు. సమకాలీన రాజకీయాల పట్ల సరైన వైఖరి లేదు. రాజకీయ స్థితిగతుల పట్ల, రచయితలకు ఉండవలసిన అవగాహన పట్ల విరసంకు మొదటి నుండి అంత స్పష్టమైన వైఖరి ఉన్నది.


కృష్ణాబాయి, కళ్యాణరావు

యింకో విషయం చెప్తాను. అప్పట్లోనే హిమాయత్‌నగర్‌లోని ఉర్దూహాల్‌లో అభ్యుదయ రచయితల సంఘం సభలు జరిగాయి. ఆ సభలకు సర్దార్ జాఫ్రీ వచ్చాడు, ప్రారంభోపన్యాసం యివ్వడానికి. చెరబండరాజు, జ్వాలా మేమంతా కలిసి మాట్లాడుకున్నాం. అరసం ఎట్లా పోతోంది? అరసం ఏం చేస్తోంది? అని. దేనికంటే సర్దార్ జాఫ్రి అప్పటికే ఆలిండియా రేడియోలో కుటుంబ నియంత్రణ గురించి కవిత చదివి వినిపించాడు. అరసంలోని గొప్ప కవులు ఏమైపోయారో చూడండి. మేం ఒక కరపత్రం ఉర్దూలో రాసేశాం. అరసం ఒక పాత కథ, దానికి రిలవెన్స్ లేదు అని చెప్పి ఆ సభలను బహిష్కరించాం. కవులు, రచయితలు సామాజిక వాస్తవికతను తమ రచనల్లో ప్రతిబింబించవలసి ఉన్నది. అది జరగనప్పుడు విరసం ప్రశ్నిస్తూ వచ్చింది.

ఏదైనా ఒక సంస్థ పెట్టాలంటే నలుగురు అనుకుంటే సరిపోదు. రాజకీయాలు స్పష్టంగా ఉండాలి. ఆంధ్రప్రదేశ్‌లో నక్సల్బరీ శ్రీకాకుళపోరాటాలు విరసంకు ప్రత్యక్షంగా అలాంటి అవగాహనను అందించాయి. శ్రీశ్రీ అభినందన సభలో 'రచయితలారా మీరెటువైపు' అనే కరపత్రం రూపంలో అది విరసంకు ప్రేరణ అయింది. కారణం అయింది. ఆ రోజు నుండి ఈ రోజు వరకు విరసం ఆ విప్లవ పోరాటాల పతాకాన్ని ఎత్తిపట్టి కొనసాగుతున్నది. కేవలం విరసమే కాదు, ఆ తర్వాత వచ్చిన అనేక సాహిత్య కళా సంస్థలు, విడిగా వున్న విప్లవ కవులు, కళాకారుల బృందాలు నక్సల్బరీ అందించిన ప్రేరణను స్వీకరించి ప్రజల పక్షాన నిలబడ్డాయి. యిది చరిత్ర.

నా మనసులో ఈ ముప్పై అయిదేళ్ళ చరిత్రను తలుచుకుంటే వందలకొద్దీ జ్ఞాపకాలు కదలాడుతున్నాయి. బహుశా నేను ప్రారంభోపన్యాసం లాగా మాట్లడ్డం లేదేమో. ఏదేమైనా సరే - ప్రజాపోరాటాలు ఉన్నాయి. వాటి ఫలితమే విరసం. యిప్పుడు ఈ సభలు కూడా. ఈ సభలను ప్రారంభించే అవకాశం కలిగించినందుకు నా కామ్రేడ్స్‌కు ధన్యవాదాలు చెప్తూ ముగిస్తున్నాను.

## విరసం రాష్ట్ర ప్రధాన కార్యదర్శి నివేదిక

విప్లవ రచయితల సంఘం ఇరవయ్యవ రాష్ట్ర మహాసభలను విజయవంతం చేసేందుకు వచ్చిన సాహిత్యకారులకు, విప్లవ సాహిత్య, విప్లవోద్యమ అభిమానులకు విప్లవాభివందనాలు తెలియజేస్తున్నాను. ఈ సభల సందర్భంగా ఏర్పడిన ఆహ్వాన సంఘం అధ్యక్ష, ఉపాధ్యక్ష వర్గానికీ, సభ్యులకీ నా ధన్యవాదాలు. ప్రపంచ సాహిత్య చరిత్రలోనే మొట్టమొదటిసారి ప్రభుత్వ నిషేధానికి గురై, మూడు నెలల న్యాయపోరాటం తర్వాత, ప్రజాందోళన తర్వాత నిషేధాన్ని ఎత్తివేయించుకుని - తెలంగాణ సాయుధ పోరాటం తీర్చిదిద్దిన కడగట్టు కులాల ప్రజాకవి యాదగిరి పల్లెలో, మగ్దూం ప్రాంగణంలో, పాణిగ్రాహి హాలులో, చెరబండరాజు వేదిక మీద జరుతున్న ఈ సభలకి వచ్చిన మీ అందరినీ సాదరంగా ఆహ్వానిస్తున్నాను.

ముప్పై ఆరేళ్ళ కిందట నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటాల ప్రత్యక్ష ప్రేరణతో - సాహిత్య సాంస్కృతిక రంగాలలో విప్లవ భావప్రచారం చేయడం, నూతన ప్రజాస్వామిక విప్లవసాధనలో కళాసాహిత్యాలను వర్గపోరాట సాధనాలుగా

తీర్చిదిద్దడం అనే లక్ష్యాలతో విరసం ఏర్పడి 1970 అక్టోబరులో ఖమ్మంలో సుబ్బారావు పాణిగ్రాహి నగర్‌లో మొదటి మహాసభలు శ్రీశ్రీ అధ్యక్షతన జరుపుకున్నది. అప్పటి నుండి విప్లవ ప్రజాపోరాటాల్లోని అనుభవాలనూ, సంక్షోభాలనూ, ఒత్తిళ్ళనీ, పోరాటశక్తిని తాను గూడా అనుభవిస్తూ, ప్రతిఫలిస్తూ, ప్రతిఘటిస్తూ విరసం ఇప్పుడీ మహా సభలకి సిద్ధమయింది.

తెలుగు నేల మీద కొనసాగుతున్న విప్లవ ప్రజాపోరాటాల సజీవశక్తిని తనలోకి స్వీకరించడం ద్వారా విరసం తెలుగు సాహిత్య సాంస్కృతిక రంగాలను గుణాత్మకంగా పురోగమింపజేస్తోంది. తెలుగులో వెల్లివిరిసిన ప్రజాస్వామిక సాహిత్య వ్యక్తీకరణలకు, సాంస్కృతిక విలువలకు విరసం ప్రత్యక్షంగా, పరోక్షంగా ప్రేరణగా నిలిచి, తెలుగు సమాజం చేసిన రాజకీయ సాంస్కృతిక భావజాల ప్రయాణానికి దిశానిర్దేశం చేయగలిగింది, ప్రతి అడుగు మీద తనదైన ముద్రవేయగలిగింది. విప్లవ చైతన్యంతో, వర్గపోరాట ఆశయాలతో ముఖ్యంగా ఈ దేశంలోని ఆదివాసీలు, శ్రామికులు, దళిత బహుజనులు సాగిస్తున్న సాయుధ పోరాటాల పక్షాన, ప్రజాస్వామిక వుద్యమాల పక్షాన తన సాహిత్య సాంస్కృతిక అభివ్యక్తిని దృఢంగా వినిపించినందుకు అనేక నిర్బంధాలనూ, అణచివేతలను అనుభవిస్తూ కొనసాగుతోంది. విరసం పీడిత ప్రజాపోరాటాలకు తన సృజనాత్మక శక్తిని ఎంతగా ధారపోసిందో అంతగా ప్రజావ్యతిరేక ప్రభుత్వాల నుంచి అణచివేతను ఎదుర్కొంది. మధ్యతరగతి సాహిత్యకారులు అనుభవించజాలని అణచివేతని విప్లవ రచయితలు కేవలం విప్లవ సిద్ధాంతం పట్లగల విశ్వాసం వల్ల, ప్రజాపోరాటాల శక్తివల్ల, సంఘటిత నిర్మాణ శక్తివల్ల మాత్రమే అనుభవించి నిలబడగులుగుతున్నారు.


అరుణోదయ

* * *

2003 జనవరి 11,12 తేదీల్లో కావలిలో జరిగిన 19వ రాష్ట్ర మహాసభల నాటికి అప్పటి తెలుగుదేశం ప్రభుత్వ పాశవిక నిర్బంధానికి రాష్ట్రం నెత్తురోడుతోంది. 2002 అక్టోబర్ 1న తిరుపతిలో ముఖ్యమంత్రి చంద్రబాబునాయుడు మీద విప్లవకారులు హత్యాప్రయత్నం చేసినప్పటినుంచీ ప్రభుత్వం, పోలీసు యంత్రాంగం కక్షకట్టి రాష్ట్రవ్యాప్తంగా ప్రజా సంఘాల మీదా, ప్రజాపోరాటాల మీదా, విప్లవోద్యమం మీదా దారుణమైన అణచివేత ఆరంభించింది. అక్రమ అరెస్టులు, వేధింపులు, చిత్రహింసలు, ఎన్‌కౌంటర్ హత్యలు కలిసి ప్రజల మీద సాగించిన ముప్పేట దాడితో మొత్తం ప్రజాస్వామిక వాతావరణం తుడిచి పెట్టుకుపోయింది. ఈ నేపథ్యంలో విరసం 19వ రాష్ట్ర మహాసభలు పోలీసు యంత్రాంగం సృష్టించిన భయానక వాతావరణం మధ్య గాలి పారాడని అణచివేత నీడలు చుట్టుముట్టినా సమష్టిగా ఎదుర్కోగలమనే స్ఫూర్తితో ముగిశాయి. అప్పటికే ముందస్తుగా అసెంబ్లీ రద్దు, ఎన్నికల హడావుడి రాష్ట్రంలో పార్లమెంటరీ రాజకీయాలను వేడెక్కించాయి. పాదయాత్రలతో, జనరంజక వాగ్దానాలతో కాంగ్రెస్‌పార్టీ ఎన్నికలబరిలోకి దూకింది. తమకి అధికారం దక్కితే నక్సలైట్లతో శాంతి చర్చలు జరిపి రాష్ట్రంలో ప్రజాస్వామిక వాతావరణాన్ని నెలకొల్పుతామనీ, ప్రత్యేక తెలంగాణ రాష్ట్రాన్ని ఏర్పాటు చేస్తామనీ, ప్రపంచ బాంక్ ఒప్పందాలకి తలొగ్గకుండా గ్రామీణ రైతాంగ ప్రయోజన లక్ష్యంగా పాలన చేస్తామని కాంగ్రెస్ ఎన్నికల ప్రణాళిక ప్రకటించింది.

కాంగ్రెసు పార్టీకి, దేశంలో మరే ఇతర పార్టీకి లేనంత దుర్మార్గమైన ప్రజావ్యతిరేక, అణచివేత చరిత్ర ఉన్నప్పటికీ పార్లమెంటరీ ఎన్నికల చట్రంలో ప్రత్యామ్నాయం లేనందువల్లా, గత తొమ్మిదేళ్ళ తెలుగుదేశ పరిపాలనతో బలపడిన తీవ్రమైన ప్రభుత్వ వ్యతిరేకతవల్లా కాంగ్రెసు పార్టీ గెలవగలిగింది. రాజశేఖరరెడ్డి ఎన్నికల ముందూ, తర్వాత కూడా 'ఇందిరమ్మ రాజ్యం' తెస్తానని పదేపదే చెప్తూ ఊదరగొడుతున్నప్పుడు - 'ఇందిరమ్మ రాజ్యమంటే ఇందిరా నియంతృత్వం తెస్తావా? ఎమర్జన్సీని మళ్ళా తెస్తావా?, అని విరసం సూటిగా ప్రశ్నించింది. ఎన్నికల ముందూ, ఎన్నికల ఫలితాల తర్వాత కూడా విరసం హైదరాబాదులోనూ, జిల్లాలలోను కూడా సభలు నిర్వహించి ఫలితాలని విశ్లేషించింది. కాంగ్రెస్ గెలుపు ఆ పార్టీ మీద విశ్వాసంతో కాదు, చంద్రబాబు పాలన పట్ల తీవ్ర నిరసనవల్లనే సాధ్యమయిందనీ, ఎన్నికల ఫలితాల్లోని గణాంకాల వెనక దాగి వుండే ప్రజా ఆకాంక్షలని, అవసరాలని ఎత్తిపడుతూ, ఎన్నికల గెలుపు ఓటముల్లోని సంక్లిష్ట చిత్రాన్ని చర్చకి పెట్టింది.


ప్రజాకళా మండలి

కాంగ్రెస్ ప్రభుత్వం అధికారంలోకి రాగానే ఉద్యమ ప్రాంతాల్లో నుంచి గ్రేహౌండ్స్ బలగాలను వెనక్కి పిలిపించడం, ఎన్‌కౌంటర్లు జరగవని హామీ యిచ్చి ఒకమేరకి పాటించడం - అంతకి మించి రాజశేఖర్‌రెడ్డి ప్రమాణ స్వీకారం చేసిన మరుక్షణమే ఉచిత విద్యుత్ ఫైలు మీద సంతకం పెట్టడం లాంటి వాటితో గ్రామీణ ప్రాంతాల్లో అంతకుముందటి యుద్ధవాతావరణం స్థానే సాపేక్షికంగా ప్రశాంతత చోటు చేసుకున్నది. ఆ తర్వాత వెనువెంటనే విప్లవ పార్టీలతో చర్చలకి సన్నాహాలు కూడా ప్రారంభమయ్యాయి. రాష్ట్రంలో ప్రజాస్వామ్య వాతావరణం కోసం ఎప్పటి నుండో కృషి చేస్తున్న మేధావుల చొరవ, చర్చల పట్ల విప్లవపార్టీల సంసిద్ధత అన్నీ కలిసి చర్చలు జరుగుతాయనే నమ్మకం కలిగింది. రచయితల మీదా, కళాకారుల మీదా, ప్రజా సంఘాల వారి మీద గత ప్రభుత్వం పెట్టిన అక్రమ కేసులు ఎత్తివేయాలనీ, ఎన్‌కౌంటర్ హత్యల గురించి విచారణ జరిపించాలని డిమాండ్ చేస్తూ విరసం రాష్ట్ర నాయకత్వం సోదర రచయితలతో కలిసి ప్రభుత్వం దగ్గర ఒక ప్రాతినిధ్యం నెరపింది.

చర్చల విధివిధాన దశలో ఒక విప్లవపార్టీ తమ దూతలుగా విరసం రాష్ట్ర అధ్యక్షుడు కా.కళ్యాణరావునూ, వ్యవస్థాపకకార్యవర్గ సభ్యుడు కా.వరవరరావును ఎంపిక చేసుకున్నది. విప్లవ సాహిత్య రంగంలో వీరు నిర్వహించినపాత్రని గుర్తించి తాము ఈ నిర్ణయం తీసుకున్నట్టుగా కూడా ఆ పార్టీ ప్రకటించింది. సాహిత్య సాంస్కృతిక రంగాలలో ప్రజానుకూల పాత్ర పోషించిన కవులు, రచయితలు, కళాకారులు యిలాంటి రాజకీయ దౌత్యం నెరపిన అనుభవాలు తెలుగు సాహిత్య

చరిత్రలో, ప్రపంచ చరిత్రలో అనేకం వున్నాయి. ఈ అవగాహనతోనే వారిద్దరూ ఈ బాధ్యతను అంగీకరించారు.

చర్చల సానుకూల వాతావరణం కోసం కాల్పుల విరమణ ఒప్పందం జరిగి, సుదీర్ఘకాలం నిషేధంలో ఉన్న విప్లవపార్టీ, అనుబంధ ప్రజాసంఘాలమీద నిషేదం ఎత్తివేశాక జులై 28న వరంగల్ జిల్లా మొగిలిచర్లలో జరిగిన అమరవీరుల సంస్మరణ సభలో ప్రసంగించినందుకు కా.కళ్యాణరావు, కా.వరవరరావు, కా.గద్దర్‌ల మీద రాజద్రోహ నేరం కింద కేసులు పెట్టారు. ఈ చర్య మీద తీవ్ర నిరసన రావడంతో కొద్దిరోజుల్లోనే ప్రభుత్వం కేసులు ఉపసంహరించుకుంది. తొలిదశ చర్చలు పూర్తయ్యాక ముసురు కొచ్చిన నిర్బంధంలో మళ్ళీ ఎన్‌కౌంటర్ హత్యలు మొదలయ్యాయి. 2005, జనవరి 7వ తేది ప్రకాశం జిల్లాలో చైతన్య మహిళా సమాఖ్య నాయకురాలు లక్ష్మిని ముక్కలు ముక్కలుగా నరికి కాల్చి చంపడం, జనవరి 16వ తేది ప్రజా సంఘాలకి, టిఆర్ఎస్‌కు చెందిన ముగ్గురిని ఎన్‌కౌంటర్ పేర వరంగల్‌లో కాల్చివేయడంతో కొద్ది నెలల పాటు శాంతి చర్చల పేరుతో కాలక్షేపం చేసిన కాంగ్రెస్ ప్రభుత్వం మనసులో ఏముందో తేటతెల్లమైపోయింది. అయిదు దశాబ్దాలకు పైబడ్డ కాంగ్రెసుపార్టీ అణచివేత చరిత్ర మరోమారు తాజాగా పునరావృతం కావడం మినహా యిందులో పెద్దగా ఆశ్చర్యపోవలసిన విషయమేమీ కనిపించలేదు.

అధికార మార్పిడి జరిగినప్పటి నుంచీ నెహ్రూ తరహా సోషలిస్టు వ్యవస్థ పేరుతో, మిశ్రమ ఆర్థిక వ్యవస్థ పేరుతో సామ్రాజ్యవాదుల, ఆధిపత్య వర్గాలతో కలిసి నిరాటంకమైన ఆర్థిక దోపిడికి అనుగుణమైన ఆర్థిక విధానాలను తయారుచేసి అమలు చేస్తూ వచ్చాయి కాంగ్రెసు ప్రభుత్వాలు. 1991లో నూతన ఆర్థిక విధానాలకు తలుపులు బార్లా తెరిచాయి. ఆ తర్వాత రాష్ట్రంలో అధికారంలోకి వచ్చిన చంద్రబాబు ప్రపంచ బ్యాంక్ ఏజంటుగా పాలన చేయడానికి సుదీర్ఘ నేపథ్యాన్ని సమకూర్చి పెట్టింది కాంగ్రెస్. చంద్రబాబు విధానాలను తీవ్రంగా ప్రశ్నించినట్టు కనబడ్డ కాంగ్రెస్ పార్టీ రాష్ట్రంలో కేంద్రంలో కూడా అధికారంలోకి రావడంతోనే తిరిగి అంతకు పూర్వపు ప్రజావ్యతిరేక విధానాలను యింకా బలంగా అమలు చేసేందుకు సకల ప్రయత్నాలు చేపట్టింది. ఉచిత విద్యుత్తుతో సహా అన్ని రంగాల్లో స్వీయ వాగ్దానాలను ప్రక్కన పెట్టి ప్రపంచ బ్యాంక్ అనుకూల, ప్రజావ్యతిరేక విధానాలను అమలు చేయడం ప్రారంభించింది. వ్యవసాయ రంగానికి అగ్రస్థానం యివ్వడం పేరుతో అనేక ప్రాజెక్టులను జలయజ్ఞంగా ప్రారంభించి ప్రాంతీయ అసమానతలను పెంచి పోషించటమేకాక, ప్రాంతాల మధ్య అసహనాలను, ద్వేషాలను రెచ్చగొడుతూ, నీటి కేటాయింపుల లెక్కలు తేల్చకుండానే నిర్మాణాలు చేపట్టి వేల కోట్ల రూపాయలు ఆశ్రితవర్గాల, కంట్రాక్టర్ల జేబుల్లోకి చేరేలా పథకాలు జోరుగా నడుస్తున్నాయి. అభివృద్ధి పేరుతో సాగే వంచనకు, విధ్వంసానికి పోలవరం సజీవ సాక్ష్యం కాగా, అభివృద్ధి అణచివేత అనే ద్విముఖ వ్యూహంతో ప్రభుత్వం తన ప్రజావ్యతిరేక స్వభావాన్ని బట్టబయలు చేసుకుంటున్నది. ఈ క్రమంలో రాజ్యం అంటే అణచివేత సాధనం అనేమాట పదే పదే నిరూపితం అవుతూ వస్తున్నది.


భూపాల్

గత సంవత్సరం ఏప్రిల్‌లో ఒంగోల్లో జిల్లా ఎస్పీ మీద మావోయిస్టులు దాడి చేయడంతో జిల్లా వ్యాప్తంగా అణచివేత తీవ్రస్థాయికి చేరింది. విరసం జిల్లా కన్వీనరు పిన్నిక శ్రీనివాస్ అరెస్టుతో ప్రారంభించి జిల్లాలో అనేక ప్రజాసంఘాల నాయకులను, కార్యకర్తలను, ప్రజలను అరెస్టు చేసి, రోజుల తరబడి అక్రమంగా నిర్బంధించి, చిత్రహింసలు పెట్టారు. విరసం రచయితలు రివేరా, సజ్జావెంకటేశ్వర్లు తదితరులను అరెస్టు చేశారు. ఈ నిర్బంధానికి వ్యతిరేకంగా విరసం తన బాధ్యత నిర్వర్తించింది. శ్రీనివాస్ మూడునెలలకు పైగా అనేక కేసుల్లో జెయిల్లో ఉండాల్సివచ్చింది. అదే సమయంలో విరసం నాయకులు వి.చెంచయ్య, ఎన్.వేణుగోపాల్, పాణి, రవికుమార్‌లను మేనెల 30వ తేదీన మహారాష్ట్రలోని ఔరంగాబాద్‌లో ఇద్దరు విప్లవపార్టీ నాయకులతోపాటు అరెస్టు చేసి మూడు రోజులపాటు అక్రమ నిర్బంధంలో వుంచుకుని, నిజామాబాద్‌లో అరెస్టు చేసినట్టు చూపించి ప్రభుత్వానికి వ్యతిరేకంగా కుట్రపన్నారని అక్రమకేసు పెట్టారు. వాస్తవానికి చర్చల తర్వాతి కాలంలో రాష్ట్రంలోని రాజకీయ స్థితిగతుల గురించి ప్రజాభిప్రాయాలూ, మేధావుల స్పందనలూ మావోయిస్టు పార్టీ ప్రతినిధి ఈ నలుగురి ద్వారా తెల్సుకోదలిచి నేరుగా వారిని కలుసుకున్నాడు. బాధ్యతాయుతమైన పౌరులుగా, రచయితలుగా ఒక విప్లవ పార్టీ నాయకునితో కలిసి రాజకీయ సామాజిక స్థితిగతుల గురించి చర్చించడం ఎంతమాత్రం నేరం కాదు. కాని ప్రభుత్వం విరసం మీద కక్ష సాధింపు చర్యల్లో భాగమే మూడురోజుల అక్రమ నిర్బంధమూ, పదహారురోజుల జైలు జీవితమూను.

ఈ అరెస్టులకి వ్యతిరేకంగా సాహిత్య సాంస్కృతిక రంగాల నుంచి ప్రతిస్పందన వచ్చింది. దానివల్ల కూడా విరసం సాహిత్య సాంస్కృతిక రంగాల మీద ప్రభుత్వ దాడికి వ్యతిరేకంగా కొన్ని కార్యక్రమాలు నిర్వహించగలిగింది.

2005 ఆగష్టు 15వ తేదీ మహబూబ్‌నగర్ జిల్లా ఎమ్మెల్యే నర్సిరెడ్డితోపాటు మరో తొమ్మిది మందిని మావోయిస్టులు కాల్చి చంపిన నేపథ్యంలో దాన్ని సాకు చేసుకుని ఆగష్ట్ 17వ తేదీన మావోయిస్టు పార్టీని, దాని ఆరు అనుబంధ సంఘాల జాబితాలో విరసంను కూడా చేర్చి నిషేధిస్తూ రాష్ట్ర ప్రభుత్వం ఉత్తర్వులు జారీ చేసింది. 19వ తేదీ వేకువన విరసం కార్యవర్గ సభ్యుడు వరవరరావునీ, ఆ సాయంకాలం అధ్యక్షుడు కళ్యాణరావుని అరెస్టు చేశారు. చర్చల వైఫల్యం తర్వాత మావోయిస్టు పార్టీ చేసిన పలుచర్యల్లో వీరిద్దరినీ, వీరితోపాటు గద్దర్‌నీ బాధ్యుల్ని చేస్తూ పెట్టిన ఆరు అక్రమకేసులను కూడా తవ్వి తీసి (నిషేధం కేసుతోపాటు) సుమారు ఏడున్నర నెలలపాటు అక్రమంగా నిర్బంధించారు. నిషేధం విధించిన పదిరోజుల్లోనే ఆగస్టు 27న మహబూబ్‌నగర్‌కి చెందిన తెలంగాణ ఉద్యమకారుడు, ఉపాధ్యాయ ఉద్యమనేత కనకాచారిని నర్సాకోబ్రాస్ పేరుతో హత్య చేశారు. ఆ తర్వాత వరసగా ప్రకాశం జిల్లాలో కులనిర్మూలనా పోరాట సమితి నాయకుడు మన్నెం ప్రసాదుని నల్లమల నల్లత్రాచుల పేరుతోనూ, కరీంనగర్ జిల్లాలో కళింగరావు అనే

వ్యాపారిని మహబూబ్‌నగర్ జిల్లా ఆత్మకూరులో మునెప్ప అనే ఉపాధ్యాయుని నక్సల్స్ బాధితుల పేరుతోను నర్సా కోబ్రాస్ పేరుతోనూ హత్యలు చేశారు. కనకాచారి, మన్నెం ప్రసాదుల అంత్య క్రియలకి వెళ్ళిన అనేక మంది ప్రజాసంఘాల వారితో పాటు విరసం సభ్యులను కూడా చంపుతామని కోబ్రాలు పదే పదే ప్రకటనలు చేసి, నిత్యం ఫోన్లు చేసి బెదిరించారు. విరసం మీద నిషేధానికీ, ఆ నలుగురి హత్యలకీ, కోబ్రాల బెదిరింపులకి వ్యతిరేకంగా ఆ కాలంలో జరిగిన అనేక ఆందోళనల్లో, నిషేధం చీకట్లో కూడా విరసం పాల్గొన్నది. విరసం గొంతు నొక్కి వేయాలని ప్రభుత్వం వేసిన పథకాన్ని వమ్ము చేస్తూ నిషేధం గురించీ, కోబ్రాల హత్యల గురించీ ప్రజలతో సంభాషిస్తూనే వచ్చింది. నిషేధకాలంలో నిషేధం గురించిన మాటలు ప్రచారం చేయగలమని విరసం నిరూపించింది. కోబ్రాల హత్యాకాండల మీదా, బెదిరింపుల మీదా విరసం వ్యవస్థాపక సభ్యుడు చలసాని ప్రసాద్ లోకాయుక్త ముందు ఒక పిటిషన్ వేశారు. కోబ్రాల ప్రేరితులుగా, కోబ్రాల హత్యాకాండకి బాధ్యతపడాల్సిన వారిగా హోంమంత్రిని, డిజిపిని, అదనపు డిజిపిని విచారించాలని అందులో పేర్కొన్నారు. ఇంకా లోకాయుక్తలో విచారణ కొనసాగుతూనే వుంది.

నిషేధకాలంలో విరసం సభ్యుడు, చిత్రకారుడు, కథకుడు పల్లా మోహన్‌ని అనంతపురంలో అరెస్టు చేసి పదిహేను రోజులు అక్రమంగా నిర్బంధించి, నానారకాలుగా చిత్రహింసలు పెట్టి నిషేధం కేసు బనాయించారు. నిషేధం ఎత్తివేశాక ప్రకాశం జిల్లా కన్వీనర్, కవి, పిన్నిక శ్రీనివాస్‌ని మరోసారి అరెస్టు చేశారు. ఆరు అక్రమకేసుల్లో ఒంగోలు, నెల్లూరు జెయిళ్ళలో నిర్బంధ జీవితాన్ని గడిపి ఇటీవలే బెయిల్ మీద విడుదలయ్యాడు. ఫిబ్రవరి 14న విరసం రాష్ట్ర సహాయకార్యదర్శి కవి, సాహిత్య విమర్శకుడు, అనువాదకుడు నాగరాజుని ఏ ఆరోపణ, కేసు లేకపోయినా మూడురోజులపాటు గంటలకొద్దీ అక్రమంగా నిర్బంధించి చిత్రహింసలు పెట్టారు. ఆ తర్వాత 2006 ఫిబ్రవరి 23న విరసం సభ్యుడు, కవి ప్రశాంత్‌ని విశాఖ బస్‌స్టాండ్‌లో అరెస్టు చేసి రెండురోజుల అక్రమ నిర్బంధం తర్వాత ఆంధ్రప్రదేశ్ ప్రజాభద్రతా చట్టం కింద కేసుపెట్టారు. ఆ తర్వాత మహబూబ్‌నగర్ జిల్లా పోలీసులు మరో అక్రమకేసు బనాయించారు. విశాఖ జెయిల్లో నిర్బంధ జీవితం గడపవలసివచ్చింది. విరసం మీద రెండు నెలలకు పైగా నిషేధం విధించిన తర్వాత ప్రత్యక్షంగా పరోక్షంగా కూడా విరసం సభ్యులు పోలీసుల డేగచూపుకి గురికావాల్సి వచ్చింది.



అమర వీరుల బంధుమిత్రుల సంఘం కళాకారులు

విప్లవ రచయితల సంఘం ఒక స్పష్టమైన తాత్విక దృక్పథం కలిగిన సాహిత్య సాంస్కృతిక సంస్థగా సామాజిక సంబంధాల్లో సకల రూపాల్లో కొనసాగుతున్న ఆధిపత్యాన్ని, హింసని వ్యతిరేకిస్తోంది. వ్యవస్థాగతమైన ఈ హింసా రూపాలను నిలిపివుంచే రాజ్య స్వభావాన్నీ, రాజ్యహింసనీ ప్రశ్నిస్తోంది. తన సాహిత్య కళారూపాల్లో వీటిని చిత్రిస్తోంది. తన సామాజిక తాత్విక విశ్లేషణల్ని ప్రకటిస్తోంది. ఇదే రాజ్యానికి విరసం మీద కన్నెర్ర అయింది. ఇది మొదటి నుండీ ఉన్నదే అయినా రాజ్యం, సామ్రాజ్య వాదం సృష్టిస్తున్న సామాజిక సంక్షోభం ఇంకా తీవ్రతరం కావడం వల్ల, దానికి వ్యతిరేకంగా సామాజిక రాజకీయ ఉద్యమాలు శక్తివంతం కావడం వల్ల రాజ్యం మరింత బరితెగించి అణచివేతని కొనసాగిస్తోంది. అది పరాకాష్టకి చేరి ఈ సంక్షోభాలనీ, అణచివేతలని సాహిత్య కళా సంబంధంగా ప్రశ్నిస్తున్న విరసంని కూడా నిషేధించేందుకు సిద్ధపడింది. మానవ సంబంధాల్లో ప్రేమనీ, విశ్వాసాన్నీ, సహకారాన్నీ, విలువల్ని విరసం కోరుకుంటుంది. కాబట్టి, మానవ సంబంధాల్లో హింసని ప్రేరేపించే రాజ్యానికి అసహనం పెరగడం సహజమే. కాకపోతే తను హింసమీద ఆధారపడి మనుగడ సాధిస్తూ, విరసం మీద హింసకి సంబంధించిన ఆరోపణలు చేయడం, తాను ఏ చట్టాన్నీ, రాజ్యాంగ విలువల్నీ పాటించకుండా విరసం మీద చట్టవ్యతిరేక ముద్ర వేయడం వర్తమాన స్థితికి అద్దం పడుతుంది.

అయితే ఈ స్థితిని సాహిత్యకారులు, ప్రజాస్వామ్యవాదులు అంగీకరించరు కనుకనే, విరసం భావజాలంతో తమ అంగీకార అనంగీకారాలతో నిమిత్తం లేకుండా స్పందించగలిగారు. ఈ సహకారం వల్ల కూడా ప్రభుత్వ ఆరోపణలని విరసం ఎదుర్కొన్నది. నిషేధ చట్టం ప్రకారమే ప్రభుత్వం ఏర్పాటు చేసిన టిఎల్ఎన్ రెడ్డి త్రిసభ్య కమిటీ ముందు సుదీర్ఘమైన తన వాదన వినిపించింది. ఫలితంగా నిషేధం తొలగింది.

ముప్పై ఆరేళ్ళుగా విరసం మీద ప్రభుత్వం చేస్తున్న తప్పుడు ఆరోపణలు ఏనాడూ నిరూపణ కానట్టే, ఈ నిషేధానికి సాకుగా చూపిన ఆరోపణలు, సాక్ష్యాధారాలు కూడా ఏవీ నిలబడలేదు. ఇది ప్రజా విజయం, ప్రజారచయితల విజయమని విరసం భావిస్తోంది. ఒక తాత్విక దృక్పథాన్ని మార్గదర్శకంగా స్వీకరించడం, విప్లవ పోరాటం పట్ల సంఘీభావం ప్రకటించడం ఎంత మాత్రం నేరం కాదని మరోసారి ఈ నిషేధం ఎత్తివేత నిరూపించింది.

* * *

కావలి 19వ రాష్ట్ర మహాసభల్లో అనేక ప్రక్రియల్లో ఇరవై పుస్తకాలని, మరో ఏడాది (2005 జనవరి)లో విశాఖ సాహిత్య పాఠశాలలో కూడా 16 పుస్తకాలు ఆవిష్కరించుకుంది. ఈ 2 సంవత్సరాల 5 నెలల్లో విరసం సభ్యులు కథ, కవిత్వం, నవల, పాట, సాహిత్యవిమర్శ, సామాజిక రాజకీయ తాత్విక విశ్లేషణల్లో కృషి చేశారు. నిత్య నిర్బంధాలు, రాజకీయ వాతావరణంలోని ఒత్తిడులు, కోబ్రాల బెదిరింపులు, నిషేధం మధ్య కూడా విరసం సాహిత్య సృజన బలహీన పడకపోగా మరింత శక్తివంతమైన రూపాల్లో, ప్రయోగ స్వభావంతో కూడా సాహిత్య సృష్టి చేస్తోంది. అరుణతారలో వస్తున్న విరసం సభ్యుల రచనలు దానికి ఒక దాఖలా కాగా ఈ సభల్లో ఆవిష్కరింపబడుతున్న కొత్త పుస్తకాలు మరో దాఖలా. ఇవేకాక ఇతర పత్రికల్లో అచ్చవుతున్న రచనలు, ఇతర ప్రచురణలు ఉండనే ఉన్నాయి.

సామాజిక చారిత్రక శక్తుల సంఘర్షణలు నుండి పుట్టిన విరసం ఆ సంఘర్షణ పురోగమించే క్రమంలో; సకల ఆధిపత్యాలకు, పీడనలకు వ్యతిరేకంగా మహత్తర ప్రజాసాయుధపోరాటంగా, ప్రజాస్వామిక ఉద్యమాలుగా విస్తృతి సాధించే

క్రమంలో విరసం కూడా అందులో విడదీయలేని సాహిత్యసాంస్కృతిక శక్తిగా కలిసినడుస్తున్నందువల్ల సహజంగానే విరసం అభివ్యక్తిలో విస్తృతి, గాఢత చోటుచేసుకుంటున్నాయి. మానవ జీవితంలోని వైరుధ్యాల తీవ్రత, వాటి స్వభావం, పరిష్కారమార్గాలు ఎన్నెన్ని స్థాయిల్లో ఉండేది విప్లవ రచయితలకు అర్థమవుతున్న కొద్దీ సాహిత్య ప్రక్రియలు శక్తివంతమవుతున్నాయి. గత రెండున్నర సంవత్సరాల కాలంలో విరసం సభ్యులు స్వేచ్ఛలో - నిర్బంధంలో; ప్రజల మధ్య - జెయిలు గోడల మధ్య రాసిన రచనలు ఒక్కచోటికి చేర్చి వస్తు శిల్ప, దృక్పథ చర్చ చేయగలిగితే గత మహాసభలకు ఈ సభలకు మధ్యకాలంలో విరసం సభ్యుల సాహిత్యకృషి స్పష్టమవుతుంది. ఈ విషయంలో విరసం సవినయంగానే సగర్వంగా తన కృషిని ప్రకటించుకుంటూ యింకా చేయవలసింది చాలా ఉన్నదని అంగీకరిస్తోంది. విరసం విప్లవ సాధన కోసం సాహిత్య సాంస్కృతికోద్యమాన్ని నడపదలుచుకున్నది కాబట్టి సహజంగానే అనేక సందర్భాల్లో రాజకీయ సామాజికపాత్రను కూడా నిర్వర్తించవలసి వస్తున్నది. నిర్దిష్టంగా సాహిత్య సాంస్కృతిక కర్తవ్యాలను, కార్యక్రమాలను నిర్దేశించుకున్న సందర్భంలో కూడ రాజ్యహింస, ప్రభుత్వ విధానాలు, సామాజిక కల్లోలాలు విరసం సాహిత్య ఎజెండాను ప్రభావితం చేస్తున్నమాట నిజమే. శుద్ధ సాహిత్యకారుల కూటమి అయి ఉంటే ఏమోగాని, విరసం విప్లవ ప్రజాపోరాటాల సాంస్కృతిక స్వరం కాబట్టి యిలాంటి అనివార్యతలు తప్పకపోవచ్చు. రాజకీయ సామాజిక పాత్రను నేరుగా పోషించవలసిన అవసరం వచ్చినా, దాన్ని సాహిత్యీకరించేందుకు దీక్షతో కృషిచేయవలసి ఉంటుంది. విరసంకు ఈ అవగాహన స్పష్టంగానే ఉన్నప్పటికీ దాన్ని మెరుగ్గా పూర్తిస్థాయిలో సాధించడానికి నిరంతరం ప్రయత్నించవలసి ఉన్నది.

ఈ రెండున్నర సంవత్సరాలలో విరసం రాష్ట్రస్థాయిలో చేసిన సాహిత్యకార్యక్రమాల గురించి అయినా యిక్కడ ప్రస్తావించుకోవలసి ఉన్నది. నవల, విమర్శ ప్రక్రియలపై వర్క్‌షాప్‌లు, సదస్సుల రూపంలో ఎక్కువ కేంద్రీకరించింది. రెండురోజులపాటు నవలపై వర్క్‌షాప్ నిర్వహించి, తెలుగు నవలల్లో భిన్న దృక్పథాల్లో వేర్వేరు ప్రయోగాలు చేసిన సుప్రసిద్ధ రచయితలను ఆహ్వానించింది. విప్లవ నవలను శక్తివంతం చేయడానికి ప్రత్యేకంగా నవలా శిల్పం గురించి, తమతమ నవలల్లో తాము చేసిన ప్రయోగాల గురించి, తమ అనుభవాల గురించి విరసం కలబోసుకున్నది. జీవన దృక్పథం విషయంలో విరసం కొత్త సభ్యులకూ ఏ సందేహాలు లేకపోయినా జీవితాన్ని నవలగా మార్చే అనుభవాలు సోదర రచయితల నుండి నేర్చుకోవడానికి దోహదపడేలా ఈ కార్యక్రమం జరిగింది. దీనికి వక్తలుగా, శ్రోతలుగా కూడ సోదర రచయితలు రావడం వల్ల ఈ కార్యక్రమం ఫలవంతమైంది. దీని ఫలితాలు విప్లవ నవలా రచనలో తప్పక కనిపిస్తాయనే నమ్మకం ఉన్నది.



అబ్బూరి ఛాయాదేవి

యిలాంటిదే - విమర్శపై జరిగిన సదస్సు. తెలుగు విమర్శలో విరసం గణనీయమైన కృషి చేసినా, వస్తున్నా విభిన్న సాహిత్య సిద్ధాంతాల వెలుగులో విమర్శగావిస్తున్న ప్రముఖులు తెలుగులో ఉన్నారు. ఈ అందరి విమర్శ పద్ధతులను ఒకచోటికి తెచ్చి వాటి బలాన్ని, పరిమితులను చర్చకు తెచ్చి ఏ పరిశీలనా పద్ధతి నుండి ఏ సుగుణాన్ని స్వీకరించడం వల్ల తెలుగు సాహిత్య విమర్శ బలోపేతం అవుతుంది? అని తర్కించుకోవడం దీని లక్ష్యం. మార్క్సిస్టు విమర్శ సంవిధానంలోకి తీసుకోదగిన యితర పరిశీలనా పద్ధతులు, దృష్టికోణాలు యితర సాహిత్య సిద్ధాంతాల్లో ఏమున్నాయి? అని పరిశీలించడం కూడా దీని ఉద్దేశ్యం. ఈ పని చేయడానికి నిర్దిష్ట వాచకం అవసరం. ఒక నిర్దిష్ట రచనపై భిన్న సాహిత్య దృక్పథాలున్న వారు ఒకే వేదికపై విశ్లేషణ చేయడం వల్ల ఆయా పరిశీలనా పద్ధతుల శక్తిసామర్థ్యాలు, పరిమితులు తెలుసుకోగలిగే అవకాశం ఉంటుంది. అందుకని సుప్రసిద్ధమైన ఏడు నవలలను స్వీకరించి ఒక్కోనవలపై మూడు నాలుగు దృక్పథాల్లో విమర్శ గావించే ప్రణాళిక తయారు చేసి విరసం సదస్సు హైదరాబాదులో నిర్వహించింది. యిది ఒక కొత్త ప్రయోగం. ఈ కృషి యింకా కొనసాగించవలసిందే.

గత సంవత్సరం జూలై4కు విరసంకు ముప్పై అయిదేళ్ళు నిండాయి. ఈ సందర్భంగా రాష్ట్రంలో వీలైనన్ని చోట్ల విప్లవసాహిత్య ప్రక్రియలపై సదస్సులు జరిగాయి. ముప్పై అయిదేళ్ళలో విరసం భిన్న సాహిత్య ప్రక్రియల్లో చేసిన కృషిని అంచనావేస్తూ, విరసం చేసిన కృషిని ఎత్తిపట్టే విధంగా యివి జరగాలనే నిర్ణయం నెల్లూరు, విజయవాడ, వైజాగ్ కేంద్రాల్లో విజయవంతంగా ముగిశాయి. వీటి ముగింపుగా హైదరాబాదులో విరసం ఎలా ఉంది? ఎలా ఉండాలి? అనే పేరుతో ఒకరోజంతా సదస్సు జరిగింది. విరసం ఒక సాహిత్య సాంస్కృతిక సంస్థగా తన సాహిత్యకృషిని, ఆచరణను, నిర్మాణ కార్యక్రమాలను, దృక్పథాన్ని యితర రచయితలతో సంబంధబాంధవ్యాలను, ఐక్యకార్యాచరణను సమీక్షించుకోవడానికి మిత్రుల నుండి బహిరంగంగా అభిప్రాయాలు, విమర్శలు, సూచనలు ఆహ్వానించింది. విరసం వేదికపై విరసం గురించి నిష్కర్షగా తమ వైఖరులు, విమర్శలు, నిర్మాణాత్మక సూచనలు ప్రకటించడానికి వివిధ సాహిత్య కళా సంస్థలు నాయకులు, వివిధ బృందాల, వాదాల రచయితలు ఇరవై మందికి పైగా వచ్చారు. ఈ అభిప్రాయాల్లో - సమాచార లోపం వల్ల ఏర్పడిన అభిప్రాయాలు, కొన్ని అపోహలు మినహాయిస్తే విరసం కృషిని గుర్తించి గౌరవిస్తూనే యింకా ముందుకుపోవడానికి నిర్దిష్టమైన సూచనలు వచ్చాయి. ప్రధానంగా బైటి రచయితలతో సంబంధబాంధవ్యాల విషయంలో విరసం పాటిస్తున్న పద్ధతులను యింకా మెరుగుపరుచుకోవాలనే సూచన వచ్చింది. యిది అవగాహన పరమైన దోషం కాదని, స్వీయశక్తుల పరిమితి మాత్రమేనని, ఏదేమైనా సాంస్కృతిక రంగంలో భూస్వామ్య - సామ్రాజ్యవాద వ్యతిరేక ఐక్య సంఘటన కోసం కలిసిపనిచేయవలసిన అవసరాన్ని విరసం ప్రగాఢంగా గుర్తించి, ఎప్పటి నుండో ఆదిశగా కృషిచేస్తున్నది కాబట్టి - ఈ సూచనను స్వీకరిస్తున్నామని విరసం ప్రకటించింది. విప్లవరాజకీయాలకుదృఢంగా కట్టుబడి ఉంటూ, సాహిత్యరంగంలో మరింత నిర్మాణాత్మకంగా కృషి చేయాలనే ఆశయాన్ని ఈ సదస్సు ద్వారా విరసం

ప్రకటించింది.

ఇదయ్యాక రెండువారాలకల్లా ప్రభుత్వం విరసంను నిషేదించింది. నిషేధం విధించేదాకా విరసం రాష్ట్రస్థాయి కార్యక్రమాలతోపాటు జిల్లా యూనిట్లు అనేక సాహిత్య సాంస్కృతిక కార్యక్రమాలు నిర్వహించాయి. యూనిట్ స్థాయిలో విరసం కార్యక్రమాలు ప్రధానంగా సాహిత్య సభలు, సమావేశాలు నిర్వహించడమే. నిషేధంవల్ల సోదర రచయితలు, సాహిత్య సంఘాలు నిర్వహించిన విరసం సంఘీభావ కార్యక్రమాల్లో నిషేధంకు గురైనా కూడా విరసం సభ్యులు పాల్గొని సంస్థ సాహిత్య దృక్పథాన్ని వివరించారు.

నిషేధం ఎత్తివేయగానే విరసం యిది 'ప్రజావిజయం, ప్రజారచయితల విజయం' అని స్పష్టం చేస్తూ ప్రెస్‌మీట్ జరిపింది. నిషేధాన్ని నిరసించిన కవులకు, రచయితలకు కళాకారులకు అభినందనపూర్వక ధన్యవాదాలను తెలుపుతూ ఉత్తరాలు పెద్దఎత్తున రాసింది. ఆ తర్వాత వారానికే ప్రముఖ కవి కె.శివారెడ్డి అధ్యక్షతన హైదరాబాదులో విజయోత్సవ సభ జరిగింది. అనేక మంది సోదర రచయితలు అందులో ప్రసంగించారు. మరో నెలరోజుల్లో పెద్ద ఎత్తున ఒకరోజంతా సదస్సు జరిగింది. విరసంపై నిషేధాన్ని ఖండించిన రచయితలంతా ఈ సభలో ప్రసంగించి, విరసంకు తమ సంఘీభావాన్ని తెలియజేశారు. నిషేధపూర్వాపరాలతో, నిషేధకాలంలోని ధిక్కార స్వరాల కూర్పుతో, ప్రభుత్వానికి విరసంకు జరిగిన వాదప్రతివాద పత్రాలతో డిసెంబర్ అరుణతార ప్రత్యేక సంచికగా విడుదలైంది. సుప్రసిద్ధ రచయిత పతంజలి రాసిన నవల ఆధారంగా ఆయనపై కోర్టు ధిక్కార కేసు పెట్టినప్పుడు విరసం ఆయన పక్షాన నిలబడ్డది. సాహిత్య రంగంలో న్యాయస్థానాల చొరబాటును ఖండించింది. హైదరాబాదులో వైజాగ్‌లో సభలు నిర్వహించింది. పతంజలికి మద్దతుగా కోర్టులో కేసు కూడా నడుపుతున్నది.

అరుణతార గత మహాసభల నుండి యివ్వాల్టిదాకా నిషేధ కాలాన్ని మినహాయిస్తే క్రమం తప్పకుండా వస్తోంది. కొంచెం ఆలస్యం అయినా ప్రతినెలా సంచిక తేవడానికి ప్రయత్నిస్తున్నాం. అరుణతారను విప్లవ సాహిత్య సాంస్కృతిక వేదికగా ఎప్పటికప్పుడు తీర్చిదిద్దే ప్రయత్నం జరుగుతూ ఉన్నా గత నాలుగైదు సంవత్సరాల్లో పత్రిక వస్తు శిల్పాల్లో గణనీయమైన విజయాలు సాధించిందని మా నమ్మకం. విరసం సభ్యుల రచనలతోపాటు, ప్రజానుకూల రచనలన్నింటికీ పత్రిక వేదిక కావాలనే మా ఉద్దేశ్యం. ఆ దిశగా చేసిన కృషికి సాహిత్య పాఠక లోకం నుండి మంచి ప్రతిస్పందన లభించింది. దీన్ని యింకా విస్తృత పరచాలి. ప్రమాణాలు, దృక్పథం విషయంలో రాజీ పడకుండా భూస్వామ్య - సామ్రాజ్యవాద - రాజ్య వ్యతిరేక సాహిత్య సాంస్కృతిక భావజాల పత్రికగా తీర్చి దిద్దే కృషి చేయాలన్నే సంకల్పం ఉన్నది.


ప్రతినిధులు

సంస్థ నిర్మాణం విషయంలో కూడా విరసం చాలా శ్రద్ధ పెట్టవలసి ఉంది. విరసం చరిత్రలో అత్యంత దారుణమైన నిర్బంధాన్ని ఎదుర్కొన్న సందర్భాలు చాలా ఉన్నా, ఈ రెండేళ్ళ కాలంకు ఒక ప్రత్యేకత ఉన్నది. సభ్యులు నిషేధం వల్ల, నిర్బంధంవల్ల ఏ ఒక్కరు కూడ రాజీనామా చేయకపోవడమే గాక, కష్టకాలంలో అందరూ సంస్థ పక్షాన దృఢంగా నిలబడి విరసం గౌరవాన్ని యినుమడింపచేశారు. అయితే చాలా యూనిట్లు పనిచేయలేని స్థితి ఏర్పడింది. ఒక సాహిత్య సంస్థ ప్రజాస్వామికంగా సాహిత్య కార్యక్రమాలు నిర్వహించలేని నిర్బంధ పరిస్థితి రాష్ట్రంలో నెలకొని ఉన్నది. యిది సంస్థను నిర్మాణపరంగా ప్రభావితం చేస్తున్నమాట నిజమే.

నిషేధ కాలంలోని సంఘీభావం, నిషేధం ఎత్తివేత, తిరగి ఈ మహాసభల స్ఫూర్తితో సంస్థను నిర్మాణపరంగా బలోపేతం చేయవలసి ఉన్నది. యిప్పటికే విరసంతో ఏకీభావం ఉన్న రచయితలను సభ్యులుగా ఆహ్వానించవలసి ఉన్నది. విప్లవ సాహిత్య పాఠకులను రచయితలుగా తీర్చిదిద్దుకొని వారిని సభ్యులుగా చేర్చుకోవలసి ఉన్నది. నిషేధం ఎత్తివేత అనేది ఒక విషయాన్ని స్పష్టం చేస్తున్నది. రచయితలకు విప్లవ సిద్ధాంతాల పట్ల విశ్వాసం ఉండటం, దాని వెలుగులో సాహిత్య, సామాజిక కార్యక్రమాలను, సాహిత్య సృజన చేయడం చట్టబద్ధమే గాని ఎంతమాత్రం నేరంకాదనీ. యిది రాజ్యాంగ స్ఫూర్తికి లోబడిన అంశమే అనీ. అంటే విరసం ఎం.ఎల్.ఎం పట్ల నిబద్ధమై ప్రజా పోరాట రూపాలన్నింటినీ సమర్థించడం, గానం చేయడం రాజ్యాంగ స్ఫూర్తికి వ్యతిరేకం ఏమీ కాదు. ఈ అవగాహనను ప్రచారంలో పెట్టి విరసంలోకి కొత్త రచయితలను ఆహ్వానించవలసి ఉన్నది. నిషేధం వల్ల అరెస్టు అయిన కళ్యాణరావు, వరవరరావులతోపాటు, యితర విరసం సభ్యులు కూడా జెయిళ్ళనుండి విడుదలయిన సందర్భంలో జరుగుతున్న సభలివి. రచయిత ప్రజల మనిషి అని విరసంకు ఆవిర్భావం నుండే ఉన్న అవగాహన. ప్రజల మనిషి కాబట్టే రచయిత ఆ ప్రజలు చేసే అన్ని పోరాటాలను, అన్ని పోరాట రూపాలను, సాయుధ పోరాటంతో సహా ఈ దేశ సమూల విముక్తి విప్లవోద్యమాలను రచయిత బలపరచాలని, వాటికోసమే సాహిత్య సృజన చేయాలని, ఉద్యమ భావజాలానికి మద్దతు కూడగట్టాలని విరసం తన ఆవిర్భావంలోనే ప్రకటించుకున్నది. దాన్ని ముప్పై అయిదేళ్ళుగా కొనసాగిస్తూనే ఉన్నది. ఈ సామ్రాజ్యవాద ప్రపంచీకరణ దశలో ప్రజావర్గ రచయితలందరూ ప్రజలమనిషిగా ధిక్కారాన్ని వినిపించాలి. సకల పీడనలకు వ్యతిరేకంగా సాగే ప్రజా ఉద్యమాల పక్షాన దృఢంగా నిలబడి, ఆ అణచివేతలను, వ్యధలను, వాటికి వ్యతిరేకంగా ప్రజలు చేస్తున్న పోరాటాలను రచయిత గానం చేయవలసి ఉన్నది. రచయిత పరిపూర్ణంగా పీడిత ప్రజల మనిషిగా నిలబడి ధిక్కారమే సాహిత్య వ్యక్తీకరణ అని ప్రకటించవలసి ఉన్నది. ఆ స్ఫూర్తిని అందరం అందుకోవడానికి, పునర్జ్వలింపచేసుకోవడానికి యిక్కడ హాజరయ్యాం. ఈ సభలను విజయవంతం చేయడానికి వచ్చిన వారందరికి మరోసారి అభినందనలతో ముగిస్తున్నాను.

భూ స్వామ్య - సామ్రాజ్యవాదాలకు వ్యతిరేకంగా ఉద్యమిద్దాం.
రాజ్యహింసకు వ్యతిరేకంగా పోరాడదాం.

నూతన ప్రజాస్వామిక సంస్కృతి వర్థిల్లాలి.
ప్రజారచయితల ఐక్యత వర్థిల్లాలి.
విరసం వర్థిల్లాలి.
విప్లవం వర్థిల్లాలి.

- టి.కృష్ణాబాయి
ప్రధాన కార్యదర్శి

### 10వ తేది మధ్యాహ్నం 2 గంటలకు
## రచయిత ప్రజల మనిషి

**వరవరరావు ప్రతిపాదన ప్రసంగం :**

మొదట మనిషి రచయిత. ఆ మాటకొస్తే ప్రతిప్రాణి రచయితే. ప్రాణి అంటే పక్షి, పశువు మాత్రమే కాదని మనకు జగదీశ్ చంద్రబోస్ చెప్పాడు కదా.

ఆకాశం ఎంత అందమైన మబ్బుల చిత్రాలు వేస్తుంది. చెట్లు ఎంత శ్రావ్యమైన పక్షుల సంగీతాన్ని వినిపిస్తాయి. నెమలి మేఘానికి ఎంత అద్భుతమైన నాట్యం నేర్పుతుంది. అడవికి గోదావరి ఎంత చక్కటి నడక నేర్పింది. ముఖ్యంగా మా తెలంగాణలో.

సృజన మొదటిసారి 1972లో నిషేధింపబడినపుడు శివసాగర్ అలలపైన నిషా, అలలు కనే కలల పైన నిషా అని గొప్ప ధిక్కార కవిత రాసాడు. అప్పుడాయన నీళ్ళల్లో చేపలా ఏటికి ఎదురీదుతున్నాడు.


వివి

అలలు చేపలు మాట్లాడే భాష అనిచునకు 'ఖడ్గసృష్టి'లో శ్రీశ్రీ అనువదించి అర్థం చేయించలేదా.

ఆ నల్లని రాళ్ళలో ఏ కన్నులు దాగెనో, ఆ బండల మాటున ఏ గుండెలు దాగెనో అని....

ఆ చల్లని సముద్ర గర్భం దాచిన బడబానలమెంతో అని మన కవి చెప్పేనాటికి ప్రకృతిలోని సృష్టికర్త గురించి యిప్పటికీ మనకు శతాంశం కూడా తెలియని విశ్వరహస్యాలను శాస్త్రీయంగాను, కళాత్మకంగాను వివరించే ప్రయత్నం చేసిన వాళ్ళెందరో.

ఎంగెల్స్ చెప్పినట్లు మనిషి ఆచరణ, జ్ఞానం ద్వారా తెలుసుకోవలసింది ఎంతో ఉన్నదని తెలిసింది.

ఇప్పటికి మన వ్యవహారార్థంలో మనిషి ఏదో సృజన రూపంలో వ్యక్తమైనపుడు రచయిత అవుతున్నది/ అవుతున్నాడు.

సూర్యుడు లేకుండా తెల్లవారనట్లు రాస్తున్న వాళ్ళంతా రాయని భాస్కరుల చలువ వల్లనే రాస్తున్నారు. వాళ్ళు రాయవలసింది రాస్తున్నారు, రాయాలి కూడా.
ఈ రాయని భాస్కరులు అశేష ప్రజానీకం.

ప్రజ అంటే మార్క్సిస్ట్ పరిభాషలో ఉత్పత్తిలో పాల్గొనే వాళ్ళు. పనిచేసేవాళ్ళు. మనం "పనిమనిషి" అంటాం. వర్గ సమాజంలో పని మనిషులు మాత్రమే పనిచేసి, పని చేయించుకునే మనషులు, పని చేయించుకుని తినే మనుషులు వేరుగా ఏర్పడ్డారు.

30 ఏళ్ళ కింద రావిశాస్త్రి గారిని అందరూ పౌరులు కాదా? అని అడిగినప్పుడు ఎట్లా అవుతారు? - కొందరు పరాన్నబుక్కులు ఉన్న వ్యవస్థలో అన్నాడు. మనిషైతే యింకో మనిషి భుజాల మీద, వీపు మీద, గుండెల మీద సవారి చేయడు గదా అన్నాడు.

పసిపిల్లలతో మనుషులకుండే అనుబంధం వర్గాల మధ్య పీడక పీడిత ఉత్పత్తి సంబంధంగా మారడం, అనుబంధం వికృతమైన ఆధిపత్యంగా మారడమే.

ప్రజ అంటే మంచి పుట్టుక గలవారు.

జ = జన్మ, జననం; ప్ర = మంచి
ప్రశస్థం, ప్రతిష్టవలె అని అనుకుంటాను సంస్కృతంలో.

సంస్కృతంలో వ్యుత్పత్తి అర్థాలు వుంటాయి. వారు ప్రజల భాషలను వర్ణ వ్యవస్థ కోసం సంస్కరించి తయారు చేసిన భాష కనుక.

మార్క్సిస్ట్ పరిభాషలో వ్యుత్పత్తి అర్థాలు వుంటాయి. మానవ సంబంధాలు వర్గ సమాజంలో ఉత్పత్తి సంబంధాలుగా మారాయని మార్క్సిజం అర్థం చేసుకుంటుంది కనుక.

ద్విజునికి రెండు జన్మలుంటే వుండవచ్చుగాని ఉత్పత్తిలో పాల్గొనడు గనుక ప్రజ కాలేడు అంటున్నారు యిప్పుడు దళిత వాదులు. కొందరు ఆ కులంలో పుట్టిన వాళ్ళ గురించి అంటున్నారు, మరి కొందరు డీ క్యాస్ట్‌పై కానందుకంటున్నారు.

పురుష స్వామ్యానికి, హిందుత్వకు, ఆదివాసేతర భావజాలానికి, తెలంగాణేతర భావజాలానికి కూడా అన్వయించి యివ్వాళ యిక్కడ చాలా సమాజ, సాహిత్య చర్చ జరుగుతున్నది.

సారాంశంలో రచయిత - మొదట మనిషి కనుక రచనాచరణ ద్వారా ఒక ఉత్పత్తి కార్యంలో, ఒక సృజనలో పాల్గొంటుంది / పాల్గొంటాడు కనుక రచయిత ప్రజల మనిషి అంటే ఉత్పత్తిలో పాల్గొనే మనిషి.

మనిషి అన్నపుడు రక్త మాంసాలు, భావోద్వేగాలు గల మనిషి అని కదా. నేనూ మనిషినే, నాకూ చీమూ నెత్తురు వున్నాయి అని అంటుంటారు - స్వాభిమానాన్ని ప్రకటించే సందర్భం వచ్చినపుడు.

ఈ మాట ఆధిపత్య భావజాలం ముందు, దాని నిర్మాణయుత వ్యవస్థీకృత రూపమైన రాజ్యం, అత్యున్నత రూపమైన సామ్రాజ్యవాదం ముందు కూడా అనగలగాలి కదా.

ప్రజలు అంటున్నారు. పోరాడుతున్నారు.

ప్రజల మనిషైన రచయిత వ్యక్తీకరణ పోరాటం చేయాలి గదా.

ఆధిపత్య భావజాల వ్యవస్థీకృత రూపం రాజ్యం. ఇక అభివృద్ధికి ఆస్కారం లేని మరణశయ్య సామ్రాజ్యవాదం.

ఈ రెండూ రద్దు కానిదే మానవ సమాజానికి విముక్తి లేదని భావించే రచయిత ప్రజల మనిషి.

## 'రచయిత - ప్రజల మనిషి' సదస్సులో ప్రముఖుల అభిప్రాయాలు

**ఎస్.వి. సత్యనారాయణ :** ఇరవైవ శతాబ్ది సాహిత్యం మనకు ఒక గొప్ప వారసత్వాన్నిచ్చింది. ఉద్యమం కన్నా కుటుంబం, కుటుంబంకన్నా వ్యక్తి ముఖ్యమనే ధోరణి యివాళ పెరిగింది. సమాజ సంస్కరణకన్నా వ్యక్తి ముఖ్యమనే ధోరణి ఆధిక్యంలో ఉంది. అనేక రకాల వ్యాపార సంస్కృతులు మన రక్తపోటు పెంచుతున్నాయి. తులసి, తులసిదళం లాంటి నవలల్లో కాష్మోరా దయ్యాలను మన మీదికి వదిలిన రచయితలు యివాళ వ్యక్తి వికాసం, వ్యక్తిత్వ వికాసం లాంటి ఆదర్శాలు వల్లిస్తున్నారు. వ్యక్తికన్నా సమాజం గొప్పది. సమాజ విముక్తి పోరాటాలు గొప్పవి అని అభ్యుదయ సాహిత్యోద్యమం భారత ప్రజలకు గుర్తుచేసింది. ప్రజలు అంటే పోరాడే ప్రజలు అని అర్థం. ప్రజల కోసం రాసే రచయిత ప్రజారచయిత. ఈ సాంప్రదాయం మన తెలుగుసాహిత్యంలో పుష్కలంగా ఉంది. దీన్ని అరసం ప్రారంభించింది. విరసం యింకా ముందుకు తీసుకుపోయింది. యివాళ కొత్తగా రచయిత ప్రజల మనిషి అంటే ఏమిటి? అనే సందేహం మనకెవరికీ లేదు. దాన్ని యింకా ముందుకు తీసుకపోవడం ఎట్లా? ఈ సామ్రాజ్యవాద సంస్కృతి నీడలో ఉన్న ఎక్కువ మంది రచయితలను ప్రజల మనుషులుగా నిలబెట్టడం ఎట్లా? అన్నదే ఈ సదస్సు లక్ష్యం అని నేనుకుంటున్నాను. దాన్ని మనం తప్పక సాధించగలమని నా నమ్మకం. దానికి ప్రేరణ ఈ సభలు అందిస్తాయి.



పి.సి.రాములు

**కె. శివారెడ్డి :** నాకు సరిగా గుర్తు లేదుగాని విరసం ఏర్పడిన కొత్తలో అనుకుంటా ఆల్వాల్‌లో ఆర్ట్ లవర్స్ వారు నిబద్ధత - నిమగ్నత మీద సదస్సు పెట్టారు. విరసం ఏర్పడింది. యింకా చాలా సాహిత్యోద్యమాలు వచ్చాయి. యిప్పుడు మళ్ళీ రచయిత ప్రజలమనిషి అని ఎందుకు మాట్లాడుకుంటున్నాం. ప్రతి అయిదేళ్ళకోసారి సాహిత్యగమనం మారినట్లుగానే, సందర్భం మారినప్పుడల్లా రచయితలు మైమరపు ప్రమాదానికి లోనయ్యే అవకాశం ఉంటుంది. కాబట్టి ఇప్పుడిలా మళ్ళీ ఈ సదస్సు. ప్రపంచీకరణ నేపథ్యంలో ఫ్రాగ్మెంటేషన్ పెరిగింది. సామ్రాజ్యవాదం ఉద్దేశ్యమే విచ్ఛిన్నం చేయడం. ఐక్యత ఎక్కడ ఉంటే అక్కడ సామ్రాజ్యవాదం చొరబడుతుంది. మనకు మనం మేలుకొలుపు పాడుకోవడానికి రచయిత ప్రజలమనిషి అని మాట్లాడుకుంటున్నాం. ఏఏ సందర్భాల్లో మనం ప్రజల మనిషిగా ఉండాలో మనకు తెలుసు. దానికి కూడా విరసం వేదిక అవడం సంతోషం. నేను చాలాసార్లు చెప్పాను. నేను విరసంతో పుట్టి పెరిగిన వాణ్ణి. యిప్పటికీ అదే. ఒకేసారి విరసంకు ఇన్‌సైడర్‌ను, ఔట్‌సైడర్‌ని. విరసంకు చాలామంది అలాంటి వాళ్ళు ఉన్నారు. వాళ్ళందరి ప్రతినిధిగా నేను మాట్లాడుతున్నాను. విరసంలో కొత్తగా కవిత్వం రాస్తున్న వాళ్ళను శ్రద్ధగా చదువుతున్నాను. చాలా గొప్పగా రాస్తున్నారు. అరుణతారలో కాంప్లెక్స్‌పోయిట్రీ వస్తోందిగదా అని ఒకరన్నారు. కవిత్వంలోని కాంప్లెక్సిటీ కాదు, అసలు మనమున్న స్థితిలోనే అది ఉంది అన్నాను. కళ్యాణరావు ఒక మాట అన్నారు. విరసం ప్రజలమనిషి అని. మొత్తం సాహిత్య సమూహానికి గుర్తుగా విరసం ప్రజల ప్రతినిధి అని నేను అర్థం చేసుకుంటున్నాను. ఒక మహారచన రావడానికి కారణం ఏమిటి? అని గోరీ అన్వేషించాడు. సమూహపు అనుభవాన్ని అందించేదే గొప్ప రచన. అది మానవసారాన్ని శుద్ధి చేస్తుంది. నీకు నీవు అపరిచితుడవైపోతున్న సమయంలో నేను ప్రజలమనిషి అని రచయిత గుర్తు చేసుకోవాలి. విరసం ఇరవైవ సభలు మనకు ఆ విషయాన్ని గుర్తు చేస్తున్నాయి.

**అబ్బూరి ఛాయాదేవి :** రచయిత్రిగా నేను తోటివాళ్ళకోసం రాశాను. నా చుట్టూ ఉన్న స్త్రీల కష్టాలు చూచి రాశాను. మనం ప్రజల్లోకి వెళ్ళాలని అన్నారు. వెళ్ళలేని నా లాంటి వాళ్ళ రచనలు ప్రజల్లోకి వెళ్ళగలిగితే అవి ప్రజలను ఎంతో కొంత చైతన్యపరుస్తాయి. ప్రపంచీకరణ యివాళ యుద్ధాల మీద విస్తరిస్తోంది. స్త్రీలు, పిల్లలు బలైపోతున్నారు. యుద్ధంతో ఏ సంబంధంలేని వాళ్ళు కూడా కష్టపడుతున్నారు. ప్రజలకు హానీ చేయకుండా ఏకొంచెం మేలుచేసే రచనలు చేసినా, వాళ్ళంత ప్రజల మనిషి అవుతారని నేననుకుంటున్నాను. మానవత్వాన్ని నిలబెట్టడానికి, మంచిని కాపాడటానికి పూనుకున్న ప్రతి రచయితకు ఇవాళ ప్రపంచీకరణ వస్తువుగా ముందుకు వచ్చి నిలబడుతుంది. రచయిత ముందు తాను సమాజంలో భాగమని గుర్తించాలి. సమాజంలో ఏమార్పు కావాలని తాను అనుకుంటున్నదీ తెల్సుకోవాలి. దాన్ని ప్రతిఫలించేలా, మానవత స్వభావం వెల్లివిరియాలని కోరుకొంటూ రచన చేయాలి.

**జ్వాలాముఖి :** 'ప్రజ' అనే మాటకు ఇప్పటి నిషేధ, నిర్బంధ వాతావరణంలో కొత్త అర్థం చెప్పుకోవాలి. 'ప్ర' అంటే ప్రభుత్వ నిర్బంధాన్ని 'జ' అంటే జయించినవారు అని. ప్రభుత్వ నిర్బంధాలను, నిషేధాలను జయించింది విప్లవ సాహిత్యోద్యమం. 'మంచి సాహిత్యం మానవత్వాన్ని స్థాపించేవేళ, చెడ్డ ప్రభుత్వం సాహిత్యాన్ని వెంటాడుతుంది' అని యిక్కడ పెద్ద బ్యానర్ ఉంది. గత ముప్పై అయిదేళ్ళలో తెలంగాణ మారుమూల పల్లెల నుండి గొప్ప సాహిత్యం వస్తోంది. ఈ లక్షణం మిగతా ప్రాంతాలకు విస్తరించింది. 'ఒక నిజాయితీపరుడైన, ప్రతిభావంతుడైన రచయిత ఏ సమాజంలో ఊపిరిపోసుకుంటాడో ఆ సమాజంలో ప్రత్యామ్నాయ ప్రభుత్వం ఏర్పడుతుంది'. అని ఒకరన్నారు. విప్లవ సాహిత్యోద్యమం మన రాష్ట్రంలో సాంస్కృతిక రంగంలో ప్రత్యామ్నాయ ప్రభుత్వాన్ని ఏర్పరిచింది. అందుకే ఈ నిషేధాలు, ఈ నిర్బంధాలు. మనం సృష్టిస్తున్న ప్రపంచాన్ని కుంచింపచేస్తూ ప్రపంచీకరణ వచ్చి పడింది. అమెరిక, దాని మేధావులు, స్వచ్ఛంద సంస్థలు వాళ్ళు చేసింది ఏమిటంటే చిన్నగీత పక్కన పెద్దగీత గీయడం. భారతదేశం అనేక ప్రత్యక్షపోరాటాలు చేసింది. ప్రత్యక్షపోరాటాలు అవసరాలు లేకుండా ఒక పెద్దగీత గీయడం అనే పద్ధతి యిది. ఎక్కడికక్కడ అనేక చీలికలు వచ్చాయి. కులం, మతం, జండర్ ప్రాంతం అనే చలికలు వచ్చాయి. యిది మంచా చెడా అనేది తర్వాత. యివి వచ్చిన సందర్భాన్ని మర్చిపోకూడదు. మన దేశంలో అర్థవలస - అర్ధభూస్వామ్యమనే ప్రధాన వైరుధ్యం మారలేదు. కానీ సామ్రాజ్యవాదం పెచ్చరిల్లిపోతుంది. యిప్పుడేం చేయాలి? యాభై ఏళ్ళకింద మగ్దూం చెప్పాడు - 'జీవితాన్ని వెంట తీసికెళ్ళు సమస్త విశ్వాన్ని వెంటతీసికెళ్ళు, నడిస్తే మొత్తం యుగాన్ని నీవెంట తీసికెళ్ళు' అన్నాడు. యివాళ ఎవరికి యిష్టం ఉన్నా లేకున్నా విప్లవాన్ని అభిమానించే వాళ్ళందరికీ ఒకే లక్ష్యం. విశ్వాన్ని వెంట తీసికెళ్ళడం. అది ఈ యుగ కర్తవ్యం. అంటే అది విప్లవ యుగ కర్తవ్యం. ఆ కర్తవ్యం నిర్వహించాలంటే విరసం, అరసం, జానసాహితి, జననాట్యమండలి, విడివిడి రచయితలు, బృందాలు అందరూ కలవాల్సిందే. అందరూ కలసి ఈ విశ్వాన్ని ముందుకు తీసుకపోవాలి. చెడ్డ ప్రభుత్వం వెంటాడుతుంది.... అయినా తప్పదు. అప్పుడే మనం ప్రజల మనుషులమవుతాం. ఆనందం కోసం సాహిత్యం కాదు. ప్రజలకోసం ప్రజల విముక్తికోసం సాసిత్యం రాయాలి. అప్పుడు అనేక వైరుధ్యాలు కుల, మత, ప్రాంత వైరుధ్యాలు యివి తాత్కాలికమే. అసలైన వైరుధ్యం ఒకటి ఉన్నది. దానికోసమే అందరం నిలబడాలి.



అమర వీరుల స్థూపం

**గీతాంజలి :** ఇంతకుముందు నాకు చాలాసార్లు విరసం వేదికపై ప్రసంగించే అవకాశం కలిగింది. ఇప్పుడు విరసం సభ్యురాలుగా మాట్లాడుతున్నాను. నిషేధం తర్వాత జరుగుతున్న ఈ చారిత్రాత్మక సభల్లో మాట్లాడ్డం గర్వంగా ఉన్నది. విరసం ఇప్పటివరకు అనేక నిర్బంధాలను, నిషేధాలను అనుభవిస్తూ వచ్చింది. నిర్బంధం రచయితల విశ్వాసాన్ని, రచనా శక్తిని బలోపేతం చేస్తుంది. ప్రజా రచయితలకు చరిత్రలో నిషేధాలు, నిర్బంధాలు కొత్తకాదు. జైళ్లలోనుంచే చాలా గొప్ప సాహిత్యం వచ్చిందని మనకు తెలుసు. రచయిత ప్రజల పక్షాన ఉన్నప్పుడు రాజ్యం వారిపై కక్షకట్టడం చాలా మామూలే. విరసం చరిత్ర అంతా నిర్బంధాల మధ్యనే కొనసాగుతూ వచ్చింది. రచయిత ప్రజల మనిషి అనే భావనను విరసం తన రచనలో, నిర్బంధాన్ని అనుభవిస్తూ కొనసాగడంలో నిరూపించింది. ఇవాళ సామ్రాజ్యవాదానికి వ్యతిరేకంగా ఆలోచించేవాళ్ళందరూ ప్రజల మనిషిగా తమను తాము అంకితం చేసుకోవాల్సి ఉంది. ఈ క్రమంలో రచయితలు, కళాకారులు విధిగా కొన్ని నైతిక విలువల్ని పాటించాల్సి ఉన్నది. మన కళల్లో, సాహిత్యంలో ప్రజలకు అనేక విషయాలు బోధించేముందు వాటిలో కొన్నైనా సరే మన నిజ జీవితంలో పాటించవలసి ఉన్నదని నా అభిప్రాయం. అప్పుడే మనల్ని ప్రజలు తమ మనుషులుగా గుర్తిస్తారు.

**నందిని సిద్ధారెడ్డి :** రచయితలకు - ప్రజల మనిషిగా నిలబడే రచయితలకు మధ్య తేడా ఉన్నది. ప్రజలతో మాకేంపని అనుకొనే రచయితల గురించి మనం ఏం మాట్లాడలేంగాని, ఎక్కడో ఒకచోట ప్రజలు అనే ప్రతిరచయిత కూడా తాను ప్రజల మనిషిగా రూపొందడం గురించిన చర్చ చేయాల్సి ఉన్నది. ప్రజలలో లేకపోతే రచయిత కనీసంగా రచయితగా మిగిలే అవకాశాలు లేవు. ప్రజల మధ్య కాకుంటే రచయితలేడు, రచన లేదు. గత ఎన్నికలకంటే ముందు చంద్రబాబు నాయుడు కొందరు ప్రముఖ కవులను, కళాకారులను పిలిపించుకొని తన ఎన్నికల ప్రచారానికి పాటలు రాయమన్నాడట. అప్పుడు ఆయన ఒక మాట అన్నాడట. ఊరుపేరులేని రచయితలు తెలంగాణ గురించి అంత గొప్ప పాటలు రాస్తుంటే, మీరు సినిమాల్లో యితరత్ర యింత పేరు పొందినవాళ్ళు, పైగా మేం యింతింత డబ్బు యిస్తున్నాం మరెందుకు మంచి పాటలు రాసిస్తలేరు అన్నాడట. అప్పుడు వాళ్లు అన్నారట - తెలంగాణ గురించి మేం కూడా మంచి పాట రాస్తం అన్నారట. ప్రజల గురించి, వాళ్ళ ఆకాంక్షల గురించి మంచి రచన చేయగలరుగాని, ప్రజలను అణిచివేసే వాళ్ళ గురించి మంచిని రాయడం సాధ్యం కాదు. యాభైవేలు యిచ్చిన ఇవాళ ప్రపంచీకరణ గొప్పదని, చంద్రబాబు గొప్పవాడని, రాజశేఖర రెడ్డి గొప్పవాడని ఎవరైనా మంచిపాట రాయగలరా? గ్రామాల్లో ఆత్మహత్యలు పెరిగిపోయాయి. ఒకప్పుడు ఒకరికి కష్టం వస్తే యింకొకరు ఆదుకొనేవారు. ప్రపంచీకరణ వల్ల గ్రామాల్లోని సంబంధాలు కూడా విచ్ఛిన్నమైపోయాయి. ఒకరి కష్టం యింకొకరికి తెలియటమే లేదు. మేం ఒకసారి రైతుల ఆత్మహత్యల గురించి తెలుసుకోవడానికి గ్రామానికి వెళ్ళాం. ఒక స్త్రీ ఆకలి చావుకు గురైన తీరు గురించి పక్కింటాయన వివరించి చెప్పిండు. ఆయన మాటలు వింటుంటే మాకు దుఃఖం ఆగలేదు. అంత దయనీయస్థితిని పదునైన భాషలో చెప్పిండాయన. అది మనకు రావాలంటే ప్రజల దగ్గరకు పోవల. ప్రజల మనుషులం కావాలి. యింకొకచోట - అమ్మనాయిన చచ్చిపోయిన పిల్లగాడు కల్లు దుకాణంలో పనిచేస్తున్నాడు. అతన్ని ఎట్లా బతుకుతవేమని అనడిగితే - 'సేటుకు దండంపెట్టి చెల్లెను సాక్కుంట' అన్నాడు. యింత గాఢమైన భాష ఎక్కడి నుండి వచ్చింది? మనకు రావాలంటే ఏంచేయాలి? ప్రజల దగ్గర అపూర్వమైన కవిత్వం ఉంది,

సాహిత్యం ఉంది. అక్కడికి మనం వెళ్దాం. ప్రజల మనుషులుగా రాద్దాం. మనిషిని అంతర్థానం చేస్తున్న ప్రపంచీకరణ నేపథ్యంలో రచయిత రచయితగా బతకాలంటే ప్రజల దగ్గరికి పోవాల్సిందే.

**స్కైబాబ :** రచయిత ప్రజల మనిషి అన్నప్పుడు - చంద్రబాబును కాదని రాజశేఖరరెడ్డిని గెలిపించిన ప్రజలున్నారు. గుజరాత్‌లో వేలమందిని చంపిన, చంపించిన మోడీని మళ్ళీ గెలిపించిన ప్రజలున్నారు. ఈ ప్రజల్లో నుండే రకరకాల ఉద్యమాలు వచ్చినప్పుడు దళితబహుజన ఆందోళనలను బలపరిచిన రచయితలను కదా మనం అంగీకరించాల్సింది. ఆ దళితుల్లో కూడా మాల మాదిగల మధ్య తేడా వచ్చినప్పుడు మాదిగల పక్షాన నిలబడిన రచయితలను గదా మనం అంగీకరించాల్సింది. మాదిగల్లో యింకా కిందిస్థాయి కులాల మధ్య తేడా వచ్చినప్పుడు వాళ్ళ పక్షాన నిలబడిన రచయితలను గదా మనం స్వీకరించాల్సింది అనిపించింది. అట్లాగే తెలంగాణ ఆకాంక్షను కాదనే రచయితలను రచయితలుగా గుర్తించగలమా? ముస్లింల నుండి వస్తున్న ఆకాంక్షల పట్ల మౌనంగా ఉన్న రచయితలను రచయితలుగా గుర్తించగలమా? హైదరాబాద్‌లోనూ, దేశవ్యాప్తంగా ఉర్దూలో రాస్తున్న రచయితల ప్రపంచం ఒకటి ఉంది. మనకూ ఆ ప్రపంచానికి సంబంధం లేకుండా పోయింది. మేం యింట్లో ఉర్దూ మాట్లాడుకుంటాం. బైట, స్కూళ్ళలో కాస్తా తెలుగు నేర్చుకోవలసి వస్తున్నది. ముస్లింలు ఎదుర్కొంటున్న సమస్యల గురించి అందరూ ఆలోచించాలని కోరుతున్నాను. మధురమైన ఉర్దూ మాతృభాషగా ఉండటం ముస్లింలకు పాజిటివ్ విషయం. అదే నెగెటివ్ విషయముగా మారిపోయింది. ఉర్దూ మాతృభాషలో చదువుకుంటున్న ముస్లింల పట్ల కొనసాగుతున్న వివక్షను అందరూ పట్టించుకోవాలి. ఆనంద్ మఠ్‌లో ముస్లింలను ఏంచేయాలి? అనే ప్రశ్నకు ఈ దేశం నుండి బైటికి పంపించాలి. లేకపోతే చంపేయాలి అని ఉంటుంది. అలాంటి వందేమాతరం యివాళ ముస్లింల మీద రుద్దుతున్నారు. అట్లాగే హిందూ మతంలోని కింది కులాలకు, ముస్లింలకు ఎడం పెంచుతున్నారు. సంఘపరివార సంగతి తెలిసిందే. ముస్లింమత పెద్దలు కొందరు కూడా మరి కారణం. అరబ్బు స్థాన్‌లో ఉన్న యిస్లామ్ అసలైన యిస్లాం అనే ధోరణి వాళ్ళలో ఉన్నది. యిది నిజం కాదు. యిస్లాం విస్తరించే క్రమంలో స్థానిక సంస్కృతుల నుండి చాలా స్వీకరించి ఒక్కో ప్రాంతంలో ఒక్కోరకమైన యిస్లాం సంస్కృతి రూపొందింది. యిదే నిజం. ముస్లిం రచయితలు యిస్లాంలోని లోపాలను ఎత్తిచూపినప్పుడు ముస్లిం రచయితల్లోనే విభేదాలు తలెత్తుతున్నాయి. వీటిని మనం కూడా పట్టించుకోవాలి. పీడితుల, బాధితుల పక్షాన - ముఖ్యంగా ముస్లింల పక్షాన నిలబడిన రచయితలే ప్రజల రచయితలు అవుతారని నా అభిప్రాయం.



ఓల్గా

**తెలకపల్లి రవి :** "రచయిత ప్రజల మనిషి" అనే పదంలో రచయిత, ప్రజలు, మనిషి అనే మూడు పదాలున్నాయి. రచయిత ప్రజల మనిషి అని ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. ప్రజలు అజెండాలో నుండి తప్పిపోతున్న కాలంలో ప్రజలను సాహిత్యరంగంలో కీలకమైన అంశంగా, కేంద్రంగా చేయాలనుకోవడం చాలా మంచిది. దేశమంటే పెట్టుబడులు, మార్కెట్ అని చెపుతున్న కాలంలో దేశమంటే మనుషులు అని రచయిత ప్రజల మనిషి అని గట్టిగా అనుకోవాలి. సాహిత్యాన్ని ప్రజల అభ్యున్నతికి, పురోగమనానికి హేతువు చేయాలి అనుకోవడం పట్ల ఎవరికీ పేచీ ఉండదు. కోకు వీరేశలింగం గురించి చెప్తూ - ప్రజలకోసం రాయటం మాత్రమే కాదు, తనలోని భావచైతన్యం ప్రజల్లో కూడా కలిగించేలా ప్రయత్నించడం వీరేశలింగం గొప్పతనం అని. ఎవరైతే అవాస్తవాల అగాధాల్లో కూరకపోయారో వాళ్ళను వాస్తవంలోకి తీసుకరావాలి. ప్రజల్లోకి మన సాహిత్యాన్ని తీసికెళ్ళడానికి ఏం చేయాలి? అనేది ముఖ్యమైన ప్రశ్న. వేమన దగ్గరి నుండి ఇవ్వాల్టిదాకా వస్తున్న తెలుగు సాహిత్యంలో మానవ విలువలను పునఃప్రతిష్టించడం ఒక ప్రధాన భావధార. ప్రపంచీకరణలోని అనేక పార్శ్వాలను యింకా మనం రాయాలి. జీవితంలో అనేక వైరుధ్యాలు, వైషమ్యాలు పెరుగుతున్నాయి. రచయిత ఒక కార్యరంగంలో పనిచేస్తూ, అక్కడి అనుభవాలను కావ్యరంగంలోకి తీసుకరావాలి. నేటి పరిస్థితులకు అనుగుణంగా సామాజిక పరిశీలనచేసి, వాస్తవిక దృక్పథాన్ని అలవరుచుకొని ప్రజాస్వామిక లౌకిక - సామ్రాజ్యవాద వ్యతిరేక దృక్పథంతో రాయాలి. సాహిత్యానికి పీడిత ప్రజల అభ్యున్నతి తప్ప వేరే పరమార్థం ఏమీలేదు. దాన్ని సాధించడానికి మనం చాలా ఆలోచించాలి. చాలా సంఘర్షించాలి, చాలా రాయాలి.

**దివికుమార్ :** విరసం 20వ మహాసభల సందర్భంగా 'రచయిత ప్రజల మనిషి' అనే అంశాన్ని మరోసారి చర్చనీయాంశం చేయడం సంతోషం. రచయిత ఎప్పటికీ ప్రజల మనిషే. సాహిత్యం తన సంతోషం కోసం అనుకొనేవాళ్ళు కూడ తను రాసింది యితరులు, పాఠకులు చదవాలని కోరుకుంటారు. సామాజిక స్పృహ ఉన్న రచయితయితే తప్పనిసరిగా బాధ్యతగా రాస్తాడు. ప్రజల జీవితాన్ని సాహిత్యం బాగుచేయాలని రాస్తాడు. రచయితలు ప్రజల్లో ఒకరిగా ఉంటూ ప్రజలకోసం రాస్తారు.

**ఓల్గా :** అనేక నిషేధాలు, నిర్బంధాలు చవిచూచిన విరసం మహాసభలకు అభినందనలు. రచయిత ప్రజల మనిషి అనడంలో ఎవరికీ ఏ సందేహంలేదు. ప్రజలు రచయితను తమ మనిషి అనుకోగలగాలి. అప్పుడు సమాజంలో నిషేధాలు, నిర్బంధాలు తగ్గిపోతాయి. రచయితలకు - ప్రజలకు మధ్య దూరం పెరుగుతోంది. ప్రజల గురించి రాస్తున్నాం. కానీ రచనలు ప్రజలను చేరడంలేదు. రచయితకు - ప్రజలకు మధ్య మార్కెట్ విస్తరించింది. మార్కెట్ శక్తులను అడ్డుకోవడానికి రచయితలు, కళాకారులు ఏంచేయాలి? యివాళ అదే మనందరి కర్తవ్యం. దేనికంటే మార్కెట్ మనిషిని అదృశ్యం

చేస్తుంది. సాహిత్యం మనిషి కేంద్రంగా, మానవ సంబంధాలు కేంద్రంగా రూపొందుతుంది. మానవ సంబంధాలను నిలబెట్టదలుచుకున్న ప్రతి రచయిత ప్రజల మనిషి అయినట్టే. మనం మానవ సంబంధాల చిత్రణ మీద శ్రద్ధ పెట్టడం ద్వారా మార్కెట్ శక్తులను ఎదిరించగలం అని నా నమ్మకం.

**శీలావీర్రాజు :** ఇన్నాళ్ళ తర్వాత కమిటెడ్ రచయితలున్న సాహిత్య సంస్థ 'రచయిత ప్రజల మనిషి' అనే సదస్సు ఎందుకు పెట్టింది? అనే సందేహం నాకు ఒకటి తోచింది. యివాళ లోపలి నుండి, బైటి నుండి రచయితను ప్రలోభపెట్టే అంశాలు చాలా ఉన్నాయి. ఈ సభలో యిప్పుడిప్పుడే సాహిత్యరంగంలోకి వస్తున్న వాళ్ళు, ఔత్సాహికులు చాలా మంది ఉన్నారు. వీళ్ళకు తలపండినవాళ్ళతో, అనుభవం ఉన్నవాళ్ళతో 'రచయిత ప్రజల మనిషి' గా ఉండాలనే సందేశం ఒకసారి యిప్పించాలనుకున్నారేమో విరసం వాళ్ళు అని నాకనిపించింది. శివారెడ్డిగారన్నట్టు అనుభవం ఉన్నవాళ్ళకు, అవగాహన ఉన్నవాళ్ళకు కూడా యింకోసారి రచయిత ప్రజల పక్షాన ఉండాలని గుర్తు చేయదలుచుకున్నారేమో అని కూడా అనిపించింది. ఎందుకంటే - సిద్ధాంత విభేధాలున్నవాళ్ళు విరసం నుండి బైటికి వచ్చి కూడా నిబద్ధులుగా ఉన్న రచయితలు కొందరున్నారు. యవ్వనోత్సాహంతో ఉండి, విరసంతో విభేదించి బైటికి వచ్చి అనేక ప్రలోభాలకు లోనవుతున్నవాళ్ళు కూడా అక్కడక్కడ కనిపిస్తున్నారు. రాజకీయ ప్రలోభాలకు కాకపోవచ్చు. ప్రచార ప్రలోభం మాత్రమే కావచ్చు. యిలా కాకుండా దృఢంగా నిలబడాలని కొత్త రచయితలకు చెప్పడం ఈ కార్యక్రమం ఉద్దేశ్యం కావచ్చు. మనం నిజాయితీ పరులమై ఉండాలి. మనం చెప్తున్న విషయం మీద మనకు గతంలో ఏ అభిప్రాయాలున్నా - బైటికి చెప్తున్న విషయాన్ని నమ్మి ప్రజల భాషలో ప్రజల్లోకి వెళ్ళేలా చెప్పాలి. ఇటీవలి కవిత్వంలో గ్రాంధిక పదాలు వాడుతున్న వాళ్ళు ప్రగతిశీల కవుల్లో ఉన్నారు. దీనివల్ల ప్రజలకు అర్థం కావడంలేదు. యిది గతంలో చాలా జరిగింది. యిదొక ప్రలోభం. రచయిత ప్రజల మనిషిగా మారడానికి యిదొక ఆటంకం. వచన రచయితల్లో అంతగా ఉండకపోవచ్చు. అయితే యిటీవలి 'మాండలికం' విషయంలో కూడ చిన్న సమస్య ఉన్నదని నా అభిప్రాయం. స్థానిక ప్రజలకు అర్థం కావచ్చుగాని, యింకొంచెం సరళంగా రాస్తే, మాండలికం రాస్తూనే యితరులకు అర్థమయ్యేలా ఉండాలని నా అభిప్రాయం. నిజాయితీ గురించి చెప్పాను. పాఠకులు, కొత్త రచయితలు మన దగ్గరికి వచ్చినప్పుడు మన నిజాయితీ మీద సంశయం కలగకూడదు. యిది కనీస షరతు. చెప్పేది, చేసేది యించుమించు ఒకేలా ఉండాలి. కొత్త రచయితలు యిది గమనించాలి.



ముక్తవరం పార్థసారథి

**పి.సి.రాములు :** వరవరరావుగారు తన ప్రసంగంలో రెండు ప్రతిపాదనలు చేశారు. ఉత్పత్తిలో పాల్గొనేవారే ప్రజలు. ద్విజులు ఉత్పత్తిలో పాల్గొనరు కాబట్టి వాళ్ళు ప్రజలు కారు అన్నారు. నేను రెండోదాన్ని అంగీకరించడం లేదు. డీక్లాస్, డీకాస్ట్ అయినవారు అంత ప్రజల్లో భాగమే. సాహిత్య సృజన కూడా ఉత్పత్తిలో భాగమని ఆయన అన్నారు. కాబట్టి రచన చేసేవాళ్ళు అంతా ప్రజల్లో భాగమే. కాకపోతే రాజకీయపార్టీలన్నీ ప్రజలు.... ప్రజలు అని గందరగోళం సృష్టిస్తున్నాయి. కాబట్టి ప్రజలు అనే మాట నిశితంగా పట్టించుకోవాల్సి వస్తున్నది. వర్గ సమాజంలో వర్గమానవత్వమే ఉంటుంది కాని జనరల్ మానవత్వం అనేది ఏదీ ఉండదు. మనిషిని ప్రేమించగలిగినవాడు వర్గసమాజంలో వర్గ దృక్పథంతో శ్రామికవర్గ ప్రజలను ప్రేమించి, వాళ్ళ కోసమే రచన చేస్తాడు. ప్రజా రచయితలు అంటే వ్యవస్థకు శాశ్వత ప్రతిపక్షం అని అర్థం. ఇప్పుడు వైయుక్తిక వాదం అనేక రూపాల్లో విస్తరిస్తోంది. వాటిని సహృదయంతో అర్థం చేసుకుంటూనే వాటిని కలుపుకపోతూ వాటితో సంభాషించి, చర్చించాల్సి ఉన్నది. ఈ పని విరసం చేయాలి. ప్రపంచీకరణ విస్తరించే క్రమంలో దాన్ని ఎదిరించే పోరాటాల పక్షాన దృఢంగా నిలబడ్డందుకే - మనిషిని ప్రేమించే విరసం నిషేధానికి గురైంది. అయితే ప్రజా రచయితలు, కళాకారులు దాన్ని అంగీకరించలేదు కాబట్టి ప్రభుత్వం ఎత్తివేసుకోవాల్సి వచ్చింది. ఎక్కడ సంఘర్షణ ఉంటుందో, ఎక్కడ పోరాటం ఉంటుందో అక్కడ రచయిత చూపు ప్రసరించాలి. అప్పుడు ప్రజల రచయితగా మన బాధ్యత నిర్వర్తించిన వాళ్ళమవుతాం.

**నాళేశ్వరం శంకరం :** కొన్నేళ్లక్రితం వరవరరావు, కళ్యాణరావులు అరెస్టు అయినప్పుడు ఇదే వేదిక మీద నేను గద్గద స్వరంతో మాట్లాడాను. తల్లికోసం పిల్లాడు వీధులన్నీ తిరుగుతూ ఏడుస్తున్నట్లు అనిపించింది నాకారోజు. వాళ్ళిద్దరూ ఉన్న సభలో అదే పిల్లవాడు వొంటి మీద బట్టలు తీసి వర్షంలో హాయిగా తడుస్తూ గెంతులాడినట్లనిపిస్తున్నది. రచయిత కూడా ప్రజలకోసమే బతుకుతాడు. ప్రజలమనిషి ఒక మహా వృక్షంలాంటివాడు. వృక్షం తన ఫలాలు తనకోసమే అనుకోదు. రచయిత కూడా అంతే. అందుకే రాజ్యం నిషేధిస్తుంది, నిర్బంధిస్తుంది. ఒకమాటలో చెప్పాలంటే రచయిత సూదిలాంటివాడు. బట్టలో దాన్ని బంధిద్దామనుకుంటే యింకోవైపు నుండి బైటికి వచ్చేస్తాడు. ఒక చెరువు ఉందనుకోండి, అందులో చేపలుంటాయి. పెద్ద చేప చిన్నచేపను తింటుందని, చేపలను చేపలవాడు పట్టుకపోతాడని చెప్పడం సులువు. యివన్నీ రచయితలు రాస్తారు. కాని చేప ఫెట్టుకొనే కన్నీటిని కూడా చూచి దాని గురించి కవిత్వం రాసినప్పుడు ఆ రచయితలు ప్రజల మనిషి అవుతారు. ప్రజలు నారుమడిలాంటివారు. కవులు, రచయితలు కంచెలాంటివారు. వారే ప్రజల మనుషులు అవుతారు.

**కాత్యాయనీ విద్మహే :** ఉత్పత్తులో ఉన్న ప్రజలు, ఆ ప్రజలతో ఉంటూ వాళ్ళ ప్రయోజనాలకోసం ఆలోచించి, రాసేవాళ్ళు ప్రజల మనుషులు. ఉత్పత్తి సంబంధాల వల్ల ఉపరితలంలో ఉండే సామాజిక అంశాలన్నీ ఛిద్రమైపోతున్నాయి. వీటి గురించి పట్టించుకొని రచన చేసేవాళ్ళు ప్రజా రచయితలు. ఆ పునాది సంబంధాలవల్లనే స్త్రీ- పురుష సంబంధాలు బాగాలేవు. కుల సంబంధాలు బాగాలేవు. కాబట్టి ఎక్కడి నుండి ప్రారంభించినా ఈ విధ్వంసాలకు కారణం ఎక్కడ ఉందో ఆ మూలం దగ్గరకు వెళ్ళాల్సిందే. దానితో సంబంధం పెట్టుకొని దాన్ని మార్చే ప్రయత్నం చేయడం, ఆ పునాదిని మార్చడం ద్వారా పునాది రంగాల విధ్వంసాన్ని అరికట్టి ఉన్నతీకరించడం ప్రజారచయితల కర్తవ్యం. కొ.కు అంటాడు - నేను గన్ను పట్టుకొని విప్లవంలోకి పోయిన వాడిని కాను అని. పునాది రంగంలో రావలసిన మార్పులకు అనుగుణంగా, దానికి సంబంధించిన చైతన్యంలో పునాది రంగాల్లో మార్పుకోసం ఆయన మధ్యతరగతి జీవితాలను అంత విస్తృతంగా రాశారు. సాంగత్యం ఆత్మానందం కోసం అనేవాళ్ళు యింకా ఉన్నారు. అకాడమిక్ రంగంలో ఎక్కువగా ఉన్నారు. ప్రజలతో సంబంధం లేకుండా మంచి సాహిత్యాన్ని ఊహించగలిగినవాళ్ళు యింకా ఉన్నారు. కాబట్టి మనం ప్రజా రచయితలు అంటే ఏమిటి? రచయిత ప్రజల మనిషి కావడం అంటే ఏమిటి? అని నిరంతరం ప్రశ్నించుకోవలసి ఉంటుంది. ప్రతి రచయిత తన వర్గానికి తను ఎన్నుకోబడని ప్రతినిధిని అనుకోమని కో.కు 40లలో చెప్పారు. అయితే ప్రజా రచయితగా రాయడం, ప్రజల మనిషిగా జీవించడం వేరు వేరు. ఈ రెంటి మధ్య వీలైనంత సయోధ్య కూర్చగలగాలి.

**గద్దర్ :** నేను చూసిన మొదటి విప్లవ రచయిత, ప్రజారచయిత చెరబండరాజు. ఆపరేషన్ అయి శరీరం అంతా దెబ్బతిన్నాక కూడా ప్రజలు ఎక్కడుంటే అక్కడికి పోయి రాసేవాడు, పాడేవాడు. అట్లాంటి వాళ్ళు చాలా మంది వచ్చారు. రాసిందానికి, పాడిందానికి జెయిళ్ళలో పడ్డారు. చచ్చిపోయారు. వాళ్ళ కుటుంబాలు చెల్లాచెదురైపోయినాయి. రచయిత ప్రజల పక్షాన ఉండాలని ఎప్పుడో ప్రజలే తేల్చేసినారు. ప్రజలు తమ గురించి తాము చాలా రాసుకున్నారు. మనం కూడా రాద్దామనుకుంటున్నాం. మీరు ఏ వైపు? అనే ప్రశ్న ప్రజలు ఏనాడో వేశారు. మీ వైపే అని చెప్పి రాసినవాళ్ళు చాలా మంది అమరులైపోయారు. ప్రజలు ఇవాళ యుద్ధంలోకి వచ్చారు. మీరు యిప్పుడేం రాస్తారు? అని నేనడుగుతున్నా. ఆ ప్రజల యుద్ధం గురించి రాస్తామా లేదా? శాంతి చర్చలు చేసిన రచయితలను జెయిల్లో పెట్టారు. మీరు ప్రజా రచయితలు కాబట్టే ఈ సభలకు యింత మంది జనం వచ్చారు. ఈ వేదిక మీద పాటలు పాడినవాళ్ళు, ఆడినవాళ్ళు సగం మంది చనిపోయారు. చెరబండరాజు, దివాకర్, దయ, కుమారి ఎంతమందో చనిపోయారు. రాజ్యాన్ని ప్రశ్నించడం రచయితల బాధ్యత. యిక్కడ మగ్దూం గురించి చెరబండరాజు గురించి అనుకుంటున్నాం అంటే వాళ్ళు రాజ్యాన్ని ప్రశ్నించిండ్రు కాబట్టే. విరసం చాలా చేసింది. యింకా సువిశాల ప్రాంతంలో చేయాల్సి ఉంది. దళిత రచయితలు, తెలుగు రచయితలు, ముస్లిం రచయితలు, సినీ రచయితలు, వీళ్ళందర్నీ తల్లికోడి మాదిరి దగ్గరికి తీసుకోవాలి. ఎందుకంటే విరసం ప్రపంచం మార్పు గురించి ఆలోచిస్తుందిగదా. వాళ్ళకవి ఏం లేవు. విరసం వీళ్ళందర్నీ ప్రజలవైపు, ప్రజల యుద్ధం వైపు నిలబెట్టాలి. అట్లా చేయడానికి ఈ చర్చ ఉపయోగపడుతుంది.

పి. చంద్

*సాయంకాలం ఆరున్నరకి ప్రముఖ దళిత కవి శిఖామణి, తెలంగాణ కవి, గాయకుడు దేశపతి శ్రీనివాస్ కవిసభ నిర్వహించారు. ఇందులో నగ్నముని, ఆశారాజు, అనిశెట్టిరజిత, స్కైబాబ, అన్వర్, దిలావర్, షాజహానా, ఘంటసాల నిర్మల, గుడిహాళం రఘునాథం, జి.వెంకటక్రిష్ణ, కొండేపూడి నిర్మల, కందుకూరి శ్రీరాములు, వరావరరావు, మోహన్, మహెజబీన్, ఖాలిదాపర్వీన్, వరలక్ష్మి ఇంకా అనేక మంది కవులు కవిత్వం చదివారు.*

## 11వ తేది ఉదయం 10 గంటలకు

## ధిక్కారమూలాలు - వ్యక్తీకరణ

**అధ్యక్షత : సి.ఎస్.ఆర్. ప్రసాద్**

ధిక్కారం అనేమాట సరైన అర్థాన్నే యిస్తుందా? అని విరసం కార్యవర్గంలో చాలా పెద్ద చర్చ జరిగాక కూడా దీన్నే నిర్ణయించాం. మానవజీవితంలో తనకు నచ్చని, ఆమోదంకాని వ్యక్తిగత, సామాజిక విలువలను ధిక్కరించడం ఒక సహజాతమైన అంశం. ధిక్కారాన్ని ఎవరి దగ్గరి నుండి నేర్చుకోనవసరం లేదు. అయితే దేన్ని ధిక్కరిస్తున్నాం? ఎందుకు ధిక్కరిస్తున్నాం? ప్రత్యామ్నాయం ఏమిటి? అనేవి కీలకమైనవి. అరాచకవాదులు సమాజంలోని అన్నింటినీ ధిక్కరించడం ఆమోదనీయం కాదని నా అభిప్రాయం. సమాజంలో ధిక్కరించవలసిన వాటితోపాటు ఆమోదించి, ప్రోది చేసుకొని అభివృద్ధి చేయవలసినవి కూడ ఉంటాయి. అవి జీవితంలో భాగం. కమ్యూనిస్టులు, విప్లవకారులు అన్నిటినీ వ్యతిరేకిస్తారని, ధిక్కరిస్తారని అనుకునే వారు ఉంటారు. కానీ ధిక్కారం అంటే ప్రజా వ్యతిరేక విలువలను, వ్యవస్థలను ధిక్కరించి, నిర్మూలించి నూతన విలువలను, వ్యవస్థలను నిర్మించడం అనే ప్రత్యామ్నాయ కార్యక్రమం కూడా ఉంటుంది. అందుకే ఈ అంశం 20వ మహాసభలకు భూమికగా ఎంచుకున్నాం.

**ప్రొ.హరగోపాల్:** సామాజిక శాస్త్రాల్లో ధిక్కారం గురించి చర్చ జరుగుతున్నది కాని, కొందరే ఎందుకు ధిక్కరిస్తారు? ధిక్కారం ఎట్లా ప్రారంభమవుతుంది? కొందరు మాత్రమే మారుతున్న సమాజ చైతన్యాన్ని వ్యక్తీకరిస్తారు? సమాజ చైతన్యస్థాయిని అందరూ అందుకోగలుగుతారా? కొందరు మాత్రమే మార్పుకు దోహదమయ్యే చైతన్యస్థాయిని - కొంత కష్టం ఉన్నా - అందుకొని ఎందుకు వ్యక్తీకరించగలుగుతున్నారు? సమాజ హద్దులను దాటి వెళ్ళి సమాజ మార్పులో సంకేతాలుగా ఎట్లా ఉండిపోగలుగుతున్నారు? అనే ప్రశ్నలు ఉన్నాయి.

వ్యక్తి ధిక్కారాన్ని, చైతన్యాన్ని ప్రదర్శించిన తర్వాత సమాజం దాన్ని అందుకుంటుందా? లేక సమాజం అందుకోగలిగిన స్థాయిలో ఉన్నందువల్ల ఆ వ్యక్తిలో అది వ్యక్తమవుతున్నదా? అనే చర్చ కూడ ఉంది. వ్యక్తికి సమిష్టికి ఉండే సంబంధం, సమిష్టికి వ్యక్తిమీద ఉంటే ప్రభావం మొదలైన వాటి మీద స్పష్టమైన సమాధానం లేదని నా అభిప్రాయం. మార్క్సిస్టు మెథడాలజీలో ఒక అంశం పట్ల లేదా ఒక ఆబ్జెక్ట్ పట్ల చాలా యిమేజస్ ఉంటాయి. ముదునూరు భారతిగారు చేసిన పిహెచ్‌డీలో ఒక పరిశీలన చేశారు. హిరాకుడ్ ప్రాజెక్టు గురించి మీరేమనుకుంటున్నారు అని అక్కడి ప్రజలను అడిగితే ఇరవై రకాల యిమేజస్ చెప్పారు. చిత్రీకరించారు. దీంట్లో ఏది సరైనది అనడానికి మార్క్సిస్టు పద్ధతిలో ఏదైనా ప్రమాణం ఉన్నదా? అని. 1953లో నాగార్జున సాగర్ గురించి నెహ్రూ యిది పేదవాడికి దీపం అని రాసుకున్నారు. అదే ప్రాజెక్టు లేదా పోలవరం ప్రాజెక్టు అయినా యిప్పుడెలా కనిపిస్తుంది? పోలవరం మీద అధ్యయనం చేయడానికి వెళ్ళిన వాళ్ళతో ఒక ఆదివాసీ స్త్రీ ఒక మాట అన్నదట - 'దీపాన్ని ముద్దుపెట్టుకుంటామా?' అని. అంటే ఆబ్జెక్ట్ యిమేజ్ మారింది. యిదెలా జరిగింది. దీనికి మార్క్సిస్టు మెథడాలజీ ఒక పరికరాన్ని యిస్తుంది. మనిషి సృజనాత్మకశక్తికి మూలమెక్కడ ఉంటుంది? ఐన్‌స్టీన్, న్యూటన్, మార్క్స్, లెనిన్, అంబేద్కర్, మావో మొదలైనవాళ్లు ఎలా తయారయ్యారు? వాళ్ళ సృజనాత్మకతకు మూలం ఏమిటి? రస్సెల్ గురించి మేం ఆ రోజుల్లో అనుకొనేవాళ్ళం. ఆయన తను జీవించిన కాలం యొక్క స్పిరిట్‌ను వ్యక్తీకరించాడు అని. సమకాలీన జీవిత చైతన్యాన్ని సంఘర్షణను వీళ్ళే ఎందుకు వ్యక్తీకరించగలిగారు? మిగతా అందరికి అలాంటి అనుభవం ఉండదా? ఉన్నా వ్యక్తీకరించలేరా? సామాజ స్థితికంటే భిన్నంగా కొందరే - కాల చైతన్యాన్ని అధిగమించి చాలా ముందుకువెళ్ళి ఆలోచిస్తారు. ఉదాహరణకు మార్క్స్ తనకాలాన్ని ఎలా అధిగమించగలిగాడు. ఏ కారణాల వల్ల యిది యిలా జరిగింది అని చెప్పలేం. అంటే వీటి మీద ఒక సూత్రీకరణలాగా చెప్పడం సాధ్యంకాదు. అయితే ఈ పని సాహిత్యం ఆధారంగా చెప్పడానికి ఎక్కువగా అవకాశం ఉంటుంది. సామాజిక శాస్త్రాలలో లేని స్పష్టత సాహిత్యంలో వ్యక్తమవుతుంది. ఉదాహరణకు 1950 నుండి తెలుగు సమాజంలో ఏఏ మార్పులు జరిగాయో చెప్పమంటే గణాంకాల ఆధారంగా, సామాజిక శాస్త్రాల పరిశోధనల ఆధారంగా ఏమేం జరిగాయో చెప్పగలం. కాని ఎట్లా మారాయో చెప్పమంటే సాహిత్యం దగ్గరికి వెళ్ళాల్సిందే. ఈ పని విరసం చాలా చేయగలిగింది. సామాజిక శాస్త్రాల నమూనాల్లోనే ఆ లోపం ఉందని నా అభిప్రాయం. ప్రజల మనిషి, మాలపల్లె, కొమరంభీం, బతుకుపోరు చదివితే మనుషులు, మానవ సంబంధాలు, చైతన్యక్రమాలు మారుతున్న క్రమాన్ని. ఎట్లా మారుతున్నాయో దాన్నీ ఈ నవలలు చెప్తాయి. సామాజిక శాస్త్రాలు ప్రజలకు దగ్గరై ప్రజల్లో వస్తున్న మార్పులను చెప్పాలంటే సాహిత్యాన్ని సాధనంగా చేసుకుంటే సాధ్యమవుతుంది గాని కేవలం యిప్పుడున్న శాస్త్రీయ పద్ధతులు ఏవైతే అనుకుంటున్నామో వాటి మీద మాత్రమే ఆధారపడితే అయ్యేపనికాదని నా అభిప్రాయం. ఈ అవగాహన లేకపోవడం వల్ల సామాజిక శాస్త్రాలు అభివృద్ధి చెందడం లేదు.


కానూరి

ప్రపంచవ్యాప్తంగా సామాజిక శాస్త్రాల మీద ఎంత అధ్యయనం జరుగుతున్నా, విశ్లేషణలు చేసినా రాజ్యానికి ఫర్వాలేదు. విరసంను మాత్రమే నిషేధించింది. సామాజిక శాస్త్రాలకోసం కోట్ల రూపాయలు కేటాయించి ప్రోత్సహించే ప్రభుత్వం అదే సామాజిక జీవిత విశ్లేషణ, చిత్రణ చేస్తున్న విరసంను నిషేధించింది. దేనికంటే విరసం మార్పు ఎట్లా వస్తున్నదో - ఆ మార్పు క్రమాన్ని తన సాహిత్యంలో చిత్రిస్తుంది. సాహిత్యం ఆధారంగా సామాజిక శాస్త్రాలను వ్యాఖ్యానిస్తున్నది. యిది మనిషిని ఆలోచింపచేస్తుంది. మార్పుదిశగా నిలబడుతుంది. ముఖ్యంగా చైతన్యక్రమాల గురించి అవగాహన కలిగిస్తుంది. సాహిత్యానికి సమాజాన్ని మార్చే శక్తి ఉన్నదని విరసం ఆచరణ ద్వారా, రచన ద్వారా చాలా నిరూపణయింది. దీన్ని నిగ్గుదేల్చవచ్చుకూడా. ఒకసారి చేకూరి రామారావుగారు అన్నారు - పాశ్చాత్య దేశాల్లో సాహిత్యాన్ని ప్రభుత్వాలు నిషేధించవు అని. ఎందుకంటే వాళ్ళు సాహిత్యాన్ని అసలు పట్టించుకోరు. యిక్కడ మన ప్రభుత్వం విరసంను నిషేధించిందంటే సాహిత్యానికి సమాజాన్ని మార్చే శక్తి ఉన్నదని ఒప్పుకున్నట్టే. సాహిత్యమంటే రాజ్యానికి చాలా భయం. విరసంను నిషేధించడం అంటే అది చేస్తున్న సృజనాత్మక చిత్రణను చూసి, విశ్లేషణను చూసి ప్రభుత్వం భయపడ్డట్టే. (నిషేధం అనేదానికి సాహిత్యమేమో ధిక్కారం. నిషేధమేమో రాజ్య స్వభావం. కాబట్టి ధిక్కారం గురించి మాట్లాడాలంటే ఆధిపత్య మూలాల గురించి చర్చించవలసి వస్తుంది. ఆధిపత్యం గురించి, అంటే ఒక మనిషి యింకో మనిషి మీద ఎందుకు ఆధిపత్యం చెలాయిస్తున్నాడు. వ్యవస్థీకృతంగా హింసను ప్రయోగిస్తున్నాడు.)

విరసం మనిషి గురించి పట్టించుకొని, ఆ మనిషి జీవిస్తున్న మానవ సంబంధాలను దగ్గరిగా చూచి, సామాజిక శాస్త్రాల దృష్టి ప్రసరించని వైపు నుండి వాటిని చూచి, వాటిలో ఏ మార్పు ఎందుకు, ఎట్లా వస్తుందో రాస్తుంది. మాట్లాడుతుంది. దేనికంటే మనిషి చాలా విచిత్రమైన జీవి. ప్రేమ, కరుణ, త్యాగం, స్వార్థం, ధైర్యం, పిరికితనం లాంటి అనేక లక్షణాలు ప్రదర్శిస్తాడు. యివి సామాజిక స్థితికి, చైతన్యానికి సంబంధించినవి.

మనిషిలో యిన్ని రకాల వైవిధ్యాలు ఉన్నట్టుగానే వైరుధ్యాలు కూడా ఉన్నాయి. వీటిలో చాలా కీలకమైంది ఏమైందంటే - ఒక మనిషి యింకో మనిషి మీద ఆధిపత్యాన్ని ఎలా చెలాయించగలుగుతున్నాడు, దాన్ని భరించేవారు ఎట్లా భరిస్తున్నారు. దీన్ని ధిక్కరించే వాళ్ళెవరు? చాలా అన్వేషించవలసి ఉన్నది. మార్క్స్ ఈ అన్వేషణ చేసే క్రమంలో ఓ

ముఖ్యమైన అంశాన్ని పట్టుకోగలిగాడు. ఈ మొత్తానికి ఆస్తితో సంబంధం ఉంది అని చెప్పాడు. మనిషి చేసే శ్రమ అనేది యింకో ముఖ్యమైన విషయం.

బ్రూనవిస్కీ ఒకచోట అంటాడు - మనిషి చేతులను నడవడానికే వాడుకొని ఉంటే మానవ చరిత్ర లేదు అని. మనిషి చేతితో శ్రమ చేశాడు. ఒక రకంగా చేయిలేకపోతే చరిత్ర లేదు. ప్రకృతిని తనకు అనుగుణంగా మలుచుకొనే క్రమంలో వ్యక్తిగత ఆస్తి వచ్చింది. మనిషికి ప్రకృతి అందుబాటులో ఉండటమే స్వేచ్ఛ. ప్రకృతికి ఈయాక్సెస్ ఎప్పుడు పోయింది. ఎట్లా పోయింది? ఆస్థి ఏర్పడటమే అనేది ఒక ముఖ్య సూత్రీకరణ. కాని సొంత ఆస్తి ఏర్పడటం అనేదానికి కచ్చితమైన చారిత్రక ఆధారం ఎక్కడా కనిపించదు. బాలగోపాల్ ఒక మాట అంటాడు. మనిషిలోని స్వార్థం సొంత ఆస్తి అయింది. బలప్రయోగం రాజ్యమై పోయింది. మగవాళ్ళ ఆధిపత్యం కుటుంబం అయిపోయింది అని. యివన్నీ వ్యవస్థీకృతమై పోయాయి. మనిషిలోని సమిష్టిభావన, త్యాగం, స్నేహం, ప్రేమ యివి యింకా సామాజికంగానే ఉన్నాయి. స్వార్థం వ్యవస్థీకృతమైనంతగా ప్రేమ వ్యవస్థీకృతం కాలేదు. మనిషిలోని నెగెటివ్ అంశాలు వ్యవస్థీకృతం అయ్యాయికాని, పాజిటివ్ అంశాలు, మానవత స్వభావాలు ఎందుకు వ్యవస్థీకృతం లేదు అనే ప్రశ్నకు యింకా సమాధానాలు వెతకవలసియున్నది.

అయితే ఈ క్రమంలో ధిక్కారం గురించి ధిక్కార మూలల గురించి, పోరాటాల్లో ఉండే త్యాగాల గురించి చర్చించవచ్చు. ఈ ఉద్యమాలు మనిషి కోల్పోయిన మానవ స్వభావాలను తిరిగి నిలబెట్టాలనుకుంటాయి. మనిషి తనకున్న క్రియాత్మకతను, సృజనాత్మకతను, మానవీయతను తిరిగి నిలబెట్టుకోవడానికి సంపద్వంతం చేసుకోవడానికి వ్యవస్థీకృతమైన చెడుపైన, ఆధిపత్యంపైన ధిక్కారాన్ని ప్రకటిస్తూ వచ్చాడు. మనిషి ధిక్కారాన్ని ప్రత్యామ్నాయంగా ఎప్పుడైతే ఎన్నుకుంటాడో సమాజంలోని ఆధిపత్యరూపాలు, వ్యవస్థలు, వీటికి పరాకాష్ట అయిన రాజ్యం తన కుదురు ఎక్కడ కదిలిపోతుందో అని భయపడతాయి. ఇది అమానుష సమాజం అని గుర్తించినవాళ్ళు తమ ప్రాణం పోయినాసరే ఆధిపత్యాన్ని అంగీకరించమని ధిక్కారాన్ని ప్రకటిస్తారు. రాబోయే తరాలైన సరే సుఖంగా ఉంటాయని విలువైన ప్రాణాలు త్యాగం చేస్తారు. ఇది మానవ స్వభావంలో ఉన్నది. అంటే యితరుల రక్తం పీల్చి, ప్రాణాలు హరించి ఆదిపత్యం చెలాయించే స్వభావం ఒకవైపు, రాబోయేతరాలైనా సరే సుఖంగా ఉంటాయనే ఆశయంకోసం ప్రాణం త్యాగం చేయగల సంసిద్ధత, త్యాగనిరతి యింకోవైపు ఉంటాయి.



ప్రొ. హరగోపాల్

ఆధిపత్యాన్ని, హింసారూపాలను ఆశ్రయించేవాళ్ళు ఎంత బలప్రయోగం చేస్తారో వాస్తవానికి వాళ్ళు అంతగా బలహీనపడ్డట్టు. అధికారానికి మనిషిని డీసెన్సిటైజ్ చేసే స్వభావం ఉంటుంది. కాబట్టి అత్యంత క్రూరమైన అణిచివేత అమలు చేస్తారు. మళ్ళీ ఎవరో ఒకరు ధిక్కారం ప్రకటిస్తే తప్ప సమ్యకు పరిష్కారం ఉండదు. కల్చరల్ డీ - జనరేషన్, స్టేట్ డీ - జనరేషన్ కలిసినప్పుడు సమాజంలో భిన్న ప్రతిస్పందనలు వస్తాయి. అవి ఎట్లా ఉంటాయో యింకా మనకు పూర్తిగా అర్థం కాలేదు. ధిక్కారానికి మూలాలు వెతికే క్రమంలో భయానికి మూలాలు వెతకాలి. ప్రాణాన్ని ప్రేమించడంలోనా? ఈ ప్రపంచంలో యింకా సుఖవంతంగా జీవించాలనుకోవడమా? ఈ జీవితంలో ఏదో సంతృప్తి ఉన్నందువల్లనా? ఏ కారణం వల్లనో గాని భయం పుడుతుంది. వీటిని అధిగమించిన వాళ్ళు కొందరుంటారు. వాళ్ళు ధిక్కారానికి అత్యున్నతరూపం. భిన్న చైతన్య రూపాలకు మూలాలు ఎక్కడా? మనకు స్పష్టంగా ఒక సమీకరణంలాగా తెలియదు. ధిక్కారానికి మూలం ధైర్యం. కాని భయానికి మూలం ఎక్కడో నాకైతే తెలియదు. మనిషికి బాధ గుర్తున్నట్లుగా సంతోషం గుర్తు వుండదు. భయానికి మూలం వెతికే క్రమంలో మనిషికి ఉండే యిలాంటి అనుభవం స్ఫురిస్తున్నది. భారతదేశంలో ఎవరైనా ధిక్కరిస్తే. ఆధిపత్యాన్ని చేసేవాడు దాన్ని కొంతవరకు తమలో కలుపుకోవడం ఉంది. ముఖ్యంగా యిది హిందూమతంలో ఉన్నదని కోశాంబి అంటాడు. హిందూమతం ఏ వైరుధ్యాన్నీ పరిష్కారం దిశగా పోనివ్వదు. పరిష్కారం అయితే చరిత్ర ముందుకు పోతుంది. వైరుధ్యం పరిష్కాం కాకుండా రాజీఫార్ములాను హిందుత్వ తయారు చేస్తుంది. కొశాంచి సాంస్కృతిక హింస గురించి చాలా చెప్తాడు - భారతదేశ చరిత్రలో ఆర్యుల ప్రవేశం తర్వాత పరిణామాలను వివరిస్తూ. గ్రాంసీ కూడ ఆధిపత్యం అనే భావనను సాంస్కృతిక ఆధిక్యంగా వివరిస్తాడు. మనదేశంలో దీనికి వ్యతిరేకంగా దళిత ఉద్యమాలు వచ్చాయి.

భారతదేశంలో బౌద్ధం మొట్టమొదటి ధిక్కార ప్రకటన అని అంబేద్కర్ అంటాడు. మొదటి హేతువాది బుద్ధుడు. దేవుడి గురించి పెద్దగా పట్టించుకోనవసరం లేదని అంటాడు. సంఘం శరణం గచ్ఛామి అన్నాడు. రెండువేల ఏళ్ళ కిందట ఒక గొప్ప చారిత్రక వ్యక్తి ఆయన. అందుకే అంబేద్కర్ ఏమంటాడంటే, 'నీవు విప్లవం చేసేటట్టయితే పాలకవర్గాలకు ప్రతిఘాత విప్లవం చేసే శక్తి ఉంది ఈ దేశంలో" అని. అంటే బుద్ధుడు విప్లవం అయితే మనువు ప్రతిఘాత విప్లవం. మనదేశంలో హిందూత్వకు యిలాంటి శక్తి ఉన్నది. చరిత్రక్రమంలో అన్ని ఆధిక్యాలను వ్యతిరేకించే ధిక్కార స్వరాలు ముందుకు వచ్చాయి. ముఖ్యంగా ఆంధ్రప్రదేశ్‌లో రాజకీయంగా, సామాజికంగా, సాంస్కృతికంగా గొప్ప ధిక్కార వారసత్వం ఉంది. రాజ్యం భయం వల్ల విరసంను నిషేధిస్తే, తెలుగు సమాజం తనకున్న ధిక్కార వారసత్వం వల్ల విరసంను కాపాడుకున్నది. వ్యక్తిగత ధిక్కారం సామాజిక ధిక్కారంగా మారే క్రమంలో మొత్తంగా ఆధిపత్య వ్యవస్థలకు సవాల్ విసురుతుంది. విరసం ఈ పాఠం పెట్టడంలో ఉద్దేశ్యం నేనేమనుకుంటున్నానంటే - సమాజంలో అనేక స్థాయిల్లో ప్రజలు అనేక రూపాల్లో వ్యక్తిగతంగా చేసే ధిక్కారాలకు సామాజిక రూపాలు ఏమైవున్నాయి. అవి ఎట్లా సామాజిక రూపాలను తీసుకుంటున్నాయి. యివన్నీ ఎక్కడ ఐక్యం కాగలుగుతాయి అనే అన్వేషణ యిది. మారుతున్న సమాజానికి ఆధిపత్యం ఒకరూపం అయితే, ధిక్కారం ఒకరూపం. ఈ రెంటికీ మూలాలు వెతికే క్రమంలో సమాజానికి ఉన్న అస్పష్ట అనుభవాన్ని స్పష్టం చేసుకోవలసి ఉన్నది.

11వ తేది మధ్యాహ్నం 12 గంటలకు

# సామాజిక, సాహిత్య రంగాల్లో ధిక్కారం

**అధ్యక్షత : రత్నమాల**

విరసంపై నిషేధం విధించినప్పుడు మాకు అండదండలందించి, విరసంను హృదయానికి హత్తుకున్న సాహిత్యకారులు, మేధావులు, అభిమానులు అందిరూ యిక్కడున్నారు. అందరికీ విరసం మరోసారి ధన్యవాదాలు చెప్తోంది. నిషేధానంతరం జరుగుతున్న ఈ మొదటి మహాసభకు మా ఆనందాన్ని పంచుకోవడానికి వచ్చిన ప్రతినిధులందరికీ అభినందనలు.

యింతకు ముందు పాఠంలో సామాజిక శాస్త్రాలలో కంటే సాహిత్యంలో ధిక్కారాన్ని, ధిక్కార మూలాలను, ధిక్కార పరిణామాలను దగ్గరిగా చూడవచ్చు అని ప్రొ. హరిగోపాల్ అన్నారు. ధిక్కారంతోనే మనిషి తన తొలిదశ నుండి - మిగతా జంతుజాలాలకు భిన్నమైన పరిణామాన్ని పొందాడు. నాలుగుకాళ్ళపై నడిచే స్థితి నుండి చేతులను చేతులుగా వాడుకోవడం అనే ప్రకృతి పరిణామంలోనూ, దానికి అవసరమైన ఆలోచనలోనూ సంఘర్షణ ఉన్నది. అది అంతక ముందటి స్థితిని కాదని ముందుకు పోవడానికి కారణమైనది. మనిషి ఆలోచనల్లోనే తర్కం, విచక్షణ, ముఖ్యంగా ప్రశ్న అనేవి ఉద్భవించాయి. మనిషికి ఎప్పుడైతే ప్రశ్నించుకోవడం అనే స్వభావం అలవడిందో అది చాలా మార్పులకు కారణమైంది. ధిక్కారానికంటే ముందు ప్రశ్న, బహుశా ధిక్కారానికి తొలిదశ ప్రశ్న అని చెప్పుకోవచ్చు. తన ఉనికి గురించి, ఉనికిలో ఉన్న వాస్తవికత గురించిన ఎరుక ప్రశ్నకు దారి తీసింది. ఈ ప్రశ్న ఉండిపోవచ్చు. ధిక్కారంగా రూపుదాల్చకపోవచ్చు. కేవలం ఆధిపత్యం గురించిన ప్రశ్న తలెత్తి అది అక్కడే ఆగిపోవచ్చు, ధిక్కారంగా మారవచ్చు. సామాజిక ధిక్కారంగా కూడా ఎదగవచ్చు.



రత్నమాల

మేం విరసం కార్యవర్గంలో ఈ థీమ్ అనుకున్నాక ఆహ్వాన సంఘంలో కూడా చర్చ జరిగింది. ధిక్కారం అనే భావనలో అనుకూల అంచాలను వెతికి అన్వేషించాల్సి ఉంది. పాతరోజుల్లో వీధిభాగోతాల్లో అందరూ చూసే ఉంటారు. ఇరువైపుల భుజకీర్తులు, వందిమాగధులతో ఉండగా, కత్తిడాలు పట్టుకొని ధిక్కారంబు సహింతున్...' అని పాడుతూ ఉంటాడు. యిది ఎవరి స్వభావం? అధికారంలో ఉన్న శక్తుల స్వభావం. ఏ ఆధిపత్య వ్యవస్థకైనా, శక్తికైనా ధిక్కారం సహించదు. అణచివేతకు గురయ్యే వారే తమతమ స్థాయిల్లో ధిక్కారాన్ని ఏదో ఒక రూపంలో ప్రకటిస్తూ ఉంటారు.

ఒక్కసారి ధిక్కారంలో నెగిటివ్ అంశం ఉన్నట్లు కనిపించవచ్చు. కానీ అది నిజంకాదు. ఉదాహరణకు దిగంబర కవిత్వం. అన్నింటినీ తిరస్కరించి, నిర్మూలించే లక్షణం అందులో ఉన్నది. అప్పటి స్థితి అది. అది చరిత్రను ఎట్లా నడిపించింది కూడా చూశాం. వైయుక్తిక, సామాజిక ధిక్కారాలు ఏవైన సరే సమకాలీన సమాజస్థితిని ప్రశ్నిస్తాయి, నిలదీస్తాయి. బౌద్ధం, జైనం, చార్వాకులలో సమిష్టి ధిక్కారాన్ని చూడవలసి ఉంది. ఒకనాటి ధిక్కారం కాలం మారేకొద్దీ ఆధిపత్యంగా మారే ప్రమాదం కూడా ఉన్నది. బౌద్ధం, జైనం ధిక్కారం అనుకుంటే వాటి ప్రభావంతో ఆ తర్వాత ఏర్పడిన రాజ్యాలు క్రమక్రమంగా ఆధిపత్యపు భావంలోకి వెళ్ళిపోయాయి. అప్పుడు సామాజికస్తబ్దత ఏర్పడింది. ధిక్కారం తనమూలాలను, ఆశయాలను విస్మరించి ఆధిపత్యంలోకి వెళ్ళడానికి కూడా సామాజిక అవకాశం ఉన్నది. శ్రామికవర్గ విప్లవాలు చరిత్ర మీదికి వచ్చాక సామూహిక ధిక్కారంగా రూపుదాల్చి, ప్రజాస్వామికీకరణ అనే ప్రక్రియలోకి సమాజాన్ని తీసికెళ్ళాయి.

అయితే యివన్నీ సాహిత్యాలలో అన్వేషించడంలో చాలా తేలిక అయినట్టే కొన్ని యిబ్బందులు కూడా ఉన్నాయి. ఉదాహరణకు మనకు లిఖిత సాహిత్యం మొదలైనప్పటి నుండి ఈ పరిశీలన చేయడానికి సాహిత్యాన్ని ఆధారంగా వాడుకోగలం. అందులోనూ రకరకాల కల్పనలు, అవాస్తవాలు ఉండేందుకు అవకాశం ఉంది. ఒక్కచోట ఒక్కలాగా రాసిన కథలు చాలా కనిపిస్తాయి. వీటిని చారిత్రకంగా చూచి విశ్లేషించడం చాలా కష్టమైన పని. లిఖిత సాహిత్యాన్ని పక్కనబెట్టి పదకొండవ శతాబ్దానికి వెనుక ఉన్న మౌఖిక సాహిత్యంలోకి కూడా తప్పక వెళ్ళాల్సి ఉంటుంది. అనేక వీరగాథలు, ప్రేమగాథలు ఉన్నాయి. అసలు ప్రేమగాథలను - మౌఖిక సాంప్రదాయంలోనివి చూస్తే సమాజాన్ని ధిక్కరించాలనే స్పృహ లేకపోయినా కులాన్ని, వర్గాన్ని, అధికారాన్ని కాదని ధిక్కరించిన సందర్భాలను మౌఖిక సాహిత్యంలో చూడవచ్చు. ప్రేమ, అభిమానం అనే వాటికి వ్యవస్థీకృతమైన ఆంక్షలు, కట్టుబాట్లు ఉండకూడదు అని వ్యక్తిగత స్థాయిలోనే అవచ్చు ధిక్కరించిన గాథలు అక్కడ చూస్తాం. లిఖిత సాంప్రదాయం మొదలయ్యాక మౌఖిక సాహిత్యాన్ని అక్షర బద్ధం చేయవలసి ఉండింది. తెలుగులో అది పెద్దగా జరగలేదు. దీనివల్ల జానపద సాహిత్యం కూడ ఉండవల్సినంత అందుబాటులో లేకుండా పోయింది. భక్తి సాహిత్యంలో మౌఖిక సాంప్రదాయం ఉన్నందువల్ల కూడా చాలా సాహిత్యం మనకివాళ దొరకడం లేదు. మతాన్ని అంగీకరిస్తూనే మతం, బ్రాహ్మణిజం యిలా ఉండటం పట్ల భక్తి సాహిత్యంలో చాలా నిరసనలు వచ్చాయి. చార్వాకులు యింకో పద్ధతిలో మొత్తంగా ధిక్కరించారు. మానవజాతి చరిత్రలో పితృస్వామ్యం, కుటుంబం తొలి అణచివేత వ్యవస్థలు కాబట్టి జానపద సాహిత్యంలో స్త్రీల విషాదంతో పాటు శ్రామిక మహిళల నిరసన, ధిక్కారం చాలా ఎక్కువగా కనిపిస్తాయి. వీటిలో సబ్జెక్టివ్ ధిక్కారం ఎక్కువ ఉండవచ్చు. సక్కూబాయి మీరా కుటుంబ ఆ శ్రమ నుండి, నిర్బంధ వివాహ వ్యవస్థ నుండి బైటపడే క్రమంలో భర్తని ఆశ్రయించారు. యిందులోని ధిక్కారాన్ని కూడా శ్రద్ధగా గమనించాలి. యిలాంటి వాటిలో పలాయనవాదం కూడా ఉన్నది. భక్తివాదంలో కూడా పాత బ్రాహ్మణ పద్ధతులు, యజ్ఞయాగాదులను ధిక్కరించే క్రమంలో కొత్తధోరణులు ముందుకు వచ్చాయి. సాహిత్యంలో దీని ప్రభావం బాగా కనిపిస్తుంది. శైవ - వైష్ణవ

సంఘర్షణలు భక్తి ఉద్యమంలో మార్పులు తీసుకువచ్చాయి. ఆశ్రయ వాదం అనే ధోరణి కూడా ఉన్నది. ఎక్కడో ఒకచోట ఒక ఆలంబనను ఆశ్రయించవచ్చు. అది ఒకసారి ఒక ఆధిపత్యానికి వ్యతిరేకంగా యింకో ఆధిపత్యాన్ని ఆశ్రయిస్తుంది. అప్పుడు అవి తన ధిక్కార స్వభావాన్ని కోల్పోతాయి.

ధిక్కారం అనే భావన చాలా క్లిష్టమైనదని మాకు తెలుసు. చరిత్ర క్రమంలో వైయుక్తిక, సామాజిక ధిక్కారాల మూలాలను, వ్యక్తీకరణను, వాని సాహిత్య రూపాలను అధ్యయనం చేయడం మొత్తం సమాజ పరిణామ చరిత్రను అర్థం చేసుకోవడానికి అవసరం. అది కేవలం ఆధిపత్య వ్యవస్థను కూలదోయడం అనే లక్ష్యం ఉన్నందువల్ల ధిక్కారం గురించి యింత లోతుగా ఆలోచిస్తున్నాం.

**పాపినేని శివశంకర్:** దశాబ్దాల తరబడి ఒక గొప్ప స్ఫూర్తిని దేశమంతటా సాహిత్య అభిమానుల్లో ముఖ్యంగా విప్లవ సాహిత్య అభిమానుల్లో కలిగిస్తున్న విరసం సంస్థకు నా హృదయపూర్వక శుభాకాంక్షలు తెలియజేస్తున్నాను. ఈనాటి ఉపన్యాసాలేకాదు పూర్వం ఒకప్పటి ఉపన్యాసాలు మనం వినిపున్నట్లయితే ఎంత స్ఫూర్తిని విరసం ప్రజల్లోను, సాహిత్య అభిమానుల్లోను కలిగించిందో అర్థం అవుతుంది. ఎంతో అపారమైన విషయం, విశ్లేషణ కలిగిన కె.వి.ఆర్, మహా ఉద్ధృతితో సాగే త్రిపురనేని ఉపన్యాసాలు, అటు కవితాత్మకత గొప్పశైలీవిన్యాసం కలిగిన వివిగారి ఉపన్యాసాలు కొన్ని విని ఉన్నాను. ఇలాగే 1982 విజయవాడలో మహాసభలు జరిగాయి. ఉపన్యాసాలన్నీ అయిపోయినాయి. నాలిగింటికి ముగింపు ఉపన్యాసం అని వి.వి. గారు మాట్లడటం మొదలెట్టారు. అరగంటలో అయిపోతుందికదా అని చెప్పి గుంటూరు వెళ్ళిపోదాం అని నేననుకున్నాను. నాలుగింటలకు మొదలు పెట్టిన ఉపన్యాసం అనర్గళంగా 3 గంటలు సాగి 7 గంటలకు ముగిసింది. ఆ మూడు గంటలసేపు కూడా ఏ ఒక్క శ్రోత అక్కడి నుండి కదలనేలేదు. అట్లాంటి స్ఫూర్తిదాయకమైన, విశ్లేషణాత్మకమైన సామాజిక, సాంస్కృతిక సాహిత్యపు విలువల మూలాలను తెలిపే ఉపన్యాసాలు ఎన్నో ఈ విరసం వేదిక మీద జరిగాయి. అలాంటి సభల్లో ఇవాళ మనం ఉన్నందుకు కూడా ఆనందిద్దాం. సరే ఇక్కడికి రాబోయే ముందు నేననుకున్నాను. నా కంటే ముందు పెద్దలు హరగోపాల్‌గారు ఉన్నారు. కదా ఆయన మాట్లాడిన తరువాత నాకు కొన్ని సమాధానాలు దొరుకుతాయి కదా అనుకున్నాను. హరగోపాల్ గారు మాట్లాడుతూ నాకే కొంత చిక్కుగా ఉంది, నా తర్వాత మాట్లాడే ఉపన్యాసంలో మీకు కొన్ని సమాధానాలు దొరకొచ్చు అని అన్నారు. ఎందుచేతంటే ధిక్కారం అనేది అటు పాజిటివ్ అంశం నెగెటివ్ అంశం రెండూ కూడా కలసిన సున్నితమైన కాన్సెప్ట్. లేదా ఒక భావన. దీని మూలాలేమిటి, దీని ప్రస్తుత పరిస్థితి ఏమిటి, దీని భవిష్యత్తు ఏమిటి, సాహిత్యానికి సమాజానికి మధ్య సంబంధంలో ధిక్కారం ఎలా పనిచేస్తుంది, గతి తర్కంలో ఇలాంటివి పరిశీలించాలంటే చాలా కష్టమైన పనిగా అనిపిస్తుంది. కాబట్టి దాన్ని ఎక్కడ మొదలుపెట్టాలా అని నాకు చాలా సందేహం ఉండిపోయింది. బహుశా కొంత మంది చెప్పినట్లుగా ఏ శంభూకుడి దగ్గరైనా లేదా బుద్ధుడి దగ్గరైనా మొదలెట్టవచ్చు. ఈ అంశాన్ని ఇంకా లోకాయితుల దగ్గరైనా మొదలెట్టవచ్చు నేను మా పూరి నుండి బయలుదేరుతూ ఆలోచిస్తూ ఆలోచిస్తూ మా వూళ్ళో చాకలి రాఘవయ్య దగ్గరి నుండి ఎందుకు మొదలు పెట్టకూడదు అని ఆలోచించాను. చాకలి రాఘవయ్య మా తాతగారి దగ్గర జీతగాడిగా పనిచేసేవాడు. చాలా దశాబ్దాల తరబడి పనిచేశాడు. వాడికి అప్పుడప్పుడు మా తాత అప్పులు ఇస్తుండేవాడు. సరే ఒక శుభముహూర్తంలో ఒక పెద్ద పంచాయితీ జరిగింది. ఆ పంచాయితిలో నువ్వు పది వేల రూపాయలు కట్టాలి, ఇవ్వమని చెప్పినాడు మా తాత. వాడికి చదువు సంధ్యలు లేవు. వాడికి తెలిసిన లెక్క ప్రకారం అప్పు పదిహేను వందల రూపాయలు మాత్రమే. దాని మీద పెద్ద రభస, పంచాయితీ జరిగిన తరువాత వాడు ఒక్కసారి పైకి లేచి తన పై పంచ విసిరి పడేసి ఇవిగో పదిహేను వందల రూపాయల కంటే ఎక్కువ ఇవ్వను ఏంచేసుకుంటావో చేసుకో. అని అన్నాడు. అతను అలా వెళ్ళిపోతే ఊరంతా దిగ్భ్రాంతి చెందిన సంఘటన. ఎప్పుడో నా చిన్ననాడు జరిగిన సంఘటన.


పాపినేని శివశంకర్

ధిక్కారం యొక్క మూలాలు వెతుక్కుంటూబోతే ఇట్లాంటి చాలా చాలా తగులుతాయి. ఒక భయంకరమైన హింస ధిక్కారానికి చాలా ప్రాథమికమైన చోదక శక్తి అయి వుంటుందని అర్థమైంది.

ఏ సామాజికపరమైన హింసగాని, వైయుక్తికమైన హింసగాని, వ్యవస్థాపరమైన హింసగాని, రాజ్యహింసగాని కారణాలుగా లేకపోతే ధిక్కారం అనే మాటతో కూడా మనకిది కూడా ఉండదు అని నాకు అర్థమైంది. ఆ విధంగా మనం చరిత్రలోకి వెళితే భారతదేశ చరిత్రలోనే బ్రహ్మాండమైన ధిక్కార స్వరాలు మనకు వినిపిస్తాయి. చార్వాకులు, లోకాయుతులు వేసిన ప్రశ్నలు అన్నీ ధిక్కార ప్రశ్నలే. వ్యవస్థ మీద, భావవాదంమీద మొట్టమొదటి తిరుగుబాటు భారతదేశంలో వాళ్ళే చేశారు. "ప్రతి భూత స్యదేహస్య పునారాగమనం కుతం" అని ప్రశ్నించారు. యావజ్జీవం సుఖం జీవే, జీవితాంతం సుఖంగా జీవించరా. పరలోకం అనేది వ్యర్థం, అవన్నీ కూడా ఎవడో చెప్పే మాటలు. ఈ శరీరానికి మళ్ళీ పుట్టుక ఎక్కడిది అని ప్రశ్నించారు. ప్రాథమికమైన ప్రశ్నలు, మౌళికమైన స్వరాలు భారతదేశ చరిత్రలోనే కనబడతాయి. భారతదేశంలో మొట్టమొదటి చారిత్రక వ్యక్తి బుద్ధుడే. పురాణ పురుషులు వేరు. వాళ్ళకయితే జీవితాలు ఉన్నాయో లేదో తెలియదు కాని, మొట్టమొదటి అత్యంత విశిష్టమైన వ్యక్తి, అత్యంత శాంతియుతంగా సమాజం మీద ధిక్కారస్వరాన్ని, ధిక్కార మార్గాని చూపినటువంటి వాడు బుద్ధుడు అని చెప్పి అని నేననుకుంటాను. సరే దైవత్వాన్ని ఆయన ధిక్కరించటం మొట్టమొదటి విషయం. అసలు దైవత్వాన్ని గురించి ప్రశ్నించటమే నిరర్థకమని ఆయన చెప్పాడు. అట్లానే యుద్ధాల గురించి కూడా.

శ్రీకాళహస్తీశ్వర మహత్యంలో నక్కీరుడు దేవుడినే ధిక్కరించిన కథ ఉన్నది. ధిక్కారానికి మూలాలు వెతుక్కొనే క్రమంలో ఇట్లాంటివి ఎన్నైనా సరే చూసుకుంటూ పోవచ్చు. నక్కీరుడు అనేవాడు ఒక రాజు ఆస్థానంలో ఉన్నప్పుడు ఆ

రాజు ఆస్థానానికి ఒక పేద బ్రాహ్మణుడు వస్తాడు. దిక్కులేనివాడు. ఆ రాజును ఏదో అడుక్కోవడానికి. అతనికి శివుడు ప్రత్యక్షమై నీవు ఈ పద్యాన్ని తీసుకుని వెళ్ళు అని పార్వతీ దేవిని వర్ణించే పద్యం ఒకటి రాసిచ్చాడు. పార్వతీ దేవి కేశపాశం సహజమైన సువాసన గలది అని రాశాడు. ఈ పద్యాన్ని తీసికెళ్ళి నీవు రాజసభలో చదువు నీకు బ్రహ్మాండమైన సత్కారం లభిస్తుందని అంటాడు. ఆ పద్యాన్ని తీసుకెళ్ళి చదివాడు. ఇది ఎట్లా సాధ్యం అని సభలో ఉన్న నక్కీరుడు ప్రశ్నించాడు. ఏ స్త్రీ కేశపాశమైన సహజమైన సువాసన ఎట్లా కలిగి ఉంటుందని వాడి ప్రశ్న. వాడి హేతువు అది. వాడికున్న జ్ఞానము అది. ఆ బ్రాహ్మణుడు వెనక్కు వెళ్ళి శివుణ్ణి ప్రశ్నిస్తాడు ఏమయ్యా! నీవు చెప్పిన పద్యం చదివితే సత్కారం లభిస్తుందనుకుంటే ప్రశ్నలు వేసి హేతువు చెప్పమంటున్నారని శివుణ్ణి అడుగుతాడు. సరే నేనే వస్తా పదా అని శివుడే బయలుదేరి వస్తాడు. అతడు మారు రూపంలో వచ్చి అదే పద్యాన్ని మళ్ళీ చదివితే నక్కీరుడు మళ్ళీ ధిక్కరించాడు. అప్పుడు శివుడుకి కోపమొచ్చి తన స్వరూపాన్ని చూపెట్టాడు. అప్పుడు నక్కీరుడు అంటాడు. మూడు కన్నులు కాదు కదా, నీకు తలచుట్టు ఎన్ని కన్నులు ఉన్నా ఈ పద్యం తప్పుకాదని చెప్పటానికి వీలుకాదు. నీ మాయలు ఇక్కడ కొనసాగవు అని ధిక్కరిస్తాడు. అయితే అది నిలబడింది. పాపం నక్కీరునికి శాపం ఇచ్చాడు అనేది వేరే విషయం. కాని వాడు దైవాన్ని నిలదీసి ధిక్కరించి ఒక ప్రశ్న సంధించగలిగాడు. మానవ హేతువుకు అందే జ్ఞానానికి ఒక ప్రశ్న వేసినాడు అని ఆనందం కలుగుతుంది. అట్లనే మనకు ఆ తరువాత కాలంలో వేమన ఒక ప్రసిద్ధమైన ఉదాహరణ.

వేమన ప్రామాణిక వ్యవస్థని, ప్రామాణిక కవితా రూపాల్ని సమర్థంగా వ్యతిరేకించలేదు. సమానంగా వ్యతిరేకించలేదు అని చెప్పి వెల్చేరు నారాయణ రావుగారు అన్నారుగాని దాన్ని నేను అంగీకరించను. ఖచ్చితంగా అతను ప్రామాణికమైన సామాజిక వ్యవస్థని, అంతే సమానంగా అప్పటికి ప్రామాణికంగా ఉన్న కవితా వ్యవస్థని అతడు ధిక్కరించాడు. తరువాత సమాజం మీద ప్రశ్నలు సంధించాడు. ముఖ్యంగా మత, దైవ విశ్వాసాల మీద అతడు వేసిన ప్రశ్నలకి ఎవరు కూడ సమాధానం చెప్పలేదు. ముహూర్తాలను గురించిగాని, యజ్ఞయాగాదులను గురించిగాని, తపస్సు గురించి గాని అతడు వేసిన ప్రశ్నలు చాలా ఉన్నాయి.


బొజ్జా తారకం

ఎవడు ఏ కాలంలో కూడా సమాధానం చెప్పలేనటువంటి ఇలాంటి ధిక్కారాలు చరిత్రలో మనకు చాలా కనబడతాయి. మళ్ళీ ఆధునిక కాలానికి వచ్చినట్లయితే ఒక్క హేతువాద భూమిక మీద బయలుదేరి హేతువాద సిద్ధాంతములో త్రిపురనేని రామస్వామి ప్రారంభించిన ఉద్యమంలో కూడా మనకు ఇలాంటి ధిక్కారాలు కనబడతాయి. ఒక ఉద్యమ రూపాన్ని తీసుకున్న హేతువాద ఉద్యమాలు, అవి కొంత కాలం అయినా తెలుగు సమాజంలో చాలా బలీయంగా సాగినాయి. ఆయన వేసిన ప్రశ్నలకు కూడా ఎంతో విలువ ఉన్నది. దైవత్వాన్ని గురించి, దైవ విశ్వాసాలను గురించి ముఖ్యంగా రాముడు కంటే రావణుడు గొప్ప అని ఆయన స్థాపించిన విధానంలో కూడా మనకు ఎంతో ఆశ్చర్యమైనఅంచనాలు కనబడతాయి. ఈ మధ్య కేరళ వెళ్ళొస్తే అక్కడ వాళ్ళు ఒక కళారూపాన్ని ప్రదర్శించారు. మామూలుగా రామాయణంలో ఉండే కథను బట్టి మనం శూర్పణక రాక్షస జాతికి చెందినది. దుర్మార్గురాలు, చాలా వికృతంగా ఉంటుంది అనుకుంటాం. వాళ్ళేం కల్పించారంటే, శూర్పణక మహాసౌందర్యవంతమైనది. రామున్ని చూసి మోహించి నన్ను వివాహం చేసుకోమని అడిగింది. అయితే రాముడు తిరస్కరించాడు. లక్ష్మణుడు ముక్కు, చెవులు కోసేశాడు. అప్పుడు ఆమె రాక్షసిగా మారుతుందన్నారు. అంటే స్వభావరీత్యా మహా సౌందర్యవతి అయిన, మహాసౌందర్యాత్మకమై మనసు కలిగి స్త్రీ తాను గాయపడ్డప్పుడు రాక్షసిగా మారుతుంది. తన నిజమై స్వభావం చాలా సాత్వికమైనది, సౌందర్య పూరితమైనది అని చెప్పి ఆ కళాకారులు కొత్త సృష్టి చేశారు. ఇట్లాంటి కల్పనలు లేదా కొన్ని హేతుబద్ధమైన ఆధారాల ద్వారా ఆ పురాణాలను, దైవవిశ్వాసాలను ఎదుర్కొన్న వాటిని కొన్ని ఉద్యమాలను మనం చూడాలి. తరువాత భావకవిత్వం లాంటి ఉద్యమాలు ఉద్యమాలు కావా అంటే నిజానికి సామాజిక సంబంధంలేనటువంటివి. ఉద్యమాలుగా భ్రమించేటువంటి కొన్ని ధోరణులు మాత్రమే. ఎందుకంటే సామాజిక ఆర్థిక వ్యవస్థతోగాని రాజకీయ వ్యవస్థతోగాని, ఒక సంస్థాగత ఖచ్చితమైన నిర్మాణం కలిగిన పద్ధతులు అందులోలేవు. అందుకనే వాటిలో ఎక్కడా ధిక్కార స్వరాలు కనబడవు. సమాజంలో సామరస్యంగా కనబడే ప్రేమకోసం ఒక వెంపర్లాట కనబడుతుంది. తరువాత అరసం వచ్చి, అభ్యుదయ భావాలు వచ్చేసేపాటికి అంతర్జాతీయంగా ఫాసిజానికి వ్యతిరేకంగా రష్యాకి అనుకూలంగా - భారతదేశంలో ఉన్నటు పెట్టుబడిదారీ వర్గాలకి, భూస్వామ్య వర్గాలకి వ్యతిరేకంగా ఒక గొప్ప భావజాలాన్ని సృష్టించింది. అభ్యుదయ రచయితల సంఘంగాని, అభ్యుదయ రచయితలుగాని దానిలో పనిచేసి కవిత్వం రాసిన శ్రీశ్రీగాని ఈ రకమైన చైతన్యాన్ని అందించే రచనలు చేశారు.

ఒక ప్రత్యామ్నాయ భావజాలాన్ని సృష్టి మొట్టమొదటి సారిగా ధిక్కారం అనేదానికి కల్పించిన ఘనత అభ్యుదయ రచయితల సంఘంకుగాని, అభ్యుదయ కవులకు గాని ఉన్నదని నేననుకుంటాను. గోడలను పగలగొట్టడమే మా పని అన్నాడు శ్రీశ్రీ. అలజడి మా జీవితం. ఆందోళన మా వూపిరి, తిరుగుబాటు మా వేదాంతం అన్నాడు. చరిత్ర రచనను కూడా చాలా కొత్త కోణాల నుండి వ్యాఖ్యానం చేశాడు. నిర్మాణాత్మకమైన దృక్పథాన్ని మనం అక్కడ చూస్తాం. జగన్నాథ రథచక్రాల్లోగాని దేశ చరిత్రల్లో చూస్తే ఒక ప్రత్యామ్నాయ చరిత్ర నిర్మాణానికి ప్రాతిపదిక అయిన అంశాలు కనబడతాయి. విధ్వంసకరమైన లక్షణాలు అందులో ఒకవైపు ఉండవచ్చు. కాని నిర్మాణాత్మకమైన లక్షణాలు కూడా మనకు అదే కవిత్వంలో కనబడతాయి. ఒక ప్రక్క ఆలూరి బైరాగిలాంటి వాళ్ళు కూడా కొంచెం అటు ఇటుగా రాశారు. ఆలూరి బైరాగి అనార్కిజం ధోరణితోటి రాశాడు. తాజమహల్ పడగొట్టండోయ్, రాయి రాయి విడగొట్టండోయ్ అన్నాడు. ఎందుకో మరి ఆ ప్రేమ సింబల్ మీద కొంత ద్వేషం కలిగింది. అయితే రాయి రాయి విడగొట్టిన తరువాత మరి ఏంచేద్దాం అంటే ఆయన సమాధానం చెప్పలేదు. ఎందుకు రాయి రాయి విడగొట్టాలి, తాజ్‌మహల్‌ను పడగొట్టాలి అంటే బైరాగి దగ్గర సమాధానం

కనబడదు. కాని చరిత్రలో తాజ్‌మహల్ నిర్మాణానికి రాళ్ళెత్తిన కూలీలెవ్వరు అని శ్రీశ్రీ ప్రశ్నించినపుడు నాకు ఖచ్చితంగా ఆ ధిక్కారం, ఆ సామాజిక చరిత్రను ధిక్కరించడం వెనుక తారీఖులు దస్తావేజులు ఇవి చరిత్రసారం కాదని చెప్పడం గొప్ప ధిక్కారం దానికి మూలం ఏమిటి? మౌళికమైనటువంటి శ్రామికశక్తిని మనం ఏ విధంగా అర్థం చేసుకోవాలి అనేవైపు మన ఆలోచనలు పోతాయి. ఈ విధంగా అభ్యుదయ కవులుగాని రచయితలుగాని ఒక కొత్త భావజాలాన్ని, ఒక ప్రత్యామ్నాయ ఆలోచనా విధానాన్ని వాళ్ళు ప్రసాదించినట్లుగా మనం చెప్పుకోవచ్చు.

అట్లానే ఈ మధ్యలో ధిక్కారం అనగానే తెలుగు సాహిత్యంలో దిగంబర కవులను చాలా ప్రత్యేకంగా చెప్పుకోవాలి. ఈ ధిక్కారం పూర్తి సామూహికమైనదని నాకు అనిపించదు. అది వాళ్ళు ఆరుగురు కలసి పుస్తకాలు వేసినా ఎక్కడిక్కడక వైయుక్తికమైనటువంటి ధిక్కారమే. ఒక వ్యక్తి సమాజంలో తాను అంగీకరించనటువంటి సామాజిక సంస్కృతిని, రాజకీయ సంస్కృతిని ఏ విధంగా అసహ్యించుకుంటున్నాడు. ద్వేషిస్తున్నాడు లేదా వాటిపై ఎలా ఉమ్మేస్తున్నాడు అని వాటిని మనం అర్థం చేసుకోవడానికి ఉపయోగపడతాయేగాని అది ఒక సామూహికమైన, వ్యవస్థాగతమైన స్వరూపం తీసుకుంటున్నట్టుగా మాత్రం అనిపించదు. వాళ్ళు ఒక భయంకరమైన అసహ్యాన్ని ప్రకటించారు ఈ సంస్కృతి మీద. నగ్నముని లాంటి వాళ్ళు అఖిలాంధ్ర దేశమా అజ్ఞానాంద సౌభాగ్యసీమా, నీ వేల వేల గొడ్రాలి సంస్కృతిని ఏ దేశమేగినా ఎందుకాలిడినా కారంతో ఫార్లించిన రోకళ్ళతో పట్టపగలు విషయించాలని ఉంది అని చెప్పి అన్నారు. ఎంత తీవ్రమైన నిరసన అందులో కనబడుతుంది! ఏ దేశమేగినా ఎందుకాలిడినా అని రాయప్రోలు సుబ్బారావు చెప్పిన పద్యం వింటే పరవశులౌతాం మనమంతా. కాని ఇది కాదు దానికి భిన్నంగా దేశంలో ఏం జరుగుతున్నది? అని ఆలోచనను అక్కడ ప్రేరేపిస్తున్నాడన్నమాట. పట్టపగలు నిజంగా విషయిస్తాడా అనేది అజ్ఞానమా. అది ఆ కవి యొక్క భావంలో ఉన్న తీవ్రత. హద్దులు దాటి తీవ్రత. సాధారణంగా అశ్లీలత అనే తీవ్రత. అట్లాటి తీవ్రమైన స్వరం దిగంబర కవిత్వంలో కనబడుతుంది. చెరబండ రాజు వందేమాతర గీతం "ఆకాశం వెక్కివెక్కి ఏడుస్తుంది అంటాడు. ఇట్లాంటి వాటిలో సమాజాన్ని కొత్త కొత్త రీతుల్లో ఎట్లా అర్థం చేసుకోవాలి? ఎవరు ఎవరి మీద ధిక్కరిస్తున్నారు. ఏ విలువలను ఎవరు కాపాడుతున్నారు. అటు భూస్వామ్య విలువలకు వ్యతిరేకంగా పాలేర్లు, కూలీల తరపునుంచి సమాజాన్ని ఏ విధంగా అర్థం చేసుకోవాలి అనే ఒక పాజిటివ్ అవుట్‌లుక్ కూడా దిగంబర కవిత్వంలో అక్కడక్కడా ముఖ్యంగా చెరబండరాజు కవిత్వంలో కనబడుతుంది. ఇట్లాంటి దిగంబర కవిత్వాన్ని అర్థం చేసుకుంటూ ఆ తరువాత దశకు వచ్చేనాటికి కొన్ని కొన్ని అపస్వరాలు, కేవలం నిరసనలు ధ్వనించే కవిత్వం కనబడుతుంది. 'ఆకలేస్తుందా నీకు, ఆంధ్ర సంస్కృతి మహోజ్వలమైంది, తినడానికి తిండి లేదా నీకు, తెలుగుభాష ఇటాలియన్ ఆఫ్‌ది ఈస్ట్. పోలీసులు నిన్ను చితగ్గొడుతున్నారా మనకు అంతర్జాతీయ ఖ్యాతి అవసరం. నన్నయ గొప్పవాడు, నాకు ఆకలేస్తుంది. క్రిష్ణదేవరాయల రోజుల్లో... ఒరే నాకు ఆకలేస్తుంది, ఏ దేశమేగినా ఎందుకాలిడినా, నీయమ్మ నాకు ఆకలేస్తుంది రా' అన్నాడట. సహజమైన ఆకలిని తీర్చకుండా సమస్యలకి పరిష్కారాలను చూడకుండా ఏవేవో భావవాద ధోరణుల తోటి దేశం గొప్పది, దేశం కోసం పోరాడాలి, ప్రాచీన సంస్కృతి గొప్పది, మన భాషగొప్పది అంటే ఆ గొప్పలన్నీ ఎప్పుడు చెప్పుకోవాలి? భౌతికమైన సమస్యలు తీరిన తర్వాత చెప్పుకోవాలి. అప్పుడు ఆ భావాల వైపు మనం ఆలోచిస్తాం. ఈ ప్రాథమికమైన సమస్యలు ఉన్నంతవరకు ఈ ఆదర్శాలు ఆశయాలు కబుర్లుగా మాత్రమే అనిపిస్తుంటాయి.



చలసాని ప్రసాద్

ఆ తరువాత విరసం ఆవిర్భావంతో ధిక్కారానికి వ్యవస్థీకృతమైన సాహిత్య రూపం దొరికిందని నేను అనుకుంటాను. మొట్టమొదటి వ్యవస్థీకృతమైన ఒక ధిక్కార రూపం విరసం సంస్థ అని నా అభిప్రాయం. ఎందుకంటే అప్పటి దాకా అరసం, అభ్యుదయ రచయితల రచనల్లో కూడా ఖచ్చితమైన రాజ్య ధిక్కారం ఎక్కడా కనబడదు. కవిత్వం గురించిగాని మరొకటి దాని గురించిగాని బందూకం, సంధ్యారాగం, సింధూరం రక్తచందనం ఇట్లాటి మాటలు, ఒక అమూర్తమైన భావాలే కనబడతాయి గాని మూర్తమైన రూపాన్ని లేదా ఒక స్పష్టమైన దోపిడీ విధానం మీద తిరుగుబాటు మనకు అక్కడ కనబడదు. శ్రీకాకుళం, నక్సల్‌బరి పోరాటం నేపధ్యంలో వచ్చిన సంస్థ కాబట్టి ఆకాలంలో ఆ భావజాలంతో రాసిన కవుల కవిత్వంలో ధిక్కారమనేది కనబడుతుంది. వాళ్ళ కవిత్వంలో నిర్దిష్టమైన రాజకీయ ఆర్థిక స్వభావం విరసం ఆవిర్భావంతో వ్యక్తమైందని చెప్పి అనిపిస్తుంది.

అందుకనే వ్యవస్థను ఒకవైపు ధిక్కరిస్తూ, రాజ్యహింసను వ్యతిరేకిస్తూ ఒక ప్రత్యామ్నాయ సంస్కృతిని కూడా ముఖ్యంగా శ్రామిక సంస్కృతిని కూడా అది ప్రతిపాదించగలిగింది. అలాంటి ధిక్కారానికి అవసరమైన అత్యంత ధైర్యాన్ని, నిబ్బరాన్ని కూడా మనకు ఇవ్వగలిగారు. "ప్రజలను సాయుధం చేస్తున్న రెవల్యూషనరీ నేటి కవి" అని ఒక కొత్త నిర్వచనం మనం అప్పుడే చూడగలిగాం. అట్లానే మృత్యువునే పరిహసిస్తూ శత్రువునే ఎదిరిస్తా అన్నాడు చెరబండరాజు. ముంజేతిని ఖండించిన నా పిడికిట కత్తి వదలనన్నాడు. మృత్యుశయ్య మీద ఉండి 1980 తరువాత రాసిన కవిత అది. ఉరికంబం మీద నిలిచి ఊహాగానం చేసెద. అని రైతాంగం పట్ల నిలబడి నిబద్ధతతోటి కవితాగానం చేయడమనేది 'వర్రెంక చెట్టుకింద' మొదలుకొని విప్లవకవిత్వంలో కనపడే దృశ్యం.

విప్లవ పెనుజ్వాలల్లో మహామనిషి లేచును అని శివసాగర్ కవిత్వంలో కొంత రొమాన్సు ఉంటుంది. కొత్తగా కవిత్వం రాసేవాళ్ళుగాని, వినేవాళ్ళుగాని, చదివే వాళ్ళుగాని అద్భుతంగా పరవసించిపోతారు.

'శాంటియాగో' ఒక ఉత్తేజకరమైన అవేశ ప్రవాహంలో కొట్టుకుపోతాం. అమ్మా నను కన్నందుకు ఊగిపోతాం. విలుకాడు గురించి రాసినా తోటరాముడు గురించి రాసిన ఇట్లాంటి ఒక ఉద్వేగపూరితమైనవిప్లవాభివందనాలు అంటే కవితాత్మకత ఇందులో ఈ ధిక్కారపు వెనుకవైపు కనబడుతుంది. అదే దానికి ప్రక్కనే ఒక స్పష్టమైన నిర్వచన ప్రాయమైన లక్షణాలు కనబడతాయి. "కవిత్వం ప్రభుత్వం అక్కర లేని ప్రజ" వివి అంటాడు. ఇది కవిత్వానికి ఒక గొప్ప నిర్వచనం.

ప్రభుత్వం అక్కరలేని ప్రజ కవిత్వం, రాజ్యాన్ని రద్దుచేసే బహిరంగ రహస్యం. కవిత్వంలో రహస్యాలు లేవు. కవిత్వంలో అవి వున్నాయి. ఇవి ఉన్నాయి అని జైల్లో బెడుతున్నారు. కేసులు బెడుతున్నారు. కుట్ర కేసులు పెడుతున్నారు. ఇట్లాంటివన్నీ కూడా బద్దలు కొడుతూ వస్తున్నారు. వాటన్నింటిలో రహస్యాలేమిలేవు అని, కవిత్వం రాజ్యాంగంను రద్దు చేసే బహిరంగ రహస్యం అని చెబుతున్నాడు. కాబట్టి దానికి నిబద్దతతో కవులుగాని, రచయితలుగాని ఎంతోమంది విరసం పక్షాన పి.మోహన్ దాకా కనబడతారు. వివి కళ్యాణరావులను జైళ్ళోపెట్టినప్పుడు గుంటూరులో పెద్దసభ పెట్టినాం. అప్పుడు ఒక ఆలోచన కలిగింది. అదేవిటిరా మొద్దుశీను లాంటి వాళ్ళు బయటవున్నారు. మరి వాళ్ళేంటి లోపల వున్నారు అని ఒక ప్రాథమిక ప్రశ్న వచ్చింది నాకు కాబట్టి ఈ దేశంలో లోపల ఉండాల్సిన వాళ్ళు బయట, బయట వుండాల్సిన వాళ్ళు లోపల ఉంటున్నారనే సత్యం నాకు అర్థమయింది. కాబట్టి అదే సమయంలో ఇంకొక ఆలోచన కూడా తోచింది. బహుశ ఈ వరవరరావే లేకపోతే బహుశా ఈ కళ్యాణరావు లేకపోతే బహుశా ఈ వంగపండు గద్దరు, గోరటి వెంకన్నలాంటి వాళ్ళు లేకపోతే ఈ తెలుగు సమాజం ఎట్లా ఉండేది అని ఆలోచిస్తే చాలా అంధకారాభూయిష్టంగా నా కనిపించింది. కొంతవరకైనా సరే ఒక వ్యక్తి వ్యవస్థను ధిక్కరిస్తున్నాడు. కొన్నేళ్ళపాటు జైళ్ళో వుండని, ఏడాది ఉండని నాకైతే అభ్యంతరం లేదు. ఆ బాధ ఆయనదేగదా! కాని మనం అర్థం చేసుకోవాల్సింది ఒక వ్యక్తి ఒక భావానికి కట్టుబడి, ఒక ఆశయానికి కట్టుబడి అతడు జైలుపాలు అవుతున్నాడు. ఎలాంటి నిర్బంధాన్నైనా ధిక్కరిస్తున్నాడు. మృత్యువునే ఎదిరిస్తున్నాడు అంటే దానిని చూసి మనం చాలా నేర్చుకోవాలి అని అర్థమైంది. మన భయాలని, మన ప్రాథమిక దుర్మార్గమైన ఆలోచనలను, మన పశ్చాత్తాపాలన్నీ కూడా వొదిలేసుకోవాల్సిన ఎన్నో సంధర్భాలు ఇవాళ మనకు ఉన్నాయని అనిపిస్తుంది. అట్లాగే విరసానికి బైటగాని, ప్రక్కప్రక్కనే గాని చాలా చిన్న పెద్ద రకరకాల ఉద్యమాలు వచ్చేసినాయి. సారా వ్యతిరేక పోరాటం ఒక బ్రహ్మాండమైన సింబల్ ధిక్కారానికి. అది గొప్ప పోరాటంగా మనం భావించాలి. అట్లాగే విద్యుత్ ధరలకు వ్యతిరేకంగా జరిగిన పోరాటం కూడా బ్రహ్మాండమైన ఊరేగింపు, లాఠీచార్జీలు, కాల్పులు వాటిని గురించి కూడా మాట్లాడాలి. శివారెడ్డి రాశాడు ఒక చోట, "రాయి ఎంత కరిన సుందరంగా ఉంటుందని నాకు ఇప్పుడే కదా తెలిసిందని" అంటాడు. రాయి తీసుకొని వేశాడన్నమాట. ఎంత గొప్పగా దెబ్బతగిలిందా అని మనం ఆనందిస్తాం. మనం రాయి తీసుకొని ఎవడిమీద వేశాం? రాజ్యం మీద వేశాం. రాజ్యం మహాశక్తివంతమైంది కావచ్చు, అది నిన్ను ఏమైనా చేయగలిగింది కావచ్చు. కాని నీవు ఒక్క రాయి తీసుకొని వేయటం అంకురం సినిమాలో వాడు చూయించినట్లుగా అది గొప్ప సింబల్‌గా మనం అర్థం చేసుకోవాలి. అది గొప్ప ధిక్కారంగా మనం అర్థం చేసుకోవాలి. ఇట్లాంటి పోరాటాలు మన కళ్ళ ముందు చాలా జరుగుతున్నాయి. మరి అట్లనే రైతాంగ పోరాటాలు. 1988 ఆ ప్రాంతం నుంచి ఆంధ్రదేశంలో ఎక్కడ చూసినా ఆత్మహత్యలు మొదలయ్యాయి. మా గుంటూరు ప్రకాశం జిల్లాల్లో 30 మంది పత్తిరైతులు అప్పట్లో ఆత్మహత్యలు చేసుకున్నారు. పురుగుకు తట్టుకోలేక, ధరలు లేక వాళ్ళు ఆత్మహత్య చేసుకున్నారు. ఆ తరువాత అది మొదలుకొని అన్ని చోట్ల వేల మంది రైతులు ఆత్మహత్యలు చేసుకున్నారు. వీటన్నింటి వెనుక జీవితాన్ని భరించలేని తనం, జీవితాన్ని ఒదులుకొని మరెక్కడికో పోవలసిన పరిస్థితి ఎంత దుర్మార్గమైందో మనం అర్థం చేసుకోవాలి.



చెంచయ్య

వ్యవస్థాగతమైనటువంటి హింస దాని వెనుక వుండి వుంటుంది. మనిషిని బతికించుకోలేని ఒక సామాజిక హింస ఏదో పైనుండి దిగుబడి అవుతున్నది. అది వాళ్ళను ఈ రకంగా పీడిస్తున్నది. రాయలసీమ రైతులూ చివరకు ఆత్మహత్యకు పాల్పడ్డారంటే మీరు ఆలోచించండి. ఎప్పుడూ చెక్కుచెదరని వాళ్ళు 1990లలోకి వచ్చేసరికి వాళ్ళు కూడా ఆత్మహత్యల దారికి వచ్చేసారు. పైగా ప్రభుత్వం ఏం చెబుతుంది? వారు ఎక్స్‌గ్రేషియా కోసం ఆత్మహత్య చేసుకున్నారు అని. అది దుర్మార్గమైన పరిహాసం. ఎక్స్‌గ్రేషియా కోసం ఎవడైనా ప్రాణాలు పోగొట్టుకుంటాడా, డబ్బుల కోసం జీవితాన్ని ఒదులుకుంటాడా, అది ఎంత క్రూర పరిహాసం. కాబట్టి ఎన్నెన్నో రైతాంగ సమస్యల నుండి ధిక్కారంగా వచ్చిన కవితలు ఉన్నాయి. "మట్టిని నమ్ముకున్న బతుకు మట్టిలోనే పాలి అయినప్పుడు అది ఖచ్చితంగా హత్య చేసింది ఎవరని నేను ప్రశ్నిస్తాను". అని ఎన్నెన్నో రైతాంగ ఆత్మహత్యలపై వచ్చిన ధిక్కార కవితలు రైతు కవితా సంకలనంలో మీరు చూడవచ్చు. రైతాంగ పోరాటాలని గురించి అద్భుతమైన గేయాలు వచ్చినాయి సిద్దారెడ్డి ఒక అద్భుతమైన దీర్ఘ కవితరాశారు. ఎస్.కె.లాల్ బనో గులామిచోడో బోలో వందేమాతరం అని చాలా అద్భుతమైన ఉద్రేకాత్మకమైన సుదీర్ఘ కవిత రాశాడు. ఇవన్ని కూడా రైతాంగ వర్గాన్ని బలపరుస్తూ వాళ్ళ సమస్యలు తమ ముందు పెట్టుకొని కవిత్వం రాసిన గొప్ప వ్యక్తీకరణ గాంచిన చెప్పవచ్చు. ఇవాళ హైటెక్ క్షేత్రం యుద్ధ క్షేత్ర మైనది అని ఒక కవి అన్నాడు. ఇదం క్షేత్రం ఇదం శాస్త్రం అని ఎలుగెత్తి న చోట ఇప్పుడు టెర్మినేటర్ అనే విత్తనం ఉంటుంది. ఇప్పుడు బి.టి విత్తనం అనేది వచ్చింది. అయితే వీటన్నింటి పరిష్కారాలు మాత్రం ఇప్పటికీ ఈ పోరాటాలకు దొరకనే దొరకటంలేదు. మీకు ఊరూరా కంప్యూటర్లు ఇస్తామంటుంది గవర్నమెంటు. మీకు సమాచారం చాలా అందుబాటులో వుంటుందని అంటుంది. మీరు ఎక్కడైనా ఏవ దేశంలోనైనా మీ పంటలు అమ్ముకోవచ్చు. మీకు కావలసిన రోడ్లు వేశాం అంటుంది ప్రభుత్వం. రైతు ఏమంటున్నాడంటే అయ్యా! కంప్యూటర్ నుంచి బియ్యం రావు కదా అని ప్రశ్నిస్తున్నాడు. బియ్యాన్ని పండించే విషయాన్ని ప్రాథమికంగా పట్టించుకోగలరా! కంప్యూటర్ ఉన్నా లేకపోయినా దాని వల్ల కలిగే ప్రయోజనం వేరు, భౌతికమైన సమస్యకు పరిష్కారం ప్రయత్నించు అని రైతాంగం నుంచి అనేక ప్రశ్నలు వస్తున్నాయి. అటు కాల్దారి నుంచి గాని టంగుటూరు పొగాకు రైతుల గురించి గాని ఏ ప్రాంతంలో చూసినా పరిష్కారం మాత్రం మనకు కనపడలేదు గాని హింస మాత్రం ప్రకటితంగా మనకు పైకి కనబడుతుంది.

ఆ తరువాత గుజరాత్ గాయం సందర్భంలో 'వేల వేల గుజరాత్ శవాల మీద కప్పిన కఫన్ నేను' అంటుంది కవయిత్రి షాజహాన. ఎంత మంది గుజరాత్ గాయం వలన కవులయ్యారు. ఎంత మందికి ఒక కొత్త వ్యక్తీకరణ దొరికింది. వాళ్ళు మళ్ళీ సజీవులయ్యారు. అంటే ఒక సమిష్టి తనాన్ని నేర్పుతుంది. అప్పటి దాకా రకరకాల భావజాలాలకు చెందిన

వర్గాలకు చెందిన వారు ఒక్కసారిగా ఒకే వేదిక మీదకు రావటానికి 'గుజరాత్ గాయం' కూడా ఒక దోహదకారి అయ్యింది. అట్లా ముస్లిం ఐడెంటిటి క్రైసిస్ దగ్గిరి నుంచి రకరకాల అస్తిత్వవాదాలు, స్థానీయమైన వాదాల ధిక్కార మూలాలను మనం ఆలోచించుకోవచ్చు.

ఈ ధిక్కార వాతావరణాన్ని అర్థం చేసుకొని ఎట్లాంటి సమిష్ట పోరాట మార్గాలలోకి మనం దిగాలి. బాలగోపాల్ జల్‌జలాకు వెనుక మాట రాశాడు. దాంట్లో ఆయన ఏమని సిద్ధాంతీకరించాడంటే - రకరకాల గుంపులు. అంటే ఈ ప్రత్యేకమైన స్థితుల్లో ఉన్న వాళ్ళ ఆలోచనలన్నీ కూడా చిట్టచివరికి ప్రత్యేకంగా ఉండిపోతాయి. పీడిత వర్గాలన్ని కలసి ఒక వర్గాన్ని కూలదోసి ఒక గొప్ప ప్రత్యామ్నాయాన్ని స్థాపించడమనేది చాలా అరుదుగా సాగుతుందని, దాదాపు అసాధ్యం అని, విడివిడి వ్యక్తీకరణలు మాత్రమే దాదాపుగా మనకు మిగులుతాయి అని, వాటి పరిష్కారాన్ని విడివిడిగా వెతుక్కుంటే మంచిదని అన్నట్టుగా ఆయన ఒక మాట రాశాడు. బాలగోపాల్ గొప్ప మేధావి. ఆయన రచనలు చదివి నేను స్ఫూర్తి పొందినవాన్ని, అయితే ఇలాంటి వాదాలు, అభిప్రాయాలు ఆధునికానంతర వాదం వైపుకు దారితీస్తున్నాయి. పోస్టుమాడర్నిజం ఇట్లాంటివి చెబుతుంది. నీవు వ్యక్తివి వ్యక్తివే. విడివిడిగానే ప్రపంచాన్ని చూడు, విడివిడి ద్వీపాలు, ద్వీపఖండాలు ఈ ప్రపంచం అంతటా ఉన్నాయి. ఇప్పటిదాకా ఉన్న చరిత్రలు అంతమై పోయినాయి. ఇప్పటిదాకా ఉన్న భావజాలాలు అంతమైపోయినాయి. కొత్త ఆలోచనల నుంచి నీ ధిక్కారం నువ్వు చేయమని చెపుతుంది. నీ ధిక్కారం నీవు చేసి, వాడి ధిక్కారం వాడు చేసి, నా ఏడుపు నేను ఏడిస్తే జరిగేది ఏమిటి? ఇవన్ని సమిష్టిగా కలిసి ఒక ముక్తకంఠంగా కాకపోయినప్పుడు దానికి ప్రయోజనం ఎట్లా చేకూరుతుంది. కాబట్టి ఆధునికానంతరవాదం అంటే అది ప్రపంచీకరణ యొక్క ముద్దు బిడ్డగా ముందుకు వచ్చిన వాదంగా మనం అర్థం చేసుకోవాలి. అది మనుషుల్ని కలవనీయని వాదంగా అర్థం చేసుకోవాలి. అది జీవితాన్ని సమిష్టిగా కాకుండా ముక్కలు ముక్కలుగా చూసే వాదంగా మనం అర్థం చేసుకోవాలి. కాబట్టి స్త్రీలు కావచ్చు, దళితులు కావచ్చు. వ్యక్తీకరణలు దాటి ఒక సమిష్టి పోరాటంవైపు రావాల్సిన అవసరం ఉంది. 'మనువు నోట్ల ఉచ్చ పోస్తానన్నాడు' దళితకవి. అది చాలా గొప్ప ధిక్కారం. ఒక రకంగా అసహ్యాపూరితమైన వ్యక్తీకరణ. కాని మను ధర్మాలను సహించలేక పోతున్నాడుకవి. ఒక ఎక్స్‌ప్రెషన్ ద్వారా నీవు దాన్ని ద్వేషించే నీ విధానాన్ని నీవు వెతుక్కుంటావు. అయితే వాటి పరిధిని దాటి, మరికొన్ని సమాన భావనలు కలిగిన వర్గాల్ని కూడా నీవు చేకూర్చుకొని సమిష్టి పోరాటాలవైపు సాగక పోయినట్లయితే ఎవరిగోల వాడిదే అని చివరికి మిగిలిపోయే ప్రమాదం ఉన్నది. అంతేగాకుండా రాజ్యాన్ని గురించి మనం ఆలోచించేటప్పుడు హింస ఎంతగా పెరిగిపోతూ వుంటే అంతగా రాజ్యం బలహీన పడుతుందని చెప్పి ఒక నిర్ధారణకు మనం వస్తున్నట్లుగా అనిపించింది. ధిక్కారం ఎంత బలంగా ఉంటే అంత ఎక్కువగా రాజ్యం హింస ప్రయోగిస్తుంది. అయితే మనల్ను చూసి రాజ్యం భయపడుతుందని మాత్రం నేననుకోను. ధిక్కారం ఎంత బలంగా ఉంటే హింస అంతే బలంగా వాడు ప్రయోగించటానికి చూస్తాడు. ఏదో ఒక దశలో దీన్ని అదో దాన్ని ఇదో అధిగమించే పరిస్థితి, అధిగమించే అవకాశం కోసం మనం ఎదురుచూద్దాం. అంతేగాని ప్రతీప శక్తులను మనం తక్కువగా అంచన వేసే ఒక ప్రమాదంలో పడిపోయామేమో అనిపిస్తుంది. కాబట్టి సమిష్టి పోరాటాల ద్వారా మనం అలాంటి అడ్డంకులు అతిక్రమించి ప్రపంచీకరణ వల్ల వస్తున్న, సామ్రాజ్య వాదం వల్ల వస్తున్న ప్రమాదాలు ఎదుర్కోగలం. రోడ్లు లేని గ్రామాల్లో రోడ్లు కనబడుతున్నాయి. దేనికి కనబడుతున్నాయి? నీ కోసం రోడ్లు వేశాడా! గ్రామాల్లోని సంపదను తరలించుకుపోవడానికి రోడ్లు వేశాడు. మరి నీ కోసం అక్కడ పానీయాలు పెట్టాడా! మంచి నీళ్ళు దొరకని లక్షల గ్రామాల్లో కోకోకోలాలకు మాత్రం కొదువలేదు.



వంగ పండు ప్రసాద్

అంటే మంచి నీళ్ళకు దిక్కులేదు. లాభాలకోసం ఎవడో ఎక్కడో తయారు చేసినవి మాత్రం ఇక్కడ పెడుతున్నాడు: భూముల్లో ప్రజలు ఎందుకు నిరాశ్రయులు అవుతున్నారు. ప్రాజెక్టులు కింద భూములమ్ముకొని భూములు పోగొట్టుకొని, పొట్టచేత పట్టుకొని పట్టణాలకు చేరుతున్న వాళ్ళు ఒక వైపువుంటే యింకో వైపున భూములకు విలువ పెరుగుతున్నది. పట్టణాల్లో భూముల విలువ పెరుగుతున్నది. గుంటూరులో ఎక్కడ చూసినా ఎకరం కోటి రూపాయలకు తక్కువ లేదు. అట్లాంటి పరిస్థితిలో మనం ఉన్నాం. అయితే ఇది ఎందుకు జరిగింది. భూమి యొక్క ఉత్పత్తి విలువ పెరిగినందువల్ల భూముల రేట్లు పెరిగినాయా! ఎక్కడనుంచో సాఫ్ట్‌వేర్ నుంచీ, లేదా అమెరికానుంచో వచ్చిన డబ్బు వలన ఈ భూముల రేట్లు పెరుగుతున్నాయి. అంటే సంపద పెరుగుతుంది, సెన్సెక్స్ పెరుగుతుంది, ఒక వైపు బ్రహ్మాండంగా వుంది. సరే ఆ తర్వాత కూలిపోయింది అది వేరే సంగతి అనుకోండి. ఇలాంటి గొప్ప గొప్ప సూచనలు వాళ్ళు చూపిస్తున్నారు. చాలా గొప్ప అభివృద్ధి జరుగుతుందని వాళ్ళు చెపుతున్నారు. కాని ఈ అభివృద్ధి వెనుక రోజుకు 10 రూపాయల కూలి దొరకని కూలీలు కూడా మన పల్లెల్లో ఉన్నారు. మరి గంటలు లెక్కన నెలలలెక్కన లక్షలు లక్షలు సంపాదించే సాఫ్ట్‌వేర్ ఉద్యోగులు ఉన్నారు. సంపద పెరుగుతున్నది గాని, సంపద పెంచుకున్న వాళ్ళు పెరుగుతున్నారు. సంపద పెంచుకుంటున్న వారికి సంపద లేని వారికి మధ్య చాలా అంతరం పెరుగుతున్నది. ఈ సత్యాన్ని మనం గమనించాల్సిన అవసరం ఉంది. ఈ సందర్భంలో అట్లాగే వస్తు వినియోగ సంస్కృతివల్ల, మనిషికి మనిషికి మధ్య ఎడం పెరిగిపోతున్నది. గ్లోబల్ విలేజ్ అని మనం అంటున్నాం. కాని మానవ అంతరం ఎందుకు పెరుగుతున్నది. సెల్‌ఫోన్‌లు వచ్చేసినాయి. మనిషి మనిషికి దగ్గరయినాడు. కాని హృదయ పరంగా చూసినట్లయితే, ఆత్మీయంగా చూసినట్లయితే, మనిషికి మనిషి ఎందుకు దూరమైనాడు. ఇలాంటి విషయాలన్నీ కూడా మనం ఆలోచించాల్సిన అవసరం ఉంది. మళ్ళీ మూలాల్లోకి వెళ్ళినట్లయితే ఒక ఆధిపత్యం ధిక్కారానికి మూలం అని నాకు అనిపిస్తుంది. ధిక్కారం యొక్క స్వభావం స్వేచ్ఛ అయివుంటుంది. ధిక్కారం యొక్క అంతిమ లక్ష్యం ధిక్కారం యొక్క అవసరం కాకుండా పోవడమే అట్లా విరసం సంస్థ అంతిమ

ఆశయం ఏదైే ఉండాలని నేననుకుంటానంటే విరసం యొక్క ఉనికి లేకుండా పోవడమే. సంస్థ ఏదో పారిపోవడం అనే అర్థంలో కాదు. దాని అవసరం లేకుండా పోయే సమాజం రావాలి. విరసం కవులో లేదా అభ్యుదయ కవులో, లేదా పోరాట కవులో పోరాటం అవసరం లేని సమాజం రావాలి, ధిక్కరించనవసరం లేని సమాజం రావాలి అనుకుంటారు. దానికోసం మనం అందరం ప్రయత్నిద్దాం, స్వప్నిద్దాం.

## 11వ తేది సాయంకాలం 3 గంటలకు

## ధిక్కార భూమికపై విరసం

అధ్యక్షత : **దేవీప్రియ :**

ధిక్కార భూమికపై విరసం అనే అంశం ఒకరకంగా విరసం చరిత్రే. సాహిత్యంలోకి విప్లవ దృష్టితో ధిక్కారాన్ని తీసుకొని వచ్చింది. ఉదయం నుండి ధిక్కార మూలాలు, వ్యక్తీకరణ అనే అంశం మీద, దాన్ని ప్రాచీన సాహిత్యంలో నుండి ఆధునిక సాహిత్యంలో ఎట్లా ధిక్కార వ్యక్తీకరణ ఉన్నదనే అంశం మీద పాఠాలు విన్నాం. వీటన్నింటినీ ఉన్నత స్థాయిలోకి తీసకపోవడానికి విరసం వచ్చింది. ధిక్కారాన్ని విప్లవ భూమికగా తీర్చిదిద్దింది.

ఈ అంశంపై **ఎన్.వేణుగోపాల్** విస్తారంగా మాట్లాడారు. బండెనక బండి కట్టి. యాదగిరి, మగ్దూం, సుబ్బారావు పాణిగ్రాహి, చెరబండరాజులు తెలుగు సమాజంలో, వేర్వేరు సందర్భాల్లో, వేర్వేరు ఆధిపత్య వ్యవస్థలకు వ్యతిరేకంగా పెల్లుబికిన ధిక్కారానికి సంకేతాలు అని చెప్పారు. తెలుగు సమాజ సాహిత్యరంగాల్లో వీళ్ళు అందించిన ధిక్కార వారసత్వాన్ని విరసం పుణికిపుచ్చుకున్నదని వివరించారు. విరసం ఆవిర్భావమే ధిక్కారం. తెలుగు సాహిత్యంలో గడ్డగట్టిపోయిన ప్రజావ్యతిరేక ధోరణులను పెళ్ళగించటం, దిగంబరుల ధిక్కారానికి నక్సల్బరీ శ్రీకాకుళ పోరాటం ప్రేరణతో నిర్మాణాత్మక విప్లవ చైతన్యంతో కూడిన ధిక్కారాన్ని అందించింది. అరసం సాహిత్యంలోకి తెచ్చిన సంప్రదాయాన్ని ఉన్నత స్థాయిలోకి తీసకపోయింది విరసం. యింతవరకే చెబితే ధిక్కారానికి విరసం కల్పించిన భూమిక గురించి స్పష్టంగా చెప్పినట్టుకాదు. సమాజంలో విప్లవం అవసరమైన శ్రామిక ప్రజల ధిక్కారాన్ని, పోరాటాలను సాహిత్యంలోకి తీసుకొని వచ్చింది. సాహిత్యం పీడిత ప్రజల పోరాట సాధనం అని చెప్పింది అంటూ విరసం సమాజంలోని ధిక్కార వ్యక్త రూపాలన్నిటికీ సాంస్కృతిక వ్యక్తరూపాన్ని యిచ్చిందని వివరించారు. అయితే విరసం తొలిరోజుల్లో ధిక్కారం గురించి అర్థం చేసుకున్న దానికి ఒకే క్రమంలో దాని విస్తృత రూపాలను చూచి, అర్థం చేసుకొని, వాటి ప్రాధాన్యతలను గుర్తించి తనలోకి స్వీకరించే అవగాహన పెరుగుతున్నదని వివరించారు. వ్యవస్థీకృత విలువల పట్లా, విధివిధానాల పట్లా వ్యక్తిస్థాయిలో, బృందస్థాయిలో భిన్న స్థాయిల్లో ఉండే ధిక్కారాన్ని ఒకచోటికి చేర్చవలసిన అవసరం ఉన్నదని... సుదీర్ఘమైన తన ప్రసంగంలో విశ్లేషించారు.



కన్నబిరన్

ఈ అంశం తర్వాత 11వ తేదీ సాయంకాలం ఆరుగంటలకు ఆధిపత్య సంస్కృతికి వ్యతిరేకంగా రచయితల, కళాకారుల, మేధావుల ప్రదర్శన జరగవలసింది. కానీ పోలీసులు అనుమతి నిరాకరించారు. దానితో అక్కడే బహిరంగ సభ ప్రారంభమైంది.

బహిరంగ సభకు విరసం కొత్త కార్యదర్శి కామ్రేడ్. వి. చెంచయ్య అధ్యక్షత వహించారు. 1998 నుండి విరసంలో ఉన్న కార్యనిర్వాహక వర్గం, కార్యవర్గం స్థానంలో సర్వసభ్యసమావేశం కార్యదర్శి, కార్యవర్గం అనే నిర్మాణాన్ని తిరిగి తీసుకొని వచ్చింది.

ఈ సభలో మాట్లాడానికి ప్రత్యేకంగా రావాల్సిన యిందిరా గోస్వామి 'ఉల్ఫా చర్చ'ల వల్ల రాలేకపోయారు. బహిరంగసభలో కొత్తకార్యదర్శి తీర్మానాలు చదివారు. దాశరథి రంగాచార్య, నారాయణస్వామి, ప్రొ.కె.విజయకుమార్‌లు పంపిన సందేశాలు చదివారు. తర్వాత ప్రముఖ విప్లవకళాకారుడు కామ్రేడ్ కానూరి సందేశం యిచ్చి ప్రసంగించారు, పాటలు పాడారు. 'విరసం చారిత్రక పత్రాలు' పుస్తకాన్ని కన్నబిరన్ ఆవిష్కరించారు. ఆహ్వాన సంఘం అధ్యక్షులు తారకం 'కవిత్వంపై గెరిల్లా' అనే ఉత్తర తెలంగాణ గెరిల్లా కవుల కవితల సంకలనాన్ని ఆవిష్కరించి ప్రసంగించారు. వరవరరావు, కళ్యాణరావు, చలసాని ప్రసాద్ బహిరంగ సభనుద్దేశించి మాట్లాడారు.

గద్దర్, వంగపండు బృందం రాత్రి 11గంటలదాకా సాంస్కృతిక ప్రదర్శనలు యిచ్చింది. ఈ రెండురోజుల సభలు నిషేధానంతర విరసం భవిష్యత్‌లోకి విప్లవోత్సాహాన్ని నింపాయి. విరసం తన లక్ష్యప్రకటనకు అనుగుణంగా విప్లవోద్యమంలో సాహిత్య సాంస్కృతిక రంగాల్లో ప్రజల మనిషిగా పునరంకితమవుతూ సభలు ముగిశాయి. ఈ రెండు రోజులు గోరటి వెంకన్న, అందెశ్రీ, రసమయి బాలకిషన్, దేశపతి శ్రీనివాస్, జననాట్యమండలి, అరుణోదయ, 'అమరవీరుల బంధుమిత్రుల సంఘం' సాంస్కృతిక బృందాల సాంస్కృతిక కార్యక్రమాలు ఆకట్టుకున్నాయి. విరసం సభ్యుల కొత్త పుస్తకాలు పదమూడు ఆవిష్కరణ అయ్యాయి. త్రిపురనేని మధుసూదనరావు రచనలు 1 - 'కవిత్వం - చైతన్యం', కౌముది - 'తరాల పల్లె', పి.మోహన్ - 'కిటికీపిట్ట', వరవరరావు - 'జైలు రాతలు', కళ్యాణరావు - అమృత - 'మా యిద్దరి కవిత్వం' డా. లక్ష్మీ సుహాసిని పాటలు 'దామదచ్చియలో', ఎన్.వేణుగోపాల్ - 'నవలా సమయం', చెలిమి - 'మనాల' దీర్ఘకవిత; ఉత్తర తెలంగాణ కవుల కవిత్వం - 'కవిత్వంపై గెరిల్లా'; వరవరరావు కవిత్వం 'అంతస్సూత్రం', నల్లూరి రుక్మిణి నవల - 'నెరెంకసెట్టుకింద', విరసం చారిత్రక పత్రాలు, ఉదయమిత్ర కథలు - 'అమ్మనుజూడాలె' పుస్తకాలు విడుదలయ్యాయి.

# కొత్త పుస్తకాలు

## నర్రెంకసెట్టు కింద

నవల

వల్లూరి రుక్మిణి



వెల : 100/-
విరసం గుంటూరు
ఆవిష్కరణ : పాణి

కథారచయిత్రి రుక్మిణి తొలి నవల యిది. 'నర్రెంక సెట్టుకింద నరుడో... భాస్కరుడో...' అనే సుప్రసిద్ధ విప్లవగీతం వెలువడిన చారిత్రక కాలంలో పల్నాడులో ఆరంభమై కొనసాగుతున్న విప్లవోద్యమ చరిత్ర ఆధారంగా రాసిన నవల యిది. ఒక రకంగా పల్నాడు విప్లవోద్యమ చరిత్ర కాకపోయినా ఆ చరిత్రలోని కొన్ని పొరలు యిందులో కనిపిస్తాయి. నక్సల్బరీ శ్రీకాకుళాలకు ప్రతిస్పందించిన ప్రాంతాల్లో గుంటూరు వొకటి. ఆ కాలంలో ఒక యువకుడు ఉమ్మడి పార్టీ నుండి బైటపడి విప్లవోద్యమం పట్ల ఆకర్షితుడైన దగ్గరి నుండి ప్రజాసంఘాల కార్యకలాపాల్లో ముమ్మరంగా తిరుగుతూ యింట్లో కన్నతండ్రితో, కులం వాళ్ళతో ఘర్షణ పడుతూ, తనేగాక తన సహచరిని కూడా తను నమ్మిన దారికి నడిపించి, కలిసి నడిచిన గాథ యిది. ఆ దారి అంత సులభమైందీ, సుఖవంతమైందీ కాదు గనుక అందరివలెనే వాళ్ళూ అనేక క్లిష్టతలను ఎదుర్కోవలసి వచ్చింది. కన్నకూతురు, కొడుకు విప్లవంలోకి వెళ్ళాక ఆ దంపతులు ఒకరికొకరుగా, యిద్దరూ ఉద్యమంగా రూపొందిన క్రమం ఈ నవలలో చిత్రించబడింది. కొడుకు బూటకపు ఎన్‌కౌంటర్లో చనిపోయినపుడు తల్లిదండ్రులు వెళ్ళి శవాన్ని తెచ్చుకొని పాటలుపాడి సొంత ఊళ్ళో ఊరేగింపు చేసి అంత్యక్రియలు జరుపుతారు. అట్లా తమలా కడుపుకోతకు గురైన తల్లిదండ్రులకు, రక్తసంబంధీకులకు తోడుగా నిలబడ్డ అమరుల బంధుమిత్రుల సంఘంలో చేరి పనిచేస్తుంటారు.

కూతురు మాధవి పల్నాడు విప్లవోద్యమంలో నాయకత్వస్థానంలో ఉంటుంది. ఆమె నేపథ్యంలో అక్కడి అనేక పోరాటాలు నవల్లోకి వచ్చాయి. ప్రభుత్వానికీ విప్లవపార్టీలకు మధ్య చర్చలు విఫలమైన తర్వాత పెరుగుతున్న నిర్బంధం దృష్ట్యా ఉద్యమాన్ని ప్రజలకు సన్నిహితం చేయడం గురించి, సామ్రాజ్యవాద సందర్భంలో ఉద్యమం ముందున్న సవాళ్ళ గురించి మాధవి లోతుగా ఆలోచిస్తుంటుంది. అట్లా ఈ నవల ఉద్యమం శక్తి సామర్థ్యాలతోపాటు, ఉద్యమం ముందున్న సవాళ్ళను కూడ లోపలివైపు నుండి చర్చకు పెడుతుంది. పాఠకులకు కొత్త అయినా ఉద్యమరీత్యా అహర్నిశలు కృషిచేస్తున్న నాయకులకు, పార్టీ మొత్తానికి ఈ పరిశీలన, సమీక్ష చాలా సహజమైందేగదా. మాధవి, మరో కామ్రేడ్ ఒక ఎన్‌కౌంటర్లో గాయపడ్డం, సహచరులు వాళ్ళను భుజాలపై మోసుకొని, ఉద్యమం గాయపడిన సరే, నడక ఆగదని, పురోగమనం అనివార్యమనే సందేశాన్నిస్తూ నవల ముగుస్తుంది.

'నర్రెంకసెట్టుకింద' విప్లవ నవలా చరిత్రకు ఒక గొప్ప కొనసాగింపు.

*

## కిటికీపిట్ట

ఖైదు కవిత్వం

పి.మోహన్



వెల : 10/-
విరసం ఆంధ్రప్రదేశ్ ప్రచురణ
ఆవిష్కరణ :
కె. శివారెడ్డి.

విప్లవ కవిత్వంలోని సరికొత్త కంఠస్వరం పి.మోహన్. యిప్పటికే చిత్రకారుడిగా, చిత్రకళా విమర్శకుడిగా, కథకునిగా అరుణతార పాఠకులకు చిరపరిచయమైన మోహన్ రాసిన కవిత్వం యిది. విరసం నిషేధకాలంలో తన పదిహేనురోజుల అక్రమనిర్బంధాన్ని, దారుణ చిత్రహింసలను కవిత్వీకరిస్తూ - చావుబతుకుల పొలిమేరలో వొంటరి నిర్బంధ వలయంలో నుండి బైటికి తొంగిచూస్తూ ప్రకృతిని, పక్షులను, ఆత్మీయ వ్యక్తులను, చిన్ననాటి జ్ఞాపకాలను, అంతకుమించి తనను అనుక్షణం పహారా కాస్తూ, హింసిస్తున్న పోలీసులను ఉద్దేశించి రాసిన కవిత్వం యిది. విప్లవ కవిత్వంలో జెయిలు కవిత్వం ఒక అవిభాజ్యభాగం. చిత్రహింసల మధ్యనే విశ్వాస ప్రకటన చేస్తూ, బైటికి వర్తమానం నడిపిన కవిత్వం అవిభాజ్యం. ఆ వొరవడిని మోహన్ యింకా ముందుకు తీసకపోయి వ్యవస్థీకృతమైన నిర్బంధాన్ని, అణచివేతను తాత్విక స్థాయిలో అర్థం చేసుకొని శత్రువుతో నడిపిన సుదీర్ఘ సంభాషణ యిది.

ప్రేమించేవాడికి దుఃఖం ఈనాటిదా? / యాతనామయ దేహపు స్థితిలోంచే / షేయిరేకుల పూవై పరిమళించదూ ప్రేమ... అంటూ అణచివేత, హింసల మధ్యలో విరబూచే ప్రేమ గురించి, ప్రేమ ముద్ర గురించి పలవరించిన కవిత్వం యిది. పక్కన మనిషితనం లేని హింసావృత్తిలో / ఎవడికివాడే ఉపశమనం... పొందవలసిన స్థితి నుండి ఉబికి వచ్చిన కవిత్వం యిది. బహుశా ముప్పై అయిదేళ్ళ విప్లవ కవిత్వంలోకి, ముఖ్యంగా నిర్బంధం గురించి రాసిన కవిత్వంలోకి ఒక గొప్ప తాత్విక వ్యక్తీకరణను మోహన్ తీసుకొని వచ్చాడు. అల్లెతాడుకూ విల్లు కర్రకూ మధ్య / బిర్రబిగిసిన బాణపు ప్రతిచర్యలా / కూడదీసుకో దేహచలనమా / కూడదీసుకో... అట్లా శరీరాన్ని, ఆలోచనలను, విశ్వాసాలను కూడదీసుకోవలసి వచ్చిన సమయంలో అక్కడి నుండే రూపొందిన కవిత్వం ఈ కిటికీ పిట్ట.

మీరు అందించిన నీటి అమ్మతనం / చల్లగా కోతపెట్టే సంకెళ్ళ రాజ్యహింస
రెండు పారస్పర్యాల చిత్రమైన సమ్మేళనంలో / వీరూ మనుషులేనని మీ చేతివేళ్ళూ....

శత్రువు గురించి కూడా యిట్లా అనుకోగలిగే దృక్పథం లేకపోతే ఆ శత్రువు పెట్టే చిత్రహింసలను తట్టుకొని, ఒక మానవీయ స్వప్నం పట్ల గురి పెట్టడం బహుశ ఎవరికైన సాధ్యం కాకపోవచ్చు. కానీ దాన్ని సాధించడం అంత సులభం మాత్రం కాదు. కోపం, ద్వేషం, బాధ, భయం, లొంగుబాటులాంటి భావనలను దరిచేరనీయకుండా విశ్వాసాన్ని నిలబెట్టుకోవడం ఒంటరి నిర్బంధంలో తప్పనిసరి అవుతుంది. దానికోసం ఒక ఆలోచనాపరుడు, సృజనకారుడు చేసే అన్వేషణ వలయాలు వలయాలుగా ఏదో కార్చిచ్చు వంకలు / మస్తిష్కపు రహదారుల్లో కలదిరిగి కలదిరిగి పోటెత్తి కొన్ని నిమిషాలలా నిశ్చల దుఃఖిత ప్రతిమనై అమ్మా... అమ్మా... అమ్మా.... అని మూర్ఛనలు పోతూ కూడా తనను తను నిలబెట్టుకునే క్రమంలో రూపొందిన జీవిత అవగాహన యిది. అందువల్లనే గాయానికి గాయానికీ /నడుమ కాసింత తెరిపి కావాలి/ నాకేకాదు నీకూకావాలి.... అనగలిగాడు. నిస్సందేహంగా ఈ కవిత్వం విప్లవ కవిత్వ చరిత్రను దేదీప్యమానం చేస్తున్నది.

*

# కొత్త పుస్తకాలు

## కవిత్వం - చైతన్యం

సాహిత్య విమర్శ వ్యాసాలు

త్రిపురనేని మధుసూదనరావు



వెల : 70/-
విరసం ఆంధ్రప్రదేశ్
ప్రచురణ
ఆవిష్కరణ :
చేకూరి రామారావు

టి.ఎం.ఎస్‌గా సుప్రసిద్ధుడైన త్రిపురనేని మధుసూదనరావు సాహిత్య విమర్శ గురించి ప్రత్యేకంగా చెప్పాల్సిన పనిలేదు. ఆయన విమర్శ రంగ ప్రవేశం చేయకముందు - చేశాక తెలుగు సాహిత్య విమర్శ స్వరూప స్వభావాలు మౌలికంగానే మారిపోయాయి. విరసం వ్యాఖ్యాతగా, విప్లవోద్యమంలో భాగంగా విప్లవ విమర్శను తీర్చిదిద్దిన ఘనత ఆయనది.

ఈ సంపుటిలో ఆయన తొలి రచనలు కవిత్వం - చైతన్యంతోపాటు (ఏడువ్యాసాలు) మరో పదివ్యాసాలున్నాయి. విరసం ప్రచురించబోయే మధుసూదనరావు సాహిత్య సర్వస్వంలో యిది మొదటి సంపుటం. యిందులో సాంప్రదాయవాదం - నిహిలిజం - మార్క్సిజం, సాహిత్య ప్రయోజనం - సాంప్రదాయ, శాస్త్రీయ దృక్పథాలు, శ్రీశ్రీ - ఆధునిక విమర్శకుడు, గతితార్కిక భౌతిక మానవతావాదం, నాటక ప్రయోజనం - అధ్యయన పద్ధతి అనే సుప్రసిద్ధ వ్యాసాలు ఉన్నాయి. వీటితోపాటు కొడవటిగంటి కుటుంబరావు గురించి రాసిన వ్యాసం విప్లవాత్మక సాహిత్య దృక్పథం, బాలగోపాల్ విమర్శా వ్యాస సంపుటి రూపం-సారంకు రాసిన ముందుమాట చారిత్రక సామాజిక విశ్లేషకుడు అనే వ్యాసం ఉన్నాయి.

టి.ఎం.ఎస్ తెలుగు మార్క్సిస్టు ఆలోచనాపరులలోఅరుదైన వ్యక్తి. గతితార్కిక చారిత్రక భౌతికవాదాన్ని సాహిత్యానికి, సాహిత్యచరిత్రకు అన్వయించడంలో ఆయన చేసిన కృషి అపారమైనది. మొత్తంగానే తెలుగు విమర్శారంగం పలచబడిపోతున్న సందర్భంలో ఆయన విశ్లేషణ పద్ధతిని తిరిగి అందుకోవలసి ఉన్నది. అందుకు ఈ పుస్తకంలోని వ్యాసాలు తోరపడి దిద్దుతాయి. విమర్శ అంటే ప్రశంసగా, అభినందనగా, పరస్పర భజన కార్యక్రమంలా, కొండొకచో సాహిత్యంలోని సౌందర్య సంబంధ విషయాల పలవరింతగానే మారిపోయిన వర్తమానంలో మధుసూదనరావును మళ్ళీ చదవడం చాలా అవసరం. బహుశా యివ్వాల్టి విమర్శకులకు కూడా మధుసూధనరావు దృక్పథాన్ని వంటపట్టించుకోవడం అంత సులభం కాకపోవచ్చు. సాహిత్యాన్ని మాత్రమే చదువుకోగల్గిన విమర్శకులకు, అదీ పాఠక స్థాయి పరిశీలకులకు మధుసూధనరావును అర్థం చేసుకోవటం కష్టమే అయినా ఇవాళ చాలా అవసరమైన వ్యాసాలు ఈ సంపుటిలో ఉన్నాయి. విమర్శకులు మాత్రమేగాక, పాఠకులు కూడా సాహిత్యాన్ని ఎలా చదవాలో, ఎందుకు చదవాలో వీటిద్వారా తెలుసుకోవచ్చు.

*

## తరాలపల్లె

కవిత్వం, పాటలు, నవలిక

కౌముది




వెల : 100/-
విరసం ఆంధ్రప్రదేశ్
ప్రచురణ
ఆవిష్కరణ :
వాసిరెడ్డి నవీన్

తను అర్థాంతరంగానే వెళ్ళిపోయినా, విప్లవసాహిత్యంపై నిండు వెన్నెలను పరిచిన కౌముది సమగ్ర సాహిత్యం యిది. యిందులో ఆయన 'చనుబాలధార' కవిత్వ సంపుటితో పాటు, అందులో చోటుచేసుకోని కవితలు, ఆ సంపుటి వచ్చాక - చనిపోయేదాకా రాసిన కవితలు, పాటలు, తెలంగాణపల్లె నవలికా ఉన్నాయి. వీటితోపాటు కౌముది - సుగుణ మీద వచ్చిన స్మృతిగీతాలు కూడా ఉన్నాయి. చనుబాలధార తెలుగు కవిత్వంలో ఒక పెద్ద సంచలనం. విప్లవ కవిత్వాన్ని చిన్నచూపుచూసే వాళ్ళు కూడ అజ్ఞాతం నుండి వచ్చిన కౌముది కవిత్వానికి తలొంచక తప్పలేదు. విప్లవ కవిత్వం ఎంత ధిక్కార స్వభావాన్ని, యుద్ధలక్షణాన్ని పుణికిపుచ్చుకున్నదో అంతగా సౌందర్యాన్ని, ప్రేమను, త్యాగాన్ని.... వీటన్నింటినీ సవ్యంగా సుస్థిరం చేయగల విప్లవం పట్ల ఆరాధనానూ తన జీవధాతువులుగా ప్రదర్శిచగలదని కౌముది నిరూపించాడు. అసలు విప్లవమే గొప్ప కవిత్వ రచన. విప్లవం కౌముది కవిత్వ విన్యాసాన్ని తీర్చిదిద్దింది. అమ్మ కొంగు పట్టుకొని ఫార్మేషన్లో పడిపోకుండా నడుస్తున్నానని కౌముది చెప్పుకున్న మాట విప్లవం నడకనూ, కవిత్వ నడకనూ కలిపి చదువుకోవడానికి తగినంత లోతైన అవగాహనను అందిస్తుంది. కవిత్వ రచనలోని విన్యాసాలకూ - విప్లవ ప్రయాణానికీ, నడకకూ దగ్గరి సంబంధం ఉన్నది కాబట్టే అజ్ఞాతంలోని విప్లవకారులు అత్యంత సహజంగానే విప్లవ వ్యూహాన్ని రచనా వ్యూహంగా తర్జుమా చేసుకుంటారు. బైట వున్న విప్లవ రచయితలు తన రచనా వ్యూహంలోకి విప్లవ వ్యూహాన్ని, దానికి దారిచూపే విప్లవ సిద్ధాంతాన్ని తీసుకొని వస్తారు. ఈ రెండింటికీ ప్రాణం వర్గపోరాటం. కార్యకర్త, రచయిత తరతమ స్థాయిల్లో వర్గపోరాటాలలో భాగం కావడం వల్ల విప్లవం, రచన కలగలసి నడుస్తున్నాయి.

కౌముది ఈ ప్రక్రియకు అత్యున్నతమైన ఉదాహరణ. విప్లవ కవిత్వ ప్రమాణాలు, విస్తృతి పెంచాలని ప్రయత్నపూర్వకంగా కృషిచేసిన యిటీవలి రచయితల్లో కౌముది ఒక పెద్ద మలుపు. విప్లవ కవిత్వం మీద కౌముది వెన్నెల ముద్ర చాలా బలీయమైనది సుదీర్ఘంగా, విస్తృతంగా కొనసాగగల స్వభావం కలది. ఆయన ప్రభావానికి ఈ పుస్తకంలోనే ఒక చిన్న ఆధారం ఉన్నది. కౌముది సంస్మరణలో వచ్చిన కవిత్వం చూస్తే ముప్పై ఏళ్ళ నుండి కవిత్వం రాస్తున్న సీనియర్ కవుల దగ్గరి నుండి యిప్పుడిప్పుడే రాస్తున్న కొత్త కవులదాకా అనేక మంది చాలా వైవిధ్యభరితంగా నివాళి వ్యక్తీకరించారు. ముఖ్యంగా కొత్తకవులు రాసిన సంస్మరణ కవిత్వంలో కూడా కౌముది ముద్ర కనిపిస్తుంది. యిటీవలి కాలంలో ఒక కవి మరణానికి వచ్చిన ప్రతిస్పందనల్లో కూడా కౌముది ప్రభావాన్ని ఈ స్మృతికవితలు తెలియజేస్తున్నాయి. కవిత్వంతో పాటు, నవలిక కూడా రాసిన కౌముదికి విప్లవానికి ఏఏ సాహిత్య ప్రక్రియలు ఎంత అవసరమో స్పష్టంగా తెలుసు. కౌముది మరణానంతర జీవితాన్ని మనందరి జీవితాల్లోకి ప్రవహింపచేయగల జీవశక్తి గల పుస్తకం ఈ తరాలపల్లె.

*

# కొత్త పుస్తకాలు

## నవలా సమయం

నవలపై విమర్శ వ్యాసాలు, సమీక్షలు
ఎన్. వేణుగోపాల్

తెలుగు సాహిత్య విమర్శకు శక్తివంతమైన చేర్పు ఈ నవలా సమయం. మొదటి నుండి తెలుగు విమర్శ కవిత్వ ప్రక్రియపైనే ఎక్కువగా సాగుతూవచ్చింది. వచన ప్రక్రియల శక్తిని, విస్తృతిని ఎత్తిచూపుతూ రావలసినంత విమర్శ రాలేదనే అభిప్రాయాన్ని దాదాపు అందరూ అంగీకరించేదే. వేణుగోపాల్ యింతక ముందు 'కథాసందర్భం' పేరుతో కథా విమర్శ వ్యాసాలు ఒక పుస్తకంగా విడుదల చేసిన విషయం పాఠకులకు తెలిసిందే.



వెల : 50/-
స్వేచ్ఛ సాహితి
ప్రచురణ
ఆవిష్కరణ :
ముక్తవరం పార్థసారథి

గత పాతికేళ్లలో వేణుగోపాల్ నవల ప్రక్రియపై రాసిన వ్యాసాల, సమీక్షల సంపుటి యిది. యిందులో ఎనిమిది అనువాద నవలలపై రాసిన వ్యాసాలతోపాటు, పన్నెండు తెలుగు నవలలపై రాసిన వ్యాసాలు, 'వ్యాపార సాహిత్యం - సంస్కృతి' పేరుతో తెలుగులో వచ్చిన వ్యాపార నవలలపై రాసిన ఒక వ్యాసం ఉన్నాయి. తగళి శివశంకర పిళ్ళై 'కూలిగింజలు', హొవార్డ్‌ఫాస్ట్, స్పార్టకస్, నిరంజన 'చిరస్మరణ', ఎగ్నెస్ స్మెడ్లీ, 'భూమిపుత్రిక', విమల్‌కర్ సమయంకాని సమయం, ఆశోకమిత్రన్ 'జంటనగరాలు', అరుంధతీరాయ్-'గాడ్ఆఫ్ స్మాల్ థింగ్స్' మొదలైన సుప్రసిద్ద నవలలపై విశ్లేషణాత్మక వ్యాసాలు ఉన్నాయి.

నవలను చదివేటప్పుడు పాఠకులు ఒక కొత్త ప్రపంచంలోకి వెళ్లిపోతారు. సంభ్రమాశ్చర్యాలకు లోనౌతారు. నవలలోని మానవ సంబంధాల ఉద్వేగంలో, సామాజిక చారిత్రక వెలుగునీడల్లో లీనమైపోతారు. నవలా వస్తువు విస్తృతమయ్యేకొద్దీ, రచయిత కాల్పనికశక్తి - రచనా సామర్థ్యం శక్తివంతంగా వ్యక్తమయ్యే కొద్దీ పాఠకులు నవల నిర్మిస్తున్న ప్రపంచంలో భాగమైపోతారు. ఈ అనుభవాన్ని శాస్త్రస్థాయిలో విశ్లేషించగల విమర్శ ఉంటే నవలా పఠనం వల్ల కలిగిన సాహిత్య అనుభవాన్ని పాఠకులు తరచిచూసుకుంటారు. శాస్త్రీయమైన నవలా విమర్శ నవలా ప్రక్రియ ప్రత్యేకతలను, రచయిత వాటిని ఉపయోగించుకున్న తీరునూ, అందులోని జీవిత చిత్రణనూ, జీవితానుభవాన్ని సామాజిక - సాహిత్య విశ్లేషణలో భాగంగా నవలపై కొత్త వెలుగును అందిస్తుంది.

యిందులో వేణుగోపాల్ రాసిన విమర్శా వ్యాసాలను చదివి మళ్ళీ ఆ నవలలు చదివితే చాలా కొత్తగా, అద్భుతంగా అనిపిస్తాయి. జానకి విముక్తి, భూమిపుత్రిక నవల్లోని ప్రతిపాదనలను వేణుగోపాల్ చాలా లోతుగా పరిశీలించారు. యింకా కొనసాగవలసిన చర్చకు అవసరమైన అంశాలు ఆ వ్యాసాల్లో ఉన్నాయి. అట్లాగే 'సంగం' తిరునగరి రామాంజనేయులు నవలపై రాస్తూ 'పోరాటనవల అంటే ఏమిటి?' అనే వ్యాసం ఉద్యమ నవలా రచయితలు తప్పక చదవాల్సింది. పోరాటనవలలు ఎలా ఉండాలో, ఎలా ఉండేందుకు అవకాశం ఉన్నదో 'సంగం' సందర్భంలో వివరించారు. పులి ఆనందమోహన్ రాసిన 'వసంతగీతం' పై రాసిన వ్యాసం దీనికి మంచి కొనసాగింపు. ఈనాలుగు వ్యాసాలు మొత్తం సంపుటిలో అగ్రభాగాన ఉంటాయి. నవలను ఎట్లా పరిశీలించాలి? అనే ప్రశ్నకు ఇవి గొప్ప సమాధానాలు, మంచి నమూనా విమర్శలు. విప్లవ విమర్శ చరిత్రను కల్పనా సాహిత్యంపై వేణుగోపాల్ రాసిన వ్యాసాలు కాంతివంతం చేస్తాయి.

*

## మానాల

దీర్ఘకవిత
చెలిమి

'మానాల' ఒక వూరిపేరు. కానీ అంతవరకే అనుకొని సరిపెట్టుకోలేం. ఆ పేరు వెను విషాదంలోకి మనలను తోసివేస్తుంది. విప్లవోద్యమ చరిత్రలో విషాదాత్మక సంకేతాలు అనేకం ఉన్నాయిగాని మానాల నిత్యం వెంటాడే విషాద జ్ఞాపకం. విప్లవ పార్టీలకు ప్రభుత్వానికి చర్చల తర్వాత - చర్చలను విఫలం చేయడానికి ప్రభుత్వం చేసిన కుట్ర కొనసాగుతూ మానాలలో బద్దలైపోయింది. పదిమంది విప్లవకారులను విషం పెట్టించి చంపిన ప్రభుత్వం అణచివేత చరిత్రలోకి కొత్త అధ్యాయాన్ని తీసుకొని వచ్చింది. కాని పోరాటం, సంఘర్షణ ఉన్నచోట శత్రువుకు అది విజయం ఎన్నటికీ కాజాలదు. విషాహారంతో పదిమంది విప్లవకారులు నేలవాలిపోయినా, ఒక పెద్ద కుట్రకు బలైపోయినా పోరాటంవల్ల, త్యాగం వల్ల విప్లవోద్యమ చరిత్రనే విషాదంలోంచి తలెత్తి నిలబడుతుంది. 'మానాల ఎన్‌కౌంటర్‌గా' పిలవబడుతున్న ఘటనలో చనిపోయిన వారేగాక, దశాబ్దాల నుండి ఆ ప్రాంతంలో అనేక మంది విప్లవకారులు చేసిన పోరాటాలు, బలిదానాలు దుఃఖం మధ్యనే చరిత్రను రచించాయి. దొంగదెబ్బవల్ల రాజ్యానికి సిద్ధించిన విజయానికి మానాల సంకేతం అవచ్చుగాని, వాస్తవంలోకి ప్రజల పోరాట పరంపరలో మానాల ఓ నెత్తుటి కెరటం.




వెల : 10/-
ఆవిష్కరణ :
నాళేశ్వరం శంకరం

కవి 'చెలిమి' మానాల ఘటనను కొనసాగుతున్న చరిత్రలో భాగంగా, నిర్మాణమవుతున్న చరిత్రలో అంతర్భాగంగా చూచి ఈ దీర్ఘ కవిత రాశారు. బూటకపు ఎన్‌కౌంటర్ కట్టుకథ రూపంలో లోకానికి పరిచయమైన మానాల వెనుక అంతగా ఎవరికీ తెలియని గొప్ప సాంప్రదాయం ఉన్నది. ఈ కవిత అత్యంత ఉద్వేగంగా మానాల పరిసరప్రాంతాలన్నీ కలదిరిగి వస్తుంది. ఎప్పటెప్పటి నుండో అక్కడ కొండల్లో, గూడేల్లో పల్లెల్లోని పోరాట సంప్రదాయాన్ని, జీవన్మరణ సంఘర్షణను, ప్రకృతిలో భాగమైపోయిన ఆదివాసులు, గ్రామీణులు పోరాటంలోనూ భాగమైపోయిన వైనాన్ని ఈ కవిత వెలికితీసింది.

'మానాల' కేవలం ఒక ఘటన కాదని మానాల ప్రజల చరిత్రకు నమూనా అని చెప్పటానికి కవి చేసిన కవితాత్మక ప్రయత్నమీ దీర్ఘ కవిత.

మానాల పదమూడు తాండాలను / పాదిగింది /హన్మాన్ తాండాను అక్కున చేర్చుకుంది
కేకవేస్తే వినిపించే / భీమ్యాతాండా / రక్తసిక్తమైన జీవితం నుంచి
రాజైన సర్పంచ్ తాండా వెన్నెల రాత్రుల్లో /అన్నలొస్తే / కాళ్ళకు నీళ్ళిచ్చి / కడుపుకు బువ్వపెట్టే హేమాజతాండా....

యిట్లా మానాల చుట్టూ ఉన్న ఆదివాసీతాండాల ఆరాటాల, పోరాటాల, సంకల్పాల విజయగాథ ఈ మానాల దీర్ఘకవిత.

*

# కొత్త పుస్తకాలు

## జైలు రాతలు (వ్యాసాలు)

ఆగస్ట్ 2005 - మార్చి 2006

వరవరరావు

రాజ్యం - జెయిలు; కవి - జెయిలు. ప్రజల పక్షాన ఉన్న కవిని, రచయితను రాజ్యం జెయిల్లో వేసి నిశ్చింతంగా ఉండాలనుకుంటుంది. రచయిత ప్రజల్లో ఉండి ఏం చేస్తాడో, జెయిల్లో ఉండి కూడా అదే చేస్తాడు. ప్రజలమధ్య, ప్రజల పోరాటాల మధ్య నిత్యం సంచరిస్తూ రచన చేసిన వాడికి జెయిలు గోడల మధ్య నుండి ప్రజలను చూస్తూ రచన చేసే అవకాశం కలగడం వల్ల రచన యింకింత వేడెక్కుతుంది. రాజ్యాన్ని, పాలక వర్గాలను ఏ మారకుండా ప్రజలకు హెచ్చరిక చేస్తూ రచన చేస్తాడు.




వెల : 50/-
ములాఖత్‌ముద్ర
ప్రచురణ
ఆవిష్కరణ :
శ్రీధర్‌దేశ్‌పాండే

రాజ్యంతో పాటే జెయిలు పుట్టింది. అప్పటి నుండే జెయిలు రాతలు మొదలయ్యాయి. రాజ్యానికెంత అణచివేత చరిత్ర ఉందో అంతే జెయిలు రాతల ధిక్కార చరిత్ర ఉన్నది. వరవరరావు సాహిత్య జీవితంలో ప్రధాన ఘట్టం జెయిలు రచన. కవి ప్రజల్లో ఉండటం అంటే జెయిల్లో కూడ ఉండటం అని ఆయన జీవితం, రచన తెలుగువాళ్ళకు స్పష్టం చేశాయి. రాజ్యాన్ని వ్యతిరేకించదలుచుకున్నాక కవికి అనివార్యంగా ఎదురయ్యే రచనా సందర్భం జెయిలు జీవితం. ఈ సారి వరవరరావు జెయిల్లో కవిత్వంతోపాటు - యింకా బాగా చెప్పాలంటే మిన్నగా వచనం రాశారు. గతంలో సహచరులు రాసినా వచనం కవిత్వం కలగలసిన భావుక విశ్లేషణ అది. ఈ 'జెయిలు రాతలు' లోతైన రాజకీయ సామాజిక వ్యాఖ్యానం. బహుశా ఆ ఏడున్నర నెలలు ఆయన బైట ఉండి ఉంటే కూడా యిన్ని విషయాలపై, యింత సూక్ష్మ పరిశీలనలో, యింత పదునైన విశ్లేషణ రాయడానికి పరిగెత్తే కాలంతోపాటు పరిగెడుతూ రాయడం అయ్యేదోకాదో. వరవరరావును జెయిల్లో వేసి ఏడునెలలు ప్రశాంతంగా బతికిదాననుకున్న ప్రభుత్వానికి - ఆ కాలమంత ఆయన జెయిల్లో తనపై యింత బలమైన విమర్శ రచించాడని, యిప్పుడది ప్రజల చేతుల్లోకి వెళుతున్నదని తెలుసుకోగలగే విజ్ఞత ఉందనుకోవడం పొరపాటే.

ఈ పుస్తకంలో పదిహేడు వ్యాసాలున్నాయి. రెండు మూడు వ్యాసాలు మినహా మిగతా అన్నీ ప్రజావ్యతిరేకి అయిన ప్రభుత్వాన్నీ, ప్రభుత్వ స్వభావాన్నీ, విధానాలను నేరుగ ఎత్తిచూపేవే. మిగతా రచనలు కూడా రాజ్యం కాపాడుతున్న సామాజిక, న్యాయ, సాంస్కృతిక హీన విలువలను, వ్యవస్థలను గురి చూసినవే. ఈ రచనలన్నీ నిర్బంధ జీవితంలో ఉన్న ఆలోచనాపరుడు పరిణామాల మీద చేసిన రన్నింగ్ కామెంటరీ అనవచ్చు. కామెంటరీ మాత్రమే కాదు, గొప్ప సామాజిక చారిత్రక, తాత్విక దృష్టిలో సాగిన విశ్లేషణ.

*

## దామదచ్చియలో...

పాటలు

లక్ష్మీసుహాసిని




వెల : 20/-
ఆవిష్కరణ :
కోటి
ప్రజాకళామండలి

యిది సుహాసిని పాటల పుస్తకం. నలభైఒక్క పాటలున్నాయి. వీటిని నాలుగు విభాగాల కింద అచ్చేశారు. స్త్రీల జీవితాలను, స్త్రీలు మాత్రమే చేసే వృత్తులను కేంద్రం చేసుకున్న పాటలు కొన్ని. చేటలల్లే చెల్లి, మైకా కంపెని కాడ చెల్లెలా, మాతమ్మపాట, యింటిచాకిరి అనే పాటలున్నాయి. 'నీ సొమ్మేమైనా తింటినా!'' అని శ్రామిక మహిళ పురుషస్వామ్యాన్ని ప్రశ్నిస్తుంది. శ్రమలో భాగమై, ఉత్పత్తిలో భాగమై కూడా యింట్లో పురుషుల పెత్తనం కింద నలిగిపోతున్న స్థితి ఎంత దారుణంగా ఉన్నా, శ్రమలో భాగం కావడం వల్ల శ్రామిక మహిళ ఊరక కన్నీరు కార్చుతూ ఉండదు. నీ సొమ్మేమైనా తిన్నానా! అని నిలదీసి అడుగుతుంది.

అలాంటి పాటలతోపాటు నెల్లూరు కేంద్రంగా సాగి రాష్ట్ర వ్యాప్తమైన సారా ఉద్యమ చైతన్యంతో లక్ష్మీ సుహాసిని చాలా పాటలు రాశారు. సారా వ్యతిరేక పాటలు యిందులో తొమ్మిది ఉన్నాయి. ఆనాటి సారా వ్యతిరేక సందర్భం నుండి యిప్పటి రాజశేఖర రెడ్డి సారా రాజ్యాన్ని వ్యతిరేకిస్తూ కూడా యిందులో పాటలు ఉండటం విశేషం.

అమరవీరుల మీద రాసిన పాటలు పన్నెండు ఉన్నాయి. చినబాబు, కెవిఆర్, భూమయ్య, కిష్టాగౌడుల స్మృతిలో సుహాసిని పాటలు రాశారు. యివిగాక ఎఐఆర్‌ఎస్‌ఎఫ్ సభల సందర్భంలో, చైతన్య మహిళా సమాఖ్య గుంటూరు, కర్నూలు సభల సందర్భాల్లో సభలకు పిలుపునిస్తూ పాటలు రాశారు. సుహాసిని కొన్ని జానపద బాణీలలోనూ, కొన్ని గేయాల రూపంలోనూ మొదటి నుండీ పాటలు రాస్తూ వచ్చారు. అవన్నీ యిందులో ఉన్నాయి. ఈ పుస్తకానికి ప్రముఖ కవి, రచయిత భూపాల్ ముందుమాట రాశారు.

*

# కొత్త పుస్తకాలు

## అమ్మను జూడాలె

కథలు

ఉదయమిత్ర

ఇరవైఏళ్ళ నుండి కవిత్వం రాస్తున్న ఉదయమిత్ర కథా ప్రక్రియపై మక్కువతో చేసిన సాహిత్య కృషి ఈ కథాసంపుటి. పాలమూరు నుండి వచ్చిన ఈ సంపుటిని ప్రత్యేకంగా పరిచయం చేయాల్సిన పనిలేదు. ప్రజల పట్ల బాధ్యతగా రాసే, రచయిత కలం నుండి వెలుబడిన కథలు కాబట్టి ఈ సంపుటిలో ఏం ఉంటుందో వెంటనే పోల్చుకోవచ్చు. పాలమూరు అంటే కరువు, వలస. అక్కడి ప్రజారచయిత రాసిన కథల్లో అనివార్యంగా కరువు, వలస. వల్ల ఛిద్రమైపోతున్న ప్రజల జీవితాలు చోటుచేసు కుంటాయి.



వెల : 40/-
పాలమూరు
ప్రచురణలు
ఆవిష్కరణ : పి.చంద్

ఉదయమిత్ర కథ జీవనాడి పాలమూరు వలసల వేల లక్షల సంఖ్యలో ఊరొదిలిపెట్టి, జిల్లా వదిలిపెట్టి దేశంలోని మారుమూలలన్నిటా పెద్ద పెద్ద నిర్మాణాల్లో కూలీపనులు చేస్తూ అక్కడే అర్థాంతరంగా రాలిపోయి, ఊరును, ఊళ్ళవాళ్ళను కడచూపు కూడా చూసుకోజాలని దయనీయ జీవన విధ్వంసం ఈ కథల సారాంశం. మానవ జీవితసారం కరువువల్ల, వలసవల్ల పీల్చేయబడుతున్న పాలమూరు ప్రజల జీవిత సారాంశం ఈ సంపుటి. వలస వల్ల వేరైపోయిన తల్లీ పిల్లలు.... అమ్మను జూడాలని ఆరాటపడే బిడ్డల ఆక్రందన ఈ కథల్లో కనిపిస్తుంది.

యిందులో పదిహేడు కథలున్నాయి. ఉదయమిత్ర కథల్లో రెండు జీవన పునాదుల నుండి వచ్చిన పాత్రలు కనిపిస్తాయి. పాలమూరు గ్రామాల్లో వలసకూలీలు, నల్లమల అడవుల్లోని ఆదివాసులు. పాలమూరు అట్టడుగు పొరలకు ప్రాతినిధ్యం వహించే జీవితాలను, పాత్రలను స్వీకరించడం వల్ల దానికదే ఒకగొప్ప బలం ఈ సంపుటికి సంక్రమించింది. ముఖ్యంగా గ్యాస్‌లైట్, దాడి అనే రెండు కథలను చదవండి. కడుపులోంచి దుఃఖం తన్నుకొని వస్తుంది. అట్లాంటివే పేగుబంధం, అమ్మనుజూడాలె అనే కథలు కూడ. అసలుసిసలైన పాలమూరు జీవన దృశ్యాలు కనిపిస్తాయి. అక్కడ యింత దయనీయత, విషాదం మాత్రమేనా, యింకేమీ లేదా? అనిపించవచ్చు. పాలమూరుకు ఒక గొప్ప పోరాటాల సాంప్రదాయం కూడ ఉన్నది. ఉదయ మిత్ర దాన్ని కూడ పట్టుకున్నారు. పోరాటాలు, అణచివేత, ప్రతిఘటన అనే జీవిత సత్యాన్ని కూడా కథల్లోకి వంచే ప్రయత్నం చేశారు. కవిగా ఆయన చేసిన కృషికి ఏమాత్రం తగ్గకుండా, ప్రక్రియా బలం వల్ల కూడా ఉదయమిత్ర ఈ సంపుటిలో చాలా ప్రస్ఫుటంగా కనిపిస్తారు. ఆయన కంటే ఆయనను కదిలించి, ప్రేరేపించి, రచనకు పురికొల్పిన పాలమూరు జీవిత సంఘర్షణ గురించి వ్యాసాల రూపంలో, విశ్లేషణల రూపంలో ఎంతో కొంత తెలుసుకున్న బైటి ప్రపంచంపై ఈ కథలు అంతకు మించిన గాఢమైన ముద్ర అద్దుతాయి. మరి ప్రొ.హరగోపాల్ మంచి ముందుమాట రాశారు. ఈ సంపుటి విప్లవకథకు సరికొత్త వన్నె తెస్తుంది. *

## కవిత్వంపై గెరిల్లా

అజ్ఞాత కవిత్వం

గెరిల్లాపై కవిత్వం, కవిత్వంపై గెరిల్లా.

యిది ఉత్తర తెలంగాణా గెరిల్లా కవుల కవిత్వం. పీడిత ప్రజలు రాజ్యానికి వ్యతిరేకంగా సాయుధపోరాటం చేసి రాజ్యాధికారం హస్తగతం చేసుకోవడానికి కూడగట్టుకొనే అనేకానేక శక్తుల్లో, ఆయుధాల్లో, నైపుణ్యాల్లో సాహిత్యం కూడ వొకటి. బలమైన రాజ్యాన్ని ఎదుర్కోవడానికి ఎట్లాగైతే గెరిల్లా యుద్ధతంత్రాన్ని పాటిస్తారో అట్లాంటి వ్యూహంలోకి కవిత్వాన్ని కూడా తీసుకొని వస్తారు. కవిత్వ శక్తి ఏమిటో గెరిల్లా వ్యూహంలో భాగంగా తెలుసుకొని సాయుధపోరాట ఆచరణలోని నైపుణ్యాన్ని కవిత్వరచనలోకి అనువదిస్తారు. ఈ పని ఆంధ్రప్రదేశ్‌లో విప్లవోద్యమం ప్రారంభమైనప్పటి నుండే మొదలైంది. గత నలభై ఏళ్ళ తెలుగు కవిత్వంలో రాసిలోనే గాక ప్రభావ రీత్యా, నైపుణ్యంరీత్యా, ప్రమాణాల రీత్యా కూడా గెరిల్లా కవిత్వంకు ఒక ప్రధానమైన వాటా ఉన్నది. దీన్ని కాదనుకొని తెలుగు కవిత్వ చరిత్రను ఉటంకింపులతో, అభిమాన దురభిమానంతో, స్వీయ ఆకాంక్షల మేరకు రచించే పండితులు యింకా యూనివర్సిటీల్లో 'ప్రగతిశీల శిబిరంలో కూడా ఉండవచ్చు గాని - చరిత్ర అంటే ప్రజలు రచించే చరిత్ర అనే కనీస అవగాహన ఉన్న వారెవరికైనా ప్రజల చరిత్రలో ప్రజలు నిర్మించే పోరాటాలు - పోరాట అవసరంగా రచించే కవిత్వం వేరు చేయజాలని భాగాలనే ఎరుక ఉండితీరాలి.



వెల : 20/-
దిక్సూచి ప్రచురణలు
ఆవిష్కరణ :
బొజ్జాతారకం

అట్లా ఉన్నా లేకపోయినా చరిత్ర సత్యంగా నిలబడే అజ్ఞాత కవిత్వం మనకు విస్తృతంగా వస్తోంది. అందులో భాగమే ఈ కవిత్వంపై గెరిల్లా. ఈ పేరులో ఏదో తిరకాసు ఉన్నట్టనిపించవచ్చుగాని చాలా సూటిగా వెల్లడయ్యే అంశం - కవిత్వంపై గెరిల్లా ముద్ర. కవిత్వంపై గెరిల్లా సృజనశీల పోరాట విన్యాసపు ఆనవాలు. ఉత్తర తెలంగాణ విప్లవోద్యమంలో పేరులేని, లేదా నలుగురికి కవిగా తెలియని సాహిత్యజీవుల కవిత్వ సృష్టి యిది. చాలా పెద్ద సంకలనం. ఈ కవిత్వాన్ని అంచనా వేసి ఏమైనా నిగ్గుదేల్చవచ్చుగాని, ఈ కవిత్వరచన సమయ సందర్భాల నేపథ్యంలో నుండీ ఆ పని చేయవలసి ఉంటుందని మనవి. సమాజంలో దళితులు, స్త్రీలు తమతమ జీవన నేపథ్యాల నుండి తన సృజనాత్మకతకు సాహిత్యరూపం యిస్తున్నప్పుడు తప్పనిసరిగా వాళ్ళ రచనా సందర్భం పరిగణలోకి తీసుకోవలసి ఉంటుంది. యుద్ధ కవిత్వాన్ని కూడా అట్లా యుద్ధ సన్నివేశం నుండి, యుద్ధంలోకి వస్తున్న ప్రజల జీవన అనివార్యతల నుండి, ముఖ్యంగా యుద్ధం నిర్దేశించే కవిత్వ వస్తుశిల్పాల ప్రాధాన్యతల నుండి దీన్ని అంచనా వేయాలి. అట్లాంటి అధ్యయానికి దృఢంగా నిలబడగల శక్తి ఉన్న సంకలనం యిది. దీన్ని చదవడమంటే కవితానుభవంలోకి తుపాకి తూటాకూ తూటాకు మధ్యన ఉండే క్షణకాల విరామాన్ని, నిశ్శబ్దాన్ని మనలోకి స్వీకరించడమే. అయినా అది అంతటితో ఆగదు. ఆ తర్వాత సాగే ఒక సుదీర్ఘ ప్రవాహంలోని ఆటుపోట్లనూ, పెనుప్రకంపనలను మనలో యింకింప చేస్తుంది. *

# కొత్త పుస్తకాలు

## వెన్నెల దారి

కవిత్వం

జంఝావతి

జంఝావతి పొడవునా వెన్నెలదారిలో నడుస్తూ దశాబ్దకాలంగా రాసిన కవిత్వం యిది. జంఝావతి అనుభవం అపారమైనది. మహోన్నతమైన శ్రీకాకుళ రైతాంగ సాయుధపోరాటాన్ని తనలో సంలీనం చేసుకొని చరిత్రతోపాటు అడుగులో అడుగువేస్తూ పురోగమిస్తోంది. శ్రీకాకుళ పోరాట కాలంనాటి విప్లవ కవిత్వంలోని సరళతను, సూటిదనాన్ని పుణికిపుచ్చుకొని పరిణత దశలోని భావోద్వేగాన్ని తొణికిసలాడుతూ కవి జంఝావతి రాసిన కవిత్వం ఈ వెన్నెలదారి.



వెల : 20/-
విరసం శ్రీకాకుళం యూనిట్ :
ఆవిష్కరణ : కొండేపూడి నిర్మల

పదేళ్ళ కింద కవి తన కవిత్వ స్థలకాలాలను, స్వభావాన్ని యిట్లా ప్రకటించాడు. 'మేము యుద్ధభూమి నుంచి మాట్లాతున్నాం / యిక్కడ వైద్యం చేయమూ యుద్ధమే / న్యాయం చెప్పడమూ యుద్ధమే / వార్తాసేకరణా యుద్ధమే...' యుద్ధం ప్రజల యుద్ధం అయినప్పుడు వైద్యం, న్యాయం, విషయసేరణ కూడా యుద్ధ ప్రక్రియలని తెలిసినవాడు కాబట్టి కవిత్వం రచన కూడ యుద్ధంలో భాగమని తన కవిత్వ లక్ష్యలక్షణాలను నిర్వచించుకున్నాడు. అందులో ఏ సందేహాలూ లేవు. గాయపడిన శ్రీకాకుళం కోలుకొని మళ్ళీ ఒక ఆశావహ రంగస్థలంగా, సరిహద్దులు దాటి విస్తరిస్తున్న దశలో - సహజంగానే చరిత్రలో భయ సందేహాలు ఎరుగని నిశ్చయ ప్రకటన చేసిన శ్రీకాకుళం వలె కవి కూడా ఖడ్గచాలనం తెలిసినవాడివా / రా మాతో చేరు...' అని ఆహ్వానిస్తున్నాడు.

ఎక్కడో చిల్లులు పడిన శబ్దం / పెరట్లో వేపకొమ్మ విరిగిపడింది / గుమ్మానికి రాసిన పసుపు వెలవెలబోయింది / దేహంలో ఏదో తెగిపోతున్న బాధ / కాలం బిగ్‌బెన్‌లో అలారం మానేసింది /

జంఝావతి వ్యక్తీకరణలో సరళత, సూటిదనం విస్తృత రూపంలో కనిపిస్తాయి. ఈ శిల్పంలో రాస్తున్నప్పుడు కవిత్వం కావడానికి ఉన్న చాలా అవకాశాలను కవి వినియోగించుకున్నాడు. ఈ మాట యింత చిన్న పుస్తకంలో కనీసం పదెనిమిది కవితలను విశ్లేషించి చెప్పవచ్చు. యిది పోరాటాల వెంట నడిచిన కవిత్వం. అది వెన్నెలదారి కావచ్చు. నెత్తుటి రహదారి కావచ్చు. చరిత్ర కల్పించిన అనివార్యతలలోని పోరాటాలు, ప్రతిఘటనలు, ఎదురు దెబ్బలు, బూటకపు ఎన్‌కౌంటర్లలోని అమరత్వాలు... అన్నిటిలో నుంచి వచ్చిన కవిత్వ వ్యక్తీకరణ యిది. విప్లవ కవిత్వంలోని మౌలిక దినుసు పరిపుష్టిగా ఉన్న కవిత్వం.

'చేతి గడియారం ముళ్ళలయ / టిక్‌టిక్‌మని ప్రతిసెకను / ఎలర్ట్ చేస్తుంది / నా దేహమంతా / సంధించిన బాణమయింది / ట్రిగ్గర్ పై నా వేలు / బిగిసింది....

నా రెప్పలమాటున / సూర్యోదయం దాగివుంది. పేరు వెన్నెలదారి కావచ్చు గాని, ఏమరపాటు లేకుండా యుద్ధ సంకేతాలను పంపుతూ మనలను ఎలర్ట్ చేస్తుంది. ఊరకే కాదు, మూసిన కనురెప్పల మాటున సూర్యోదయం దాగి ఉన్నదనే ప్రకృతికి, మానవ సమాజానికి సంబంధించిన గతితర్కసత్యాన్ని కవిత్వంలా సంధిస్తూ....

*

## అంతస్సూత్రం

కవిత్వం

వరవరరావు

"ఉన్నదేదో ఉన్నట్టు' తర్వాత వివి కవిత్వం. విరసంపై నిషేధం పెట్టాక అరెస్టయి ఏడున్నర నెలల జైలు జీవితంలో రాసిన పద్దెనిమిది కవితలు కూడా యిందులో ఉన్నాయి. వీటితోపాటు ఏడు అనువాద కవితలూ ఉన్నాయి.

ఈ కవిత్వం చదివాక సంభ్రమంతో కూడిన ఒక ప్రశ్న తలెత్తకమానదు. వివి కవిత్వంలో ప్రత్యేకత ఏమిటా? అని. అది అంత సులువుగా తేల్చుకోగలిగేది కాదు. దేనికంటే ప్రయోగమని చప్పున కనిపించే ప్రయోగాలేవీ ఆయన కవిత్వంలో ఉండవు. మొదటి నుండి వివి కవిత్వంలో ప్రతి సంపుటానికి ఒక ప్రత్యేకత ఉన్నది. ఒక్కో సంపుటి ఒక్కో సామాజిక స్థితిని, దశను కవిత్వ శిల్పంలో ప్రతిబింబిస్తూ ఒక కొనసాగింపుగా, విస్తృతిగా, గాఢతరమైన అభివ్యక్తిగా కనిపిస్తుంది.



వెల : 20/-
నయనోదయ ప్రచురణ
ఆవిష్కరణ : సాయిబాబ

విప్లవ కవిత్వపు వొరవడిని తీర్చిదిద్దిన కవుల్లో వివికి తనదైన ప్రత్యేకమైన ముద్ర ఉన్నది. ప్రజాపోరాటాల వెంట నడుస్తూ విప్లవ కవిత్వం స్పృశించవలసిన అన్ని జీవనోద్వేగాలను తనలోకి తీసుకొని, విప్లవ భూమిపై నుండి తన కవిత్వ స్వరాన్ని వినిపించడం ఒకానొక ప్రత్యేకత. గత పదిహేనేళ్ళలో ఈ అవగాహనకు వ్యక్తీకరణకు విప్లవోద్యమం - సామ్రాజ్యవాదాల మధ్య తెలుగు సమాజంలో సాగుతున్న తీవ్ర సంఘర్షణ గొప్ప శక్తిని సమకూర్చింది. సామ్రాజ్యవాద దుర్మార్గం, విధ్వంస స్వభావం చెప్పడంతోపాటు దానిపై జరుగుతున్న, జరగవలసిన పోరాటాల డైరెక్షన్ వివి కవిత్వశిల్పాన్ని తీర్చిదిద్దుతూ వచ్చింది. అందువల్లనే సామ్రాజ్యవాదంపై తెలుగులో వస్తున్న కవిత్వంలో వివి గొంతు విలక్షణమైనది. ఈ సంపుటిలోని కవితలన్నీ ఏ చిన్న ఫీలింగ్ దగ్గర బయలుదేరినా - అది మారుమూల, మార్జినల్, అట్టడుగు జీవితానుభవానికి; మనలోని మనకే తెలియని సున్నితమైన అనుభూతికి, అనుభూతి విధ్వంసానికి సంబంధించిన కవిత్వ వస్తువును స్వీకరించినా అది తప్పక సామ్రాజ్యవాద నేపథ్యాన్ని, సామ్రాజ్యవాద వ్యతిరేక చైతన్యాన్ని ప్రదర్శిస్తుంది. ఇవాల్టి జైళ్ళు, ప్రజలను ఆవరిస్తున్న జైలు సందర్భాలు పాత ఫ్యూడల్ ప్రభువుల కాలం నాటివి కావు. కనీసం వివి తన కవితాయానంలో ఇంతకు ముందు అనుభవించిన జైళ్ళలాంటివి కూడా కాదు. ఫ్యూడల్ జైలు పునాదులపై సామ్రాజ్యవాదం మరింత కట్టుదిట్టంగా గోడలు పెంచి, కరెంటు ముళ్ళ కంచెలను అల్లి ప్రజలను, భావాలను నిర్బంధిస్తున్న జైలు సందర్భం యిది. ఈ జైళ్ళకు, నిర్బంధాలకు వ్యతిరేకంగా బయట ప్రజల్లో ఉన్నప్పుడు రాసిన కవిత్వం - అలాంటి జైలు నిర్బంధంలోనే రాసిన కవిత్వం ఈ సంపుటిలో ఉంది.

సమాజం చాలా సంక్లిష్టంగా ఉన్నదని అందుకే కవిత్వం కూడా సంక్లిష్టంగా వస్తున్నదనే చాలా సవ్యమైన సూత్రీకరణను ఆవలివైపు నుండి చూస్తే సమాజ మానసిక స్థితి జైల్లో అక్రమనిర్బంధంలోని వొంటరి మానసిక స్థితిలాంటిదే కావచ్చు అనిపిస్తుంది. కాని వివి జైలు సంక్లిష్ట మనఃస్థితి కూడా దాని సారాన్ని అత్యంత సరళంగా, తాజాగా వెల్లడించింది. వివి కవిత్వంలోని వచన శైలి కూడ దీనికి ఒక కారణం కావచ్చు. ఈ సంపుటిలో జైలు జీవితానికి ముందురాసిన కవిత్వంలో కూడా ఈ లక్షణం ఉన్నది. 'అంతస్సూత్రం' అనే కవితను యిక్కడి నుండి - సామాజిక రాజకీయార్థిక అంశాలదాకా సవివరమైన వస్తు శిల్ప చర్చ చేయడానికి అవకాశం ఉన్నది. ముప్పై అయిదేళ్ళ నుండి విప్లవకవిత్వం రాస్తూ, రాబోయే కాలాల విప్లవకవిత్వానికి వస్తు శిల్ప దృక్పథ సంబంధమైన దారిచూపే వివి కవిత్వ సంపుటి ఈ అంతస్సూత్రం.

*

మంజీర జ్ఞాపకాలు

# నది ఆచూకీ

వ్యాసం

☆ వరవరరావు

ఇరవై ఏళ్ళుగా మంజీర నీళ్ళు తాగుతున్నాను గానీ ఇదమిద్ధంగా ఎప్పుడు ఎక్కడ ఇంత దగ్గరగా ఉన్న ఆ నదిని చూసానో చెప్పలేను. హైదరాబాదు మహానగరంలో లక్షలాది మందికి ఆ నీటిచుక్క గొంతుదిగందే పొద్దుపొడకపోవచ్చు. కాని వాళ్లలో చాల మందికి ఆ నది పుట్టుక, నడకల గురించిగానీ, దానిని తమ కలలతో కన్నీళ్లతో రక్త మాంసాలతో సాకి, మన దాహం తీర్చడానికి పంపుతున్న దాని పరివాహ ప్రాంత ప్రజల కడగండ్లు, పోరాటాలు, గోడు కూడా పట్టకపోవచ్చు.

మంజీర కవిగా, హోమియో వైద్యసిద్ధాంత కర్తగా ఇపుడు నగరంలోనే కాదు తెలుగు తెలిసిన సమకాలీన రాజకీయ సాహిత్య స్పృహ ఉన్న అందరికీ తెలుసు. విప్లవకారుడు రవిగా, శ్రీధర్‌గా పీడిత, పోరాట ప్రజలందరి హృదయాల్లో పదిలంగా ఉన్నాడు.

ఇపుడు పధ్నాలుగు జూన్ దొంగరాత్రి ఆయన మరో ముగ్గురు సహకామ్రేడ్స్‌తో పాటు అరెస్టయి చిత్రహింసలకు గురయి అమరుడయ్యాక ఒకటొక్కటే ఆయన వివరాలు తెలుస్తున్నాయి గానీ, తెలుస్తూ ఎంతో తెలుసనుకుంటున్న మనిషి గురించి నాకు అసలు దాదాపు ఏమీ తెలియదని తెలుస్తున్నది గానీ ఆయననొక పదిహేడేళ్ళ క్రితం మొదటిసారి చూసాను.

1989 మార్చి నెలాఖరున నేను జైలు నుంచి విడుదలయ్యాక అలిశెట్టి ప్రభాకర్ వీరన్న (వీరారెడ్డి) అనే ఒక ఉస్మానియా ఎం.ఎ.విద్యార్థిని పరిచయం చేసాడు. అచిరకాలంలోనే ఆయన మా ఇంట్లో మనిషయి పోయాడు. 90 జనవరి విరసం ఇరవై ఏళ్ళ సభల్లో అన్నీ తానై పనిచేసి విరసంలో చేరాడు.

హైదరాబాదు విశ్వవిద్యాలయంగా పిలుచుకునే సెంట్రల్ యూనివర్సిటీ డెబ్బైల జాదవపూర్ యూనివర్సిటీనో, కలకత్తా యూనివర్సిటీనో, ఖరగ్‌పూర్ ఐఐటినో తలపిస్తున్న రోజులవి. బంగారు పతకాలు పొందిన విద్యార్థులు స్నాతకోత్సవంలో వేదికల మీదికి వెళ్లి తిరస్కరిస్తూ చదువుల విలువను, ప్రతిభ అర్థాలను వివరిస్తున్న రోజులవి. (ఆరోజులు బహుశా కామ్రేడ్ వీరాస్వామి, భుజంగరెడ్డి వంటి విప్లవ విద్యార్థి నాయకుల అమరత్వంతో కాంపస్‌లలో జ్ఞాపకాలుగా మిగిలాయి.) తరచు అక్కడ జరిగే ఉత్తేజకరమైన సభలు, సమావేశాలకు వెళ్తుండే వాణ్ని. అక్కడ రెండే వర్గాలు. సంపన్నులైన అగ్రకులాలు, ప్రతిభాశాలులైన దళితులు, చాలా తక్కువ సంఖ్యలో ఆదివాసీలు. అప్పటికింకా నగరంలో బలంగా ఉన్న రాడికల్ విద్యార్థి ఉద్యమ బలంవల్ల చైతన్యవంతులైన అగ్రకులాలవారు, దళితులు కలిసి ప్రోగ్రెసివ్ స్టూడెంట్స్ యూనియన్ ఏర్పాటు చేసుకున్నారు. బహుశా 86లో ఎన్టీఆర్ జనాకర్షణగా ప్రకటించిన ఒబిసి రిజర్వేషన్ల పెంపు (25% నుంచి 40కి) 90లో వచ్చిన మండల్ కమీషన్ రిపోర్టు ఈ విశ్వవిద్యాలయం దేశమంతటి వలెనే ఒక సంఘర్షణ కేంద్రం కావడానికి కారణమైనదేమో అయితే 1986 నుంచే రిజర్వేషన్ అనుకూల విద్యార్థి ఉద్యమం వెనుక ఒక స్పష్టమైన ఆచరణాత్మక దృక్పథంతో రవికుమార్ నాయకత్వం ఉందని నాకు తెలియదు. నిజానికి ఈ విద్యార్థి ఉద్యమంలో నేను విడుదలయ్యేటప్పటికే పనిచేస్తున్న వీరన్న నన్ను 'అరుణతార' లో వెతల అప్రతిభ పేరుతో రాసిన 'డాఝూవు' కవిత చదివినందువల్లనే పరిచయం చేసుకోవాలనుకున్నాడు. అందుకే ప్రత్యేకించి నన్ను అటువంటి ఒక రోజు హైదరాబాదు విశ్వవిద్యాలయం క్యాంపస్‌లో ఒక బక్క పల్చని తెల్లని సుకుమారమైన యువకుణ్ని పరిచయం చేసాడు రవి అని.

ఇప్పుడు దాచుకున్న మొగలి పొట్ట విప్పుతుంటే తెలుస్తున్నట్లు ఇటు వీరారెడ్డి వంటి వాళ్ళను ముందుపెట్టుకొని విద్యార్థి ఉద్యమాన్ని, ఇటు ఎంఎస్ఆర్, విశ్వనాథ్ మొదలైన వారిని నిమగ్నం చేసి కార్మిక రంగాన్ని నిర్మాణం చేసిన విప్లవకారుడతడని, 23 ఏళ్లుగా అతని వృత్తియే విప్లవమని. నాకిట్లా పరిచయమయ్యేనాటికే పీపుల్స్‌వార్ జిల్లా కమిటీతో ఒకనిగా పనిచేస్తూ అరెస్టయి విడుదలయి వచ్చాడని మీడియా వార్తల ద్వారా తెలుస్తున్నది.

1986-92 మధ్యన హైదరాబాదు నగరంలోని విద్యార్థి ఉద్యమం విప్లవ విద్యార్థి ఉద్యమం ప్రేరణతో మూడు సందర్భాల్లో ప్రదర్శించిన చొరవను, చైతన్యాన్ని ప్రస్తావిస్తే రవి పాత్ర ఏమిటో పరిచయం కావచ్చు. ఇపుడు ఒబిసి రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళన ఢిల్లీ, పాట్నా, ముంబై* నగరాలలో జరుగుతున్నంత వికృతంగా 86లోనే ఇక్కడ జరిగింది. రాడికల్ విద్యార్థి సంఘం, చాలా విద్యార్థి సంఘాలు దానిని ప్రతిఘటిస్తూ రిజర్వేషన్ అనుకూల ఆందోళనను నిర్మిస్తూ మండల్ కమీషన్ రిపోర్టు విడుదలనాటికి రామజన్మభూమి ఆందోళనకు, రిజర్వేషన్ వ్యతిరేక ఆందోళనకు వ్యతిరేకంగా రాష్ట్ర బంద్ పిలుపు ఇచ్చి నిజాం కాలేజ్ గ్రౌండ్స్‌లో గొప్ప బహిరంగసభ నిర్వహించాయి. 'కమండల్‌కు మండల్‌కు మధ్యన సంఘర్షణలో మండల్ పక్షం నిలిచిన మీ అపూర్వ ప్రదర్శన నన్ను ముగ్ధుణ్ని చేసింది' అని అందులో పాల్గొన్న అగ్నివేశ్ ఆవేశంగా ప్రసంగించాడు. జన చైతన్య సమితి పేరుతో, అఖిలపక్ష విద్యార్థి సంఘటన పేరుతో ఈ ఉద్యమం మరింత ముందుకు వెళ్ళి ఆ తర్వాత ముఖ్యమంత్రి అయిన నేదురుమల్లి జనార్దన రెడ్డి ఇంజనీరింగు కాలేజిలను ప్రైవేటు పరం చేయాలన్న నిర్ణయాన్ని ప్రతిఘటించడంతో బలపడింది. ఈ ఉద్యమ ప్రభావం వల్లనే హైకోర్టు జనార్ధనరెడ్డి ప్రభుత్వ నిర్ణయాన్ని తప్పుపట్టింది. నేదురుమల్లి ప్రభుత్వం రాజీనామా చేయవలసి వచ్చింది. ఈ ఉద్యమం వెనుక రవికుమార్ వీరారెడ్డి, మర్రోజుల వీరన్న (అప్పటి పిడిఎస్‌యు నాయకుడు)ల ఛోదక శక్తిని ఆనాటి ఉద్యమంతో సన్నిహిత సంబంధం ఉన్న ప్రతి ఒక్కరూ గుర్తుపెట్టుకుంటారు.

1991 జనవరి 20న కువాయిట్‌ను ఇరాక్ ఆక్రమించుకున్నదని నెపంపెట్టి జార్జ్‌బుష్ ప్రభుత్వం (జార్జ్ వాకర్ బుష్ తండ్రి) ఇరాక్‌పై బాంబుల వర్షం కురిసింది . ఆ సామ్రాజ్యవాద దాడికి నిరసనగా హైదరాబాదులో ఒక విద్యార్థి ఐక్య సంఘటనను నిర్మించి క్యాంపస్‌లలో, నిజాం కాలేజ్‌లో ప్రదర్శనలు, వీధినాటికలు ప్రదర్శించారు. అప్పటి ఈ వీధినాటికలు ఎంత ఆదరణ పొందాయంటే కలకత్తాలో 1992 మేలో ఏర్పడిన ఎఐపిఆర్ఎఫ్ మహాసభల్లో ఆ తర్వాత డార్జిలింగు జిల్లాలోని సిల్గోరిలో కూడ ప్రదర్శించారు. కనిపించిన ఆ పాత్రల వెనుక, వాళ్ల సంభాషణల వెనుక, ఆ అవగాహన వెనుక రవికుమార్ వంటివారు ఉన్నారని ఇపుడర్థం అవుతుంటే ఏం కోల్పోయామో కూడ తెలిసివస్తున్నది.

---

* రిజర్వేషన్లకు వ్యతిరేకంగా అగ్రవర్ణాల విద్యార్థులు, ముఖ్యంగా వైద్య విద్యార్థులు ఎప్పుడు ఆందోళన చేసినా, అది 86లో కావచ్చు, హైదరాబాదు ఇప్పుడు మహానగరాల్లో కావచ్చు, దళితుల, అణగారిన ప్రజల వృత్తులను అవమానపరిచే రూపాలను ఎంచుకుంటారు. బూట్‌పాలీష్ చేయడం, వీధులు ఊడ్చడం, ప్లాట్‌ఫామ్‌లపై బస్‌స్టాండ్‌లలో కూలీలవలె బరువులు మోయడం వంటివి. ఇటువంటి 'నీచమైన' పనులు చేసేవాళ్ళకు ఉన్నత విద్యల్లో, ముఖ్యంగా వైద్యం వంటి ప్రతిష్ఠాత్మకమైన విద్యలో వీళ్ళకు రిజర్వేషన్లు అని వెక్కిరించడమన్న మాట. ఈ సారి ముంబై నగరంలో ఒక మోచి దీనికి సృజనాత్మకమైన జవాబు ఇచ్చాడు. తెల్లకోటు వేసుకుని, మెళ్లో స్టెతస్కోప్ వేసుకుని జనసమ్మర్దం ఉన్న స్థలంలో బూటు పాలిష్ చేయడానికి కూర్చొన్నాడు. వెనుక ఒక ప్లేకార్డు పెట్టుకున్నాడు అగ్రవర్ణ వైద్య విద్యార్థులారా చదువుకొనే మీరు దానిని అమ్ముకోవడానికే పనికొస్తారు. మా వృత్తిని అవమానంగా చూస్తున్న మీరు బూట్‌పాలిష్ చేయడానికే పనికిరారు. మేము బూట్‌పాలీష్ చేయగలం, సామాజిక న్యాయం సరిగ్గా లభిస్తే వైద్యవృత్తి ద్వారానూ ప్రజలకు సేవ చేయగలం. అది గుర్తించి గౌరవించండి.

ఒక మహత్తర సామూహిక కృషిలో మాకుటుంబంతో ఆయనకు ఒక నెలరోజులపాటు ఏర్పడిన అనుబంధం మరువలేనిది. వరంగల్‌లో 90 మే నెలలో రైతు కూలీ సంఘం మూడవ మహాసభలు నిర్వహించాలని నిర్ణయించుకున్నాక ఆ సంఘం అధ్యక్షులు గంజిరామారావు గారు బాలసముద్రం/బాగ్‌లింగంపల్లిలో మేమున్న ఇంటికి వచ్చి - ఎట్లాగూ మీరు హనుమకొండలో ఇల్లు ఖాళీ చేయాలనుకుంటున్నారుకదా- మహాసభలు అయిపోయేదాకా మీ ఇల్లు కార్యాలయంగా వాడుకొంటాం. మీరు ఎలాగూ ఆ బాధ్యతల్లో అక్కడికి రావాల కదా అన్నారు. సరే నన్నాం. మా ఇంటికి వచ్చి హనుమకొండ కుమార్‌పల్లిలో మేం కిరాయకున్న ఇంటి తాళపుచెవి అడుక్కపోయినవాడు రవికుమారే. ఆ తర్వాత ఆయన ఎక్కువగా రైతు కూలీ సంఘం సభ నిర్వహణలో బాధ్యత పంచుకున్న వరంగల్ విరసం కన్వీనర్ జనార్ధన్ (అమరుడు) తోనే గడిపినా రైతుకూలీ సంఘం సభల నిర్వహణలో అమరులు సూర్యంగారు, పరశురామ్, జనార్ధన్‌లతోపాటు మరికొందరం నిత్యం కలుసుకునేవాళ్లం.

ఆయన రూపమే కాదు మనసు కూడ చాల కోమలమయిందని రైతు కూలీ సంగం వాలంటీర్ల శిబిరంలో జరిగిన ఒక సంఘటన సమీక్షలోనే కనిపించింది. ఆయనదే ఊరు, ఏంచదివాడని కలిసున్నా ఆ కాలమంతా ఎప్పుడూ అడగలేదుగానీ ఎందుకో నా మనసులో ఆయన తెలంగాణ వాడు కాదనే అభిప్రాయం ఏర్పడింది. కర్నూలు జిల్లా నందికొట్కూరు వాళ్ల పుర్వీకులదని, ఆయన తండ్రి కాలేజి లెక్చరర్‌గా రంగారెడ్డి జిల్లా తాండూరులో ఇల్లు కట్టుకొని విశ్రాంతి జీవితం గడిపాడని, రవికుమార్ ఇక్కడే పుట్టి మాసాబ్ ట్యాంక్ పాలిటెక్నిక్‌లో ఆ తర్వాత జెఎన్‌టియులో చదివి ఇంజనీరింగు పూర్తి చేసి విప్లవోద్యమంలోకి వచ్చాడని నాకు ఆయన అమరత్వం తర్వాతే తెలిసింది.

ఆయన మీది ప్రభావాల గురించి కూడా నాకెక్కువగా తెలయదు. ఆయన అంత్యక్రియల సందర్భంగా జూన్ 17 అర్ధరాత్రి ఆయన కుటుంబం బసవగ వీరశైవ సంప్రదాయానికి చెందిందని, అతని ఇంటిపేరు మట్టాకాదు. మఠం అని తాండూరు వెళ్ళిన విరసం సభ్యులకు తెలిసింది.

'మాస్టారుతో కరుణా, నేనూ' అని ఆయన ఐ.వి. (సాంబశివరావు) అమరత్వం తర్వాత జూన్ 97 'అరుణతార'లో 'మంజీర' పేరుతో రాసిన స్మృతుల్లో 92-96 మధ్యకాలంలో 'క్రాంతి' పత్రిక స్టాఫ్‌గా ఆయనా, ఆయన సహచరి (తాయరమ్మ కధ ద్వారా ప్రసిద్ధమైన) కరుణ బుద్ధిజీవులుగానూ, సాహిత్యజీవులుగాను ఐవితో ఎంత ప్రభావితులయ్యారో అర్థమవుతోంది. ఇపుడు వెనక్కి తిరిగి ఆలోచిస్తే 92 మే 21న నేదురుమల్లి జనార్ధన్ రెడ్డి కాంగ్రెస్ ప్రభుత్వం సిపిఐ ఎంఎల్ పీపుల్స్‌వార్‌ను, రాడికల్ విద్యార్థి సంఘాన్ని మరో ఐదు ప్రజా సంఘాలను నిషేధించిన తర్వాత రవికుమార్ ఇంక నగరం వదిలిపోయాడేమో, ఇంకెప్పుడూ కలవలేదని గుర్తుకొస్తున్నది.

అయితే ఆయన గురించి తరచూ వింటూనే ఉన్నాం. బహుశా విప్లవ పార్టీల్లో రాజకీయాల గురించి, సాహిత్యం గురించి మాత్రమే కాకుండా వైద్య శాస్త్రం గురించి కూడా ఎక్కువ వాదవివాదాల్లో, చర్చల్లోకి తరచు వచ్చిన వ్యక్తి ఆయనేనేమో.

1990 జనవరిలో హైదరాబాదు నుండి 'సాహితీ మిత్రులు' సృజన మళ్ళీ ప్రారంభించారు. విరసం ద్వారా చలసాని ప్రసాద్ ద్వారా సృజనకు ఎంతో సన్నిహితుడైన ఎంఎస్ఆర్‌తోపాటు మంజీర అనే మరో కొత్త రచయిత రచనలు కూడ సృజనకు తరచు రావడం ప్రారంభమైంది. ఎంఎస్ఆర్ అమరుడయ్యేదాకా ఆయన ఒక్క రచనా సృజనలో అచ్చుకాలేదుకానీ (సృజనలో తన కవిత అచ్చుకావడానికి పదకొండేళ్ళయినా నిరీక్షిస్తానని పట్టుదలతో ఆయన రాసిన లేఖతో పాటు కాకతీయ ఎక్స్‌ప్రెస్ దహనంపై ఆయన రాసిన 'దృశ్యం చెరిగిపోదు, మచ్చ మాసిపోతుంది' అనే కన్‌ఫెషన్‌వంటి కవిత, మరోపాట సృజన 200 సంచికలో అచ్చయింది) మంజీర పాటలు, కవితలో మాత్రం 90 అక్టోబర్ నుంచి ఆఖరి సంచిక దాకా చాలా అచ్చయ్యాయి. మంజీర రెండు మూడ్స్ (జనవరి 92) మంజీర కవితలు ఐదు(జూన్ 91) అని ఒక కొత్త కవిని తెలుగు సాహిత్యానికి పరిచయం చేసిన సృజన, ఒక్క సంచికలోనే ఆయన రెండు పాటలు కూడ ప్రచురించిన సృజన ఆయన 'మైదాన గెరిల్లాలు' కవితను మాత్రం ప్రచురించలేకపోయింది. ఎంఎస్ఆర్ 'దృశ్యాదృశ్యం' కవితలోని ఆత్మ విమర్శనాత్మక విలువలు, లక్ష్యం, నిజాయితీ వల్ల వచ్చిన సంక్షోభాన్ని వ్యక్తం చేసే శైలి, పశ్చాత్తాపంలోని నిష్కాపట్యం వల్ల రచనలో వచ్చినా తీవ్రత గురించి 'సాహితీ మిత్రులు' లో ఎంతో ఆసక్తిదాయకమైన చర్చ జరిగిందో, మంజీర కవితలోని రాజకీయ అవగాహనా ప్రతిపాదన (అప్పుడది ఎక్కువ మంది 'సాహితీ మిత్రులు' కొంచెం అతివాదంగానే భావించారు) పట్ల కూడా అంతే చర్చ జరిగింది. ఆకుపచ్చ దుస్తులతో గెరిల్లాలు అడవిలో 'ఆకుల్లో ఆకులై' మనవచ్చునేమో కానీ మైదానాల్లో చేపలు ఈదడం ఎట్లా సాధ్యం అని మాకు అనిపించింది. ప్రజాసంఘాల నిషేధం తర్వాత ఇది అనివార్యమైనపుడు తిరిగి 2004 జూన్ 20న ప్రజాసంఘాలపై నిషేధం తొలగిస్తే చర్చలకు సంబంధించిన ఒప్పందపత్రంలో ఏడవ క్లాజు (గ్రామాల్లో నక్సలైట్లు తుపాకులు పట్టుకొని తిరుగరాదు అని పోలీసులు చేర్చిన షరతు) అంగీకరించడంలో చర్చల విధివిధాన నిర్ణయాల్లో ప్రతినిధిగా పాల్గొన్న నా అంగీకారంలో ఈ అవ్యక్త అవగాహనే పని చేసిందేమో అని ఇపుడనిపిస్తున్నది.

ఇదే కాలంలో, ఆ తర్వాత కూడ 'అరుణతార' లో కూడ 'మంజీర' పేరుతో 'నలంద' పేరుతో ఆయన చాల కవితలు రాసాడు. 1992 సెప్టెంబర్ - అక్టోబర్ 'అరుణతార' లో పాణిగ్రాహి వారసులుగా పెన్ను, గన్ను పట్టి అమరులైన అజ్ఞాత విప్లవకవులుగా యం.యస్.ఆర్, గోపాలరెడ్డిలను పరిచయం చేసాడు. గోపాలరెడ్డి (మహబూబ్ నగర్ జిల్లా కమిటీ సభ్యుడు) గురించి రాసిన అంశాలను బట్టి, సృజనలో అమరులపై వచ్చిన పాటలను బట్టికూడ 1986 నాటికే హైదరాబాదులోనే కాదు, దక్షిణ తెలంగాణ విప్లవోద్యమంలో కూడ ఆయన ఎంతో తలమునకలుగా ఉన్నడో ఊహించవచ్చు.

ఆయన కవిత్వం గురించి రచనలన్నీ ఒకచోట వచ్చినపుడు వివరంగా చర్చించుకోవచ్చు గానీ పాటకు, వచనకవితకు ఆయన చాలా స్పష్టంగా భిన్నమైన వ్యక్తీకరణ పద్ధతులు, భాష, శైలి ఎంచుకున్నాడు, పాటలకు ప్రజలబాణీలు, భాష ఎంచుకున్నాడు. వచన కవితలో తనదయిన 'మంజీర' ముద్ర కనిపిస్తుంది. వ్యంగ్యం, వైవిధ్యం, ఉత్తేజ ప్రేరణ, విప్లవోద్దీపన, కాల్పనికలేని విప్లవాశావహ ఊహ ఆయన కవితా లక్షణాలు. 'కూల్చనివ్వండి లెనిన్‌ను!' (అరుణతార అక్టోబర్ - నవంబర్ 1991) కవితలోని వ్యంగ్యం ఏ ప్రభావానికి లోనుకాని విలక్షణమైన విప్లవ కవితగా శివసాగర్ (శివుడు) 69లో లెనిన్ శత జయంతి సందర్భంగా రాసిన 'లెనిన్! నా లెనిన్' కవితను స్ఫురింపజేస్తుంది.

బహుశా తెలుగు నేలమీది హోమియోపతి వైద్యులకు, వాడే వాళ్ళకు అందరికీ ఆయన 'అరుణతార'తో ఆరంభించి లేవదీసిన చర్చతో పరిచయం ఉండే ఉంటుంది. దండ కారణ్యంలో ఆయన పనిచేసిన ఇతర ప్రాంతాల్లోనూ ఆయనతో సంబంధాల్లోకి వచ్చిన అందరికీ ఆయన హోమియోపతి చికిత్సతో కూడ పరిచయం ఉండి ఉంటుంది. (ఎందువల్లనో మరి ఐ.వి. ఆఖరి రోజుల్లో ఆయన క్యాన్సర్ వ్యాధి చికిత్స గురించి హోమియోపతి చర్చ చేసినట్లు ఆయన వ్యాసంలో దాఖలా లేదు. సాహిత్య చర్చకే సమయం చాలినట్లు లేదు.) ఈ చర్చలోని పెడధోరణులను పరిహరించి మార్క్సిస్టు శిబిరంలో హోమియోపతి వైద్యం గురించి ఉన్న తీవ్ర అనుకూల, వ్యతిరేక అభినివేశాల గురించి మాత్రం ముచ్చటేస్తుంది. 1968 నుంచే వరంగల్‌లో డాక్టర్ రామనాథం, డాక్టర్ భుజంగరావు మొదలైన కాకతీయ వైద్య కళాశాల అధ్యాపక విద్యార్థులు ఒక బృందంగా, డాక్టర్ అట్లూరి రంగారావు ఒక్కడుగా హోమియోపతి అశాస్త్రీయ, శాస్త్రీయ సమర్థనలో తీవ్రమైన చర్చలు చేసేవాళ్ళు. అట్లూరి రంగారావు గారు సమర్థనలో కరపత్రాలు, చిన్న చిన్న పోయాలు ప్రచురించారు. డాక్టర్

రామనాథంగారు ఏకంగా 'ఉదయం' పత్రికలో హోమియోలోని అశాస్త్రీయత గురించి (ముఖ్యంగా మెదడువాపు జబ్బుకు చికిత్సకు) రాసాడు.

చైనా శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవ కాలంలో (Away with all Pests) పుస్తకం వచ్చాక, సంగీత కళారంగాల్లో పని చేసే వారినుద్దేశించిన మావో రాసిన వ్యాసం సృజనలో అచ్చయ్యాక, అన్నిటికన్నా ప్రజా విజ్ఞాన సాంకేతిక రంగాల్లో వేల సంవత్సరాల ప్రజల ఆచరణానుభవం నుంచి వివేకసారంగా వెంచుకునే ఏ చికిత్సనూ, పద్ధతినీ నిరాకరించరాదన్న శ్రామిక వర్గ సాంస్కృతిక విప్లవకాలపు మదింపు తర్వాత ఈ చర్చ మళ్లీ మార్క్సిస్టు శిబిరంలో మంజీర తోనే మొదలయింది. అల్లోపతి వైద్యం గురించి ఎంతో శాస్త్రీయంగా సమర్థించే వాళ్ళు కూడ మందుల తయారీ (ఫార్మస్యూటికల్స్) మొదలుకొని ఈనాటి కార్పోరేటీకరణ వరకు అలోపతి చికిత్స మీద ఉన్న బహుళజాతి కంపెనీల పట్టు గురించి, వైద్యం పెట్టుబడి సంబంధంగా మారడం గురించి తగినంత వివరించకపోవడమే హోమియోపతి సమర్థనలో ఏడాపెడాధోరణులకు అవకాశమిచ్చిందేమోనని నా వ్యక్తిగత అభిప్రాయం.

ఇంక మంజీర శ్రీధర్‌గా మావోయిస్టు పార్టీలో 'మిలిటరీలైన్' ను సమర్థిస్తున్నాడని ఇటీవల పత్రికలు రాస్తున్నాయి. మావోయిస్టు విప్లవ రాజకీయాల్లో మిలిటరీ కూడ ప్రజా మిలిషియా (ప్రజాసైన్యమే)నని, దానిని ప్రజలు నియంత్రిస్తారని అవగాహన లేని, అంగీకరించలేనివారి ఆరోపణ అనుకుంటాను ఇది. బహుశా ఇట్లా రాస్తున్న వాళ్ళ మనసులో మైదాన ప్రాంతాల్లో గెరిల్లాల గురించి కవిత రాసిన మంజీర పదేళ్లలోనే నేపాల్ మావోయిస్టు పార్టీ సాధించిన మిలిటరీ విజయాలు, గెరిల్లా జోన్‌లు ప్రకటించి కూడ ఇక్కడి మావోయిస్టు పార్టీ సాధించలేకపోయిందని అభిప్రాయ పడుతున్నాడని ఊహించుకొని కావచ్చు. ఏమైనా ఇవ్వాళ,నేపాల్‌లో పరిణామాలు చూస్తున్నవాళ్ళు కులము, పార్లమెంటరీ రాజకీయాలు అనే ఒక అతిప్రాచీనరోగం, ఒక అందమైన కొత్త రోగం పెద్ద అవరోధాలుగా ఉన్న మన విప్లవోద్యమం తన విజయావకాశాలకు పరిష్కారాలు నక్సల్బరీ పంథాలోనే ఆవిష్కరించుకుంటుదని మంజీర కూడ ఆఖరి శ్వాస దాకా ఆచరిస్తూ విశ్వసిస్తూనే ఉండి ఉంటాడు.

సృజన - 200 (డిసెంబర్ 92) లో రాసిన 'సోమాలియా ఆక్రందన' కవితలో 'సామ్రాజ్యవాదం మృత్యువు' అనే మాటకు ఆయన 'అది మాయలు నేర్చిన శత్రువు' అని చేర్చాడు. మీకే తెలియని విషాన్ని శరీరంలో చొప్పిస్తుంది. దేశంలో వెదజల్లుతుంది... 'గార్డెన్ ఆఫ్ ఈవ్....' లో పుట్టిన మనుషుల్ని 'మానవతను తుడిచేసి' వింత జంతువులుగా మిగులుస్తుందని చెప్తూ మానవాళిని కాపాడడం కోసం సామ్రాజ్యవాదాన్ని అంతమొందించండి'. 'ప్రపంచాన్ని మీ కోసం, మా కోసం, మనందరి కోసం రక్షించండి' అనే సందేశంకోసం పోరాడుతూ మానవాళిని కాపాడే మహత్తర విప్లవంలో గెరిల్లాగా బూడిదరంగు వింత జంతువుల 'ఎన్‌కౌంటర్'లో అమరుడయ్యాడు. ఆయన మరో ముగ్గురు సహకామ్రేడ్స్‌తోపాటు.

ఆయనే రాసుకున్నట్లు ఆయన నేలను, నింగిని చందమామను, వెన్నెల చల్లదనాన్ని తూర్పుగాలి మోసుకొచ్చే పొలాల వెచ్చదనాన్ని మనసారా అందుకుంటూ నిషిద్ధ స్వప్నాలు కన్నాడు. ఇవ్వాళ 'నిన్నటి దాకా తనతో గుసగుసలాడి నింగికెగసిన తారల్లో' ఒకడయ్యాడు.

అతడు అమరురాలు స్వర్ణలత మీద ఒక పాట రాసాడు. ఒక ఊరి ప్రజలు మళ్ళీ ఒకసారి వెళ్లినపుడు ఆ పాటను గుర్తు చేస్తే ఒక కవిత రాసాడు.

మనిద్దరం కలిసి నడిచిన
ఆ తోట దృశ్యంలోకి
నేను ఒంటరిగా అడుగుపెట్టాను
అనాడు మనకు పరిమళం పంచిన పూలు
గతం గుర్తు చేస్తూ
నీ సుగంధాన్ని వెదజల్లాయి
కొమ్మలపై ఊయలలూగుతూ
ఆకుల వేణువులపై గాలి
నీ పాటలేపాడింది
నీ ఆచూకి అడిగింది
ఆ తోటకెలా చెప్పను
అమరత్వ శికరాల మీద
ఆకాశం పూతోటలో నువ్వు
అరుణ పుష్పానివైనావని,

ఇపుడాయన గురించి ఆయన సహచరి విప్లవంలో ఈ పాటే పాడుకొంటుందా!

ఆమె ఇన్నాళ్లుగా అతనినేనమ్మింది
ఇప్పుడు అతనితో కలిసి విముక్తిని నమ్మింది

('ఆమె' మంజీర సృజన జూన్ 91)

*

# స్వీకారం

1. **ఖిబ్లా**
   ఇస్లాంవాద కవితా సంకలనం
   ప్రచురణ : ముస్లిం రచయితల సంఘం, ఆం.ప్ర.
   వెల : రూ. 30/-
   ప్రతులకు : షేక్ కరీముల్లా
   డో.నెం. 21-36, పెద్దమసీదు బజార్,
   వినుకొండ, గుంటూరు జిల్లా.
2. **ఆధునిక తెలుగు సాహిత్యం స్త్రీవాద భూమిక**
   కాత్యాయనీ విద్మహే
   ప్రచురణ : స్త్రీ జనాభ్యుదయ అధ్యయన సంస్థ, వరంగల్లు.
   వెల : రూ. 50/-
   ప్రతులకు : కాత్యాయనీ విద్మహే
   డో.నెం. 5-11-667, పశ్యంతి,
   కాకతీయ విశ్వవిద్యాలయం రోడ్,
   విద్యారణ్యపురి, వరంగల్.
3. **మిత్తవ**
   మంచికంటి కథలు
   ప్రచురణ : క్రాంతి ప్రచురణలు
   వెల : రూ. 60/-
   ప్రతులకు : మంచికంటి
   బీచ్‌రోడ్,
   కొత్తపట్నం, ప్రకాశం జిల్లా.
4. **మొగ్గజడ**
   బాలగొండ ఆంజనేయులు
   ప్రచురణ : షిరిడీ సాయి పబ్లికేషన్స్, అనంతపురం.
   వెల : రూ. 50/-
   ప్రతులకు : బీ.ఆంజనేయులు
   డో.నెం. 28-3-724, ఫెరర్ కాలనీ,
   ఐదవ క్రాస్, అనంతపురం.

పుస్తక సమీక్ష

☆ పలమనేరు బాలాజి

# మా వూరి మహా వైద్యగాడు
## మరికొన్ని మరపురాని కథలు

కథలు అందరూ రాయగలరు.

కానీ గుర్తుండిపోయే కథలు మాత్రం కొందరే రాయగలరు. ఆ విధంగా గుర్తుండిపోయే కథలు రాసిన వాళ్ళల్లో జి.ఆర్. మహర్షి ఒకడు. అతడి కథా సంపుటి "మా వూరి మహా వైద్యగాడు".

మనిషి పట్ల మనిషికి వుండే మమకారం చేత, బాధ్యత చేత, భవిష్యత్ పైన నమ్మకం, వర్తమానం పైన నిరాశ కలిగి వుండటం చేత రాయబడిన కథలు ఇవి.

సామాజిక జీవితంలోని ఘర్షణ గురించి, సంక్షోభం గురించే రాసినా, చాలా మంది రాసిన కథలు కన్నీటి తడిని మాత్రం మిగిల్చి, కనుమరుగై పోతాయి. అలాంటి కథలవల్ల, ఏడుపు వల్లా ఎలాంటి సామాజిక ప్రయోజనమూ వుండదు. కథ ప్రయోజనం కన్నీరు కాదు కదా.

మంచి కథ ఒక కొత్తదృష్టిని, మెలకువని కలిగించాలి. పాఠకుడిని చైతన్య పరచాలి. అవగాహనని మెరుగుపరచాలి. కొత్త ఆలోచనల్ని కలిగించాలి. అలాంటి కథల్ని మళ్ళీ మళ్ళీ చదవాలనిపిస్తుంది. ఒక్కసారి చదివినా చాలా కాలం గుర్తుండే కథలు మెరుగైన కథలు.

పదునైన సంభాషణలు, వస్తు వైవిధ్యం, కథనంలో కొత్తదనం, చురుకుదనం ఈ కథల ప్రత్యేకత.

"మరో భేతాళుడు', 'అనగనగా పులి', శంకరం అనే ఆర్.ఎస్. కథ' - ఈ మూడు కథలు 1990కి ముందు రాసినవి, అచ్చయినవి. ఈ మూడు కథల్లో పదునైన వ్యగ్యం, హాస్యం కలగలసి వుంటాయి.

తను మాత్రమే రాయగలిగిన, రాసిన కథలు మా వూరి మహా వైద్యగాడు (1991), విధ్వంసదృశ్యం (1992), నేను బతకలేను సిన్నమ్మా (1993), జలపాత సంగీతం (1995), పురాగానం (2002), దెయ్యం (2004) కథలు రచయితకు మంచి గుర్తింపును తీసుకు వచ్చాయి. ఈనాడు కథల పోటీలో మొదటి బహుమతి పొందిన పదిశేర్ల జొన్నలు (2004) కూడా ఈ కథా సంపుటంలో వుంది.

రాయలసీమ జీవితాన్ని గురించి ఎక్కువ కథలు రాసిన రాయలసీమ కథా రచయితల నడుమ, వస్తువైవిధ్యం, కథా కథనంలో కొత్తదనంతో ప్రయోగాత్మక కథలు రాసిన మహర్షి ప్రత్యేక ఆకర్షణగా నిలుస్తాడు.

ముందు మాటలకు కాలం చెల్లి చాలా కాలమే అవుతున్నా, ఈ పుస్తకానికి విలువైన ముందుమాటను "నట్టింట్లోకి వెళ్ళే ముందు" అనే శీర్షికన శ్రీ రమణ రాసారు. రచయిత గురించి చెపుతూ - ఇలాంటి కొందరు విధిలేక నగరాలకు వస్తారు. వచ్చేటప్పుడు వాళ్ళ పల్లె నుంచి మట్టి కాళ్ళతో వస్తారు. జేబుల్లో, చే సంచుల్లో అక్కడి మాటల్ని తనివితీరా కుక్కుకు వస్తారు. ఏ దేశమేగినా, ఎందు కాలిడినా యిలాంటి కొందరు ఆ మాటల్ని, ఆ మనుషుల్ని, ఆ జ్ఞాపకాలని - ఆ మట్టి కాళ్ళలో మరం వేసుకు కూచుని గంగి గోవుల్లా నెమర్లు వేస్తుంటారు. వీళ్ళంతా రథం మీద జెండాల్లాంటి వారు. జెండా కర్ర ముందుకు వెళ్తున్నా జెండా బయలుదేరిన వైపు చూస్తూ, రెపరెపా గుండెచప్పుడు వినిపింపచేస్తుంది. ఇది తిరోన్ముఖం కాదు. పేగుబంధం" అంటాడు శ్రీరమణ.

* * *

హాస్య, వ్యంగ్య కథలకు మొహం వాచిపోయిన పాఠకుల్ని ఈ కథా సంపుటంలోని "మరో భేతాళుడు", "అనగనగా ఒక పులి" "శంకరం అనే ఆర్.ఎస్, కథ" "సుందరం బావ ఇల్లు", "సామెత చెప్పినట్లు", "దెయ్యం", 'పెద్ద చెవుల సుబ్బా' కథలు ఆకట్టుకుంటాయి.

మరో భేతాళుడు నిజానికి భేతాళుడి గురించిన కథ కానట్లే, జలపాత సంగీతం కూడా అందుకు సంబంధించిన కథకాదు. మరో భేతాళుడు, జలపాత సంగీతం కథల పేర్లు మార్చి వుంటే బావుండేది.

రాజ్యం యొక్క అధికారం గురించి, ప్రభుత్వ పనితీరు గురించి రాజకీయ నాయకుల అవకాశవాదం, స్వార్థ చింతన గురించిన కథ 'మరో భేతాళుడు' కోతుల బెడదను, అసమ్మతి బెడదను రాజు ఒకేసారి పరిష్కరించుకున్న విధానం ఆసక్తికరంగా వుంటుంది. సమకాలీన రాజకీయ వ్యవస్థను విమర్శనాత్మకంగా చిత్రించిన కథ ఇది.



వివిధ ప్రభుత్వ కార్యాలయాల, అధికారుల అలసత్వానికి, పనితీరుకి, కాలయాపనకి నిలువుటద్దం 'అనగనగా ఒక పులి! ఒక వేళ నిజంగానే మనం వుంటున్న ప్రాంతంలోకి పులి వస్తే ఏం జరుగుతుందో - అదే ఈ కథ. పోలీసుల తుపాకుల గురి గురించి, ఫారెస్టాఫీసు గురించి, మున్సిపల్ ఆఫీన్ గురించి కొన్ని చురకలు వున్నాయి. చూడండి-

"ఎదురుగా రాళ్ళేసేవాడికి గురిపెట్టి కాలిస్తే, ఎక్కడో వుండే రిక్షావాడు హరీమంటుంటాడు.

"ఎండిపోయిన చెట్ల మధ్య ముదురు ఆకుపచ్చరంగులో ఒక బిల్డింగు వుంటుంది. - అదే ఫారెస్టాఫీసు - ఇంకా వివరాలు కావాలంటే దాని ముందు చెట్లను పెంచండి - అడవులు నరకండి అంటూ ఇలాంటి స్లోగన్లేవో రాసుంటారు".

"మురుగు కాలువ వెంబడే వెళ్ళండి. దీని వాసన ఎక్కడ ఎక్కువవుతుందో సరిగ్గా అక్కడుంటుంది. మున్సిపల్ ఆఫీస్.

కథ చివరన అసలు పులులెవరో పాఠకులకు తెలిసిపోతుంది. యూనివర్సిటీల్లో రీసెర్చి స్కాలర్లు పొందే సన్మానాలు, చేసే చాకిరీల గురించిన కథ "శంకరం అనే ఆర్.ఎస్.కథ".

ఒకే ఒక్క టీవీ కారణంగా ఇంటిల్లిపాదిలో కలిగే మార్పులు, కోపతాపాలు, పట్టింపులు, వికారాలను సుందరం బావ ఇంట్లో మనం చూసినప్పుడు తప్పకుండా నవ్వుకుంటాం.

పెండ్లిండ్లలో జరిగే అధికార ప్రదర్శన, నోటి దురుసుతనం గురించి, మానవ ప్రవర్తనలోని విపరీత ధోరణుల గురించి చమత్కారంగా చెప్పిన కథ "సామెత చెప్పినట్లు".

నగరాల్లో అపార్ట్‌మెంట్స్ నివాసాల గురించి, ఆధునిక జీవనంలోని లొసుగుల గురించి ఆద్యంతమూ హాస్యం, వ్యంగ్యం కలసిన కంఠస్వరంతో చెప్పిన కథ "దెయ్యం".

రాయిని పట్టుకుంటే బంగారంగా ఎలా మారుతుందో పెద్ద చెవుల సుబ్బానే చెప్పాలి. మనుషుల అమాయకత్వం గురించి, కొందరి ప్రయోజకత్వం గురించి కలిపి చెప్పిన కథ "పెద్ద చెవుల సుబ్బా".

మొత్తం పదహారు కథల్లో ఈ ఏడు కథలూ హాస్య, వ్యంగ్య కథలే. అయితే ఇవి కేవలం హాస్యం, వ్యంగ్యం మాత్రమే కల కథలు కావు. చాలా సీరియస్ విషయాల్ని పదునుగా చెప్పిన కథలు. మనల్ని భుజం తముడుకునేట్లు చేసే కథలు.

* * *

మిగిలిన తొమ్మిది కథల్లో "నన్ను క్షమించుకన్నా!" అనే కథ రాయలసీమ ప్రాంతానికి చెందిన ఒకరైతు మనోవ్యథతో తన కొడుక్కి రాసిన ఉత్తరం.

కాలువను కలవరిస్తూ తులసి తీర్థం బదులు కాలువ నీళ్ళు అడిగి ప్రాణం విడిచిన తండ్రిని గురించి, కాలువను అడ్డం పెట్టుకుని రాజకీయ ప్రాబల్యం పొందిన నాయకుల గురించి, కోడి కంటే ముందే లేచి, గొడ్డుకంటే అన్యాయంగా కష్టపడి, కాలికి గుచ్చుకున్న కంపపుల్లని కూడా వంటకోసం ఇంటికి తీసుకువచ్చి, అనారోగ్యంగా వున్నా ఆరోగ్యంగా వున్నట్లు నటించే భార్య గురించి, డాక్టరుకు రెండు వందలు ఇచ్చి వైద్యం చేయించుకోవటం కంటే, కోడి మాంసం తిన్నాక ప్రాణం పోయినా పర్వాలేదనుకునే రంగయ్య మామ గురించి, తన పరిస్థితి గురించి చెపుతూ రైతు ఒక మాట అంటాడు. ఉత్తరం చివర్లో-

"నాకేమైనా జరిగితే అప్పులు నీ నెత్తిన పడతాయి. ఆ భారాన్ని నువ్వు మొయ్యలేవు. అప్పులు తీర్చటానికైనా నేను బతికుండాలి. నీ మనసు బాధ పెడితే నన్ను క్షమించు కన్నా". కొడుకు చదువుల కోసం ఫీజులు కట్టలేక బాధపడే రాయలసీమ రైతు కన్నీటి కథ ఇది.

మహర్షి చాలా శక్తివంతమైన వచనం రాయగలడని, ఈ కథలో కొన్ని వాక్యాల్ని చదివితే స్పష్టమవుతుంది-

కాలువంటే ఒక ఎండమావి అంతే.

ఒకసారి పంట బిడ్డలాగా ఎదిగొచ్చింది.

రైతు పరిస్థితి మూగెద్దుకంటే అన్యాయం. ఎద్దుకి కోపమొస్తే కొమ్ముతోనైనా పొడుస్తుంది.

బస్సు దిగిన తరువాత ఇంట్లో కంటే ముందు ఎద్దుల కొట్టంలోకి వెళ్ళేవాన్ని.

విషం తాగాలన్నా 'నా చేతిలో పైసాలేదు.

నిన్ను జమిందారుల బిడ్డలాగా పెంచలేకపోవచ్చు. కాని రైతుబిడ్డ మాదిరి పెంచటానికి నేనూ, మీ అమ్మా కూలి వాళ్ళ మయ్యాం. ఎర్రటి ఎండలో తట్టలు మోశాం.

నేను భూమిని నమ్ముకుని బతికేవాన్ని సేద్యం నా కల.

డబ్బుంటే చదువు. చదువుంటే మరింత డబ్బు. ఇదొక సూత్రం. ఎదుటి మనిషి దుఃఖాన్ని అర్థం చేసుకునే శక్తి ఈ చదువులకుందా? అని ప్రశ్నిస్తాడా రైతు. సమాధానం మనకందరికీ తెలిసిందే.

దెయ్యాలు పాత్రధారులైన మరోకథ 'జలపాత సంగీతం' కవితలాగా మొదలయ్యే ఈ కథలో కొన్ని వాక్యాలు ఎప్పటికీ గుర్తుండిపోతాయి. ఈ కథలో, కథనంలో కొత్తదనం ఉంది.

'ఇప్పుడు నా శరీరమే ఒక మేఘమైంది'.

అడవి ఒక పాటల పెట్టె. ప్రతిక్షణమూ గానమే. సెలయేరు ఒక పాటల ప్రవాహం.

నాలుకకు సానపెట్టక పోతే నీళ్ళు దొరకవు (పంపు దగ్గర) దెయ్యాలకు అన్నింటికంటే గొప్ప విషాదం ఏమిటో తెలుసా? చావు లేక పోవడం.

రాజ్యహింసకు వ్యతిరేకంగా పోరాడే / పోరాడాల్సిన యువతరం కర్తవ్యాన్ని గుర్తుకుచేసే ఈ కథలో ముగింపును చివరి మూడు పేజీలు, రెండు దృశ్యాలను తిరిగి రాయాల్సిన అవరం వుందనిపిస్తుంది. ఇద్దరు వ్యక్తులు, వారి బిడ్డ కథలోకి హఠాత్తుగా ప్రవేశించటం, కోట బయట వుండే బ్రహ్మాండమైన వృక్షం గురించి ప్రారంభంలో ప్రస్తావించకపోవటం, ఆ వృక్షం ద్రోహ వృక్షమా లేక, రాజ్యం యొక్క నిరంకుశత్వానికి ప్రతీకనా అనేది స్పష్టం కాకపోవటం కథను బలహీన పరచే అంశాలు శిల్పం రీత్యా 'పురాగానం', 'విధ్వంసదృశ్యం', 'జలపాత సంగీతం' కథలు ఇతర భాషల్లోకి అనువాదం కావాల్సిన కథలు.

కథ 93లో అచ్చయిన 'విధ్వంస దృశ్యం' మానవీయ విలువల్ని ఆవిష్కరిస్తూ ఎన్నో ప్రశ్నల్ని రేకెత్తిస్తుంది. విలువల పతనాన్ని ఎత్తి చూపిన కథగా ఈ కథ గొప్ప గుర్తింపును పొందింది. ఈ కథ మలుపు తిరగదు కానీ మెరుపులాంటి వాక్యంతో ముగుస్తుంది.

సత్యాన్ని అన్వేషిస్తూ వెళ్ళిన కోతి అనుభవాలు, చివరగా అది తెలుసుకున్న సత్యం, అందుకు చెల్లించిన మూల్యం పార[illegible] హృదయాలను కదిలించివేసే కథ - 'పురాగానం'.

కోతి ప్రశ్నలు సాధారణమైనవి కానట్లే ఈ కథ కూడా సాధారణమైన కథేమీ కాదు. ఈ కథ గురించి శ్రీరమణ తన ముందు మాటలో 'ఈ పురాగానంలో మనసుని చెదరగొట్టే ఆలోచన ఉంది. ఆ ఆలోచనలో మెరుపు వుంది' అంటాడు.

'నేను బతకలేను సిన్నమ్మా' మరొక విషాదకరమైన కథ. ఒక చాకలి వాడి కథ. ఊర్లో రెడ్ల మధ్య తగాదా వాళ్ళిద్దరి మధ్య నలిగిపోయి దెబ్బలు తిని, దెబ్బలకు భయపడిపోయి పట్నం చేరిన రంగడు పోలీసుల దెబ్బలు తిని పూర్తిగా బెదిరిపోతాడు.

'నేను బతకలేను సిన్నమ్మా. ఆ నాశినమైన వూర్లో బతకలేను' అనే రంగడి ఏడుపుతో కథ మొదలవుతుంది.

"సిన్నమ్మా మూడు రోజుల్నుంచి పసరాన్ని కొట్టినట్లు కొట్టినారు వూర్లో రెడ్లు, ఈడ ఈ పోలీసోళ్ళు. నేనింక ఎక్కడికి పోయి బతికేది సిన్నమ్మా. నేను బతకలేను సిన్నమ్మా" వలవలా ఏడుస్తాడు రంగడు కథ చివర్లో.

రంగడి లాంటి వాళ్ళు ఎక్కడా బతకలేరు. భయం వాళ్ళని బ్రతకనివ్వదు. బ్రతకాలంటే భయాన్ని జయించాల్సిందే. సమకాలిన ఫ్యాక్షన్ పరిస్థితుల్ని పోలీస్ పద్ధతుల్ని చూపించిన కథ ఇది.

బిడ్డల్ని కాపాడుకోవడానికి దుష్టుల మెడ నరికే దుగ్గిలమ్మ తల్లిని లక్ష్మి అక్క కళ్ళల్లో చూస్తాడు కథకుడు "దుగ్గిలమ్మ" కథలో అనుమానాల మొగుడితో, అవమానాలతో కాపురం చేయలేక, తమ్ముడి ఆసరాను వెదుక్కుంటూ తిరిగొచ్చిన లక్ష్మి జీవితంలో మరోసారి మరో మొగవాడి చేతిలో చావుదెబ్బలు తింటూ, తన కొడుకు ప్రాణం కాపాడుకోవటానికిగానూ రాక్షసుడిలాంటి రుద్రడ్డి కత్తితో నరికేస్తుంది.

"గుండెకోసి చూపించినా ఆడదాని మనసు అర్థం చేసుకోరమ్మా మగాళ్ళు అంటుంది లక్ష్మి.

'పదిశేర్ల జొన్నలు' మానవీయ విలువలకు సంబంధించిన కథ. కథల పోటీల్లో బహుమతులు గెల్చుకున్న చాలా కథలు నిజానికి చాలా కాలం గుర్తుండవు. కానీ ఈ కథ గుర్తుండిపోయే కథ .

కడుపుకింత తిండిలేని పరిస్థితుల్లో, ఆకలితో బిడ్డను చావనియ్యటం ఇష్టంలేని ఎరుకల దంపతులు పదిశేర్ల జొన్నలు తీసుకుని బిడ్డను వదులుకుంటారు. బిడ్డ తింటే అమృతం, తాము తింటే విషం అని ఆ బిడ్డని అపురూపంగా సాకుతారు బిడ్డను తీసుకున్న వాళ్ళు. బిడ్డకు అవమానం జరక్కూడదని, పల్లెను విడిచి, టౌన్‌ను విడిచి అనంతపురం చేరుకుంటారు వాళ్ళు.

ఆ కొడుకు పెద్దవాడయినాక, జరిగింది తెలుసుకున్నాక, 'జొన్నలోడా' అనే అవమానకరమైన ఎగతాళి పిలుపునే తన ఇంటిపేరు చేసుకుంటాడు. చావులో సైతం తనతో పాటు కాసిన్ని జొన్న గింజల్ని కూడా పాతిపెట్టమంటాడు పెంచిన తండ్రి.

"నా జీవితంలో శానా సంతోషాన్నిచ్చాయి ఈ జొన్నలు. వాటిని కూడా నాతోపాటు వుంచు" అంటాడు. ఆ బిడ్డ పెద్దవాడవుతాడు. తాత అవుతాడు. అతడి మనుమడు కాలక్రమంలో ఎంతో గొప్పవాడైనా సరే ఆ తాత జొన్న రొట్టెనే ఇష్టంగా కళ్ళకద్దుకుని తింటాడు.

జొన్నల్ని కానీ ఈ కథని కానీ ఎవరైనా మరచిపోగలరా? ఈ కథా సంపుటంలోని చివరి కథ 'నల్లబానిస కథ'.

బానిసత్వపు సంకెళ్ళను తెంపటానికి ముందుకొచ్చిన పోరాట యోధుడు స్పార్టకస్ ప్రాణాల్ని రక్షించటానికి గానూ మల్ల యుద్ధంలో ఓటమిని అంగీకరించటానికి, తన ప్రాణాలు పోగొట్టుకోవటానికి సిద్ధపడిన డ్రాబా త్యాగం కూడా వీరత్వమే అని అర్థమవుతుంది. కథ చివర్లో విషాదం వుంది. అయితే అది విషాదం మాత్రమే కాదు రేపటి విజయాల పైన విశ్వాసం కూడా. నేటి త్యాగాలపైన నమ్మకం కూడా. ఇట్లాంటి కథలు రాయాలంటే రచయితకు చరిత్రతోబాటు ఇతర సామాజిక శాస్త్రాలతో పరిచయం, అవగాహన వుండాలి. మహర్షికి అవి వున్నాయని ఈ కథ చెపుతుంది. చివరగా చెపుతున్న కథ ఈ కథా సంపుటంలోని మొదటి కథ 'మా వూరి మహావైద్యగాడు'.

ఈ కథంతా కొండయ్య తాత చుట్టూనే తిరిగినా, ఈ కథ ఒకానొక కొండయ్యతాత గురించిన కథ మాత్రమే కాదు. ఇదొక తరం కథ. కుటుంబం తనను విడిచి పెట్టినా, తాను ఊరును విడిచి పెట్టనివాడు, మంచి తప్పు చెడు తెలియనివాడు, దేనికీ ఎవరి ముందూ తలవంచనివాడు, చేతులు చాపనివాడు కోడిపుంజుల్ని కూడా కన్నబిడ్డల్లా సాకేవాడు కొండయ్య తాత. భారతీయ సంస్కృతీ తాత్వికత, శ్రమైక జీవనం కలగలిసిన ఒకతరం ప్రతినిధులు అక్కడక్కడా వుంటారు. వయసు రీత్యా వాళ్ళు కనుమరుగవుతూ వుంటారు. తనను తాను ఇష్టపడినంత స్వచ్ఛంగా ఇతరుల్ని కూడా ప్రేమించగలిగిన మనసు, జీవితంపట్ల అనురాగం, సాటి మనుషుల పట్ల మమకారం కలగలిసిపోయిన కొండయ్య తాతను మరచిపోవటం ఎవరికైనా అసాధ్యం.

మనుషులు పోతారు - జ్ఞాపకాలు మిగులుతాయి అనే వాక్యంతో కథ ముగుస్తుంది. కొండయ్య తాత జ్ఞాపకం పాఠకుల్ని వెన్నాడుతూనే వుంటుంది.

ఈ కథలన్నీ మనల్ని కలవరపెట్టేవే. గ్రామాల మూలాల్లోకి, పట్టణపు లోతుల్లోకి మనల్ని లాక్కువెళ్ళడమే కాదు అడవుల్లోకి తీసుకువెళ్ళి పురాగానాన్ని, జలపాత సంగీతాన్ని వినిపిస్తాయి: యూనివర్శిటి రాజకీయాల్లోకి, అరాచకాల్లోకి లాక్కువెళ్ళి, వాళ్ళ గురించి జాలిపడేలా చేస్తాయి. తక్కువ కులం బిడ్డని గొప్పగా సాకిన గొప్ప మనుషుల్ని, వాళ్ళ మనసుల్ని, మరో మహా వైద్యగాడ్ని, బ్రతకడానికి భయపడే కుర్రాడ్ని, రాజకీయ వ్యవస్థ ప్రతినిధుల్ని, రాజ్యం యొక్క అధికారిక ప్రతినిధుల్ని, వారి పనితీరుని, వీర ప్రేక్షకుల్ని, నోటిదురుసు బంధువుల్ని, దెయ్యాలు కూడా జడుసుకునే పట్నపు మనుషుల్ని, బక్కల్ని ఆకర్షించే దేవుళ్ళని, చావలేక బతికే బక్క రైతుని, రేపటి తరం ఉజ్వల భవిష్యత్తును కాంక్షించే యోధుల్ని, మనిషి లోపలి విధ్వంసాన్ని, దుగ్గిలమ్మల్ని, బానిసలకి విముక్తి కలిగించే వాడ్ని పరిచయం చేస్తాయి. ఈ కథలు మరుపురానివి, మరచిపోలేనివి. *

పుస్తక సమీక్ష

# దేవపుత్ర 'బందీ' కథలు

☆ పి. వరలక్ష్మి



కథకుడిగా చిరపరిచితుడైన చిలుకూరి దేవపుత్ర గారు మరోసారి తన చుట్టూ పరచుకున్న సామాజిక వాస్తవాలను 'బందీ' కథా సంకలనంగా మన ముందుకు తీసుకొచ్చారు.

సామాజిక భౌతిక పరిస్థితుల ప్రతిఫలనంగా మనిషిలో పెంపొందే చైతన్యం మనిషి స్వతంత్ర ఆలోచన, విచక్షణా జ్ఞానం, అధ్యయనం ద్వారా సామాజిక స్థాయిని దాటి మరింత ఉన్నతంగా నిర్మాణం అవుతుంది. అట్లా మత కట్టుబాట్లలోంచే హేతువాద భావజాలం ఉత్పన్నమౌతుంది. అటువంటి వ్యక్తిత్వాన్ని నిర్మించుకున్న మనిషి సమాజంలో వ్యవస్థీకరించబడిన 'మతం'తో తీవ్రమైన ఘర్షణ పడవలసి వస్తుంది. ఒకేసారి మనిషిలో అనివార్యంగా ఉండే కొన్ని బలహీనతలూ, కుటుంబం సాంఘిక పరిస్థితులు వీటివల్ల సంఘం బిగించే కట్టుబాట్లకు బందీ కావలసి వస్తుంది. అటువంటి ఒక స్థితిని దేవపుత్ర గారు 'బంధీ' కథలో సునిశితంగా తడుముతారు. క్రైస్తవ కుటుంబంలో పుట్టిన నాస్తికుడు కరుణాకరణం.చివరికి అలా సామాజిక కట్టుబాట్లకు బంధీ అవుతాడు. ఈ కథా నాయకుడు కరుణా కరణం అత్యంత సామాన్యుడు. కథ మొదట్లోనే అతని బలహీనమైన వ్యక్తిత్వాన్ని బయట పెడతాడు రచయిత. ఊహించని విధంగా జీవితాన్ని మలుపులు తిప్పేదే కాలం అనిపిస్తుంది నాకు. మరి ఎవరైనా అయితే కాలం స్థానంలో విధి ని చేర్చుకుని ఉండే వాళ్ళు. నేను నాస్తికుణ్నీ హేతువాదిని అవడం వల్ల విధిని ఎలా నమ్ముతాను. తండ్రి చనిపోతే శవాన్ని ఖననం చేయడానికి క్రైస్తవ శ్మశాన వాటికలో స్థలం సంపాదించలేక పోతాడు. అతడు నాస్తికుడు కనుక క్రైస్తవ సమాజంలో అతనికి సంబంధాలు ఉండవు. అటువంటి సమయంలో తండ్రి స్నేహితుడు బాలరాజు సహకరించి అతనికి హితబోధ చేస్తాడు. "దేవుడు లేకపోతే సంఘం అంటూ ఒకటుందని, నీ సంఘం దేవుని చిహ్నం ద్వారానే గుర్తిస్తుందనీ" తనకూ ఓ కుటుంబం, బాధ్యతలూ ఉన్నాయి కదా అని చివరికి ఓ ఏసుక్రీస్తు పటం కొనుక్కుని ఇంటికి బయలుదేరుతాడు. కరుణాకరం.

గ్రామీణ జీవితంలో మానవ సంబంధాల్ని 'ఆపద' కథ అనుభూతికి తెస్తుంది. వాడలో అగ్గిపడితే అవ్వ 'మనిల్లు కూడా కాలిపోయెనేమో' అని గుండెలు బాదుకుంటుంది. తన ఇల్లు క్షేమం అని తెలిశాక 'మనోళ్ళ ఇండ్లన్నీ కాలిపోయె గదరా' అని ఏడుస్తుంది. వాళ్ళ గేరి కాదనీ, మాదిగ గేరిలో కొట్టాలు అంటుకున్నాయని విన్న తర్వాత తమకు చెప్పులు కుట్టే నారాయణప్ప ఇంటికి ఏమయిందోనని మొత్తుకుంటుంది. నారాయణప్ప కొట్టానికేమీ కానందుకు కుదుటపడినా ఆ వైపు పిల్లా జెల్లా, ముసలీ ముతకా గగ్గోలు పెడుతుంటే వాళ్ళతో పాటు అవ్వ ఎదబాదుకుంటూ వంత పాడుతుంది. అంతా మనోళ్ళే నవ్వా, అందరూ బాగుండాల అని మనవడికి తన తత్వాన్ని బోధపరుస్తుంది. అయితే పెద్ద కులపోళ్ళు కూడా అంటూ ముట్టూ పట్టించుకోకుండా మంటలు ఆర్పడానికి రావటం చూసి మనవడు సంతోషపడతాడు. అంతా బాగా కలిసిపోయినారు కదవ్వా అంటే మాదిగ్గేరికి అవతల ఉండే గడ్డి దొడ్డెండ్లన్నీ రెడ్డివీ, కమ్మోళ్ళవీ అయినందుకే అంత అంటూ ముట్టూ లేకుండ మంటలార్పుతా ఉండేది అని చివర్లో అవ్వ బోధపరచడంలో మరొక కోణం ద్వారా యధార్థాన్ని విషదపరుస్తాడు రచయిత.

'పంచమం' అద్దంలో చందమామ' వంటి దళిత నవలలు రచించిన దేవపుత్ర గారు 'ఔషధం' గురుదక్షిణ, విలోమం కథల్లో కుల వివక్షను, అగ్రకుల అహంకారాన్ని సూటిగా ప్రశ్నిస్తారు. 'విలోమం' కథలో చదువుకున్న దళిత యువతిని కులాంతర వివాహం చేసుకుంటాడు జీవన్. రాధకు అందులో ఆదర్శం కనిపిస్తుందిగానీ తర్వాత తన వైవాహిక జీవితంలోనే తన ఇంట్లోనే కులవివక్షని, తిరస్కారాల్ని ఎదుర్కోవలసివస్తుంది. ఎప్పుడో అగ్రకుల అహంకారాన్ని ప్రదర్శించే జీవన్ తన కొడుకుని ప్రాథమిక పాఠశాలలో ఎస్.సిగా చేర్పించాడని తెలుసుకున్న రాధ షాక్ అవుతుంది. సీమ రచయితగా అందునా అనంతపురం జిల్లా వాసిగా అక్కడ కరువుని జీవితంలో భాగం చేసుకున్న రైతును దేవ పుత్ర గారు ఆర్ద్రతతో స్పర్శిస్తాడు. కరువు ధాటికి అప్పుల పాలై పని వెతుక్కుంటూ పట్టణానికి పోయిన తన తండ్రి దుడ్లు తెస్తాడనీ తను బాగా చదువుకుని టీచరు అవుతానని వరాలు ఆశతో ఎదురుచూస్తూంటుంది. తన స్నేహితురాలి తండ్రి అప్పుల కారణంగా ఆత్మహత్య చేసుకున్నాడని విని తన తండ్రి వస్తే అప్పుల వాళ్ళు ఊరికే ఉండనివ్వరని, అందుకే ఇక తండ్రి ఎప్పటికీ రాడని నిరాశతో ఆత్మహత్య చేసుకుంటుంది (నాయన రాడా) 'నెర్లు' కథలో రైతు జీవితంలో అంతర్భాగమై పోయిన పశువులతో ఎంత ఆత్మీయత పెనవేసుకుని ఉంటుందో సున్నితంగా చెప్పుకొస్తాడు. విధి లేని పరిస్థితిలో తనకెంతో ఇష్టమైన ఎద్దుని అవ్వ అమ్మేసినా తన యజమానితో బంధం తెంచుకోలేని ఆ బొల్లెద్దు ఎనభై మైళ్ళు నడిచి ఇంటికి తిరిగి వస్తుంది. పల్లెల్లో సర్వసాధారణమైన ఇటువంటి ఘటనను ఈ కథలో మనం అబ్బురపడి చూస్తాము.

ముఠానాయకులు తమ స్వార్థ ప్రయోజనాల కోసం అట్టడుగు వర్గాల ప్రజల్ని తమ రాజకీయ చతురతతో దగ్గర చేసుకుని వారిని ఫ్యాక్షన్ రాజకీయాలలో ఆయుధంగా ఎట్లా వాడుకుంటారో ఆయుధం కథ చెబుతుంది.

అభివృద్ధి నమూనాగా వచ్చిన సాగునీటి ప్రాజెక్టులు నిర్వాసితుల పేరుతో ఎన్నో గ్రామాల ప్రజల్ని తాము పుట్టి పెరిగిన ఊరి నుండి తమ బ్రతుకు తెరువు నుండి గెంటి వేస్తుంటే మరో పక్క అదే ముంపు పేరుతో భూస్వామ్య పెత్తందారీ వర్గాలు ఎట్లా సొమ్ము చేసుకుంటాయో 'ముంపు' కథలో వివరిస్తాడు రచయిత. ఈ వైరుధ్యాన్ని ఆయన 1995లోనే గొప్పగా చిత్రించారు. నేను పుట్టి పెరిగి ఊరు మునిగిపోతోందని విని జ్ఞాపకాల తలపోతలో తన ఊరిని కళ్ళ జాసుకుందామని బయలుదేరుతాడు జానకిరాముడు. ఊరి వాళ్ళతో కూడి బాధలు కలబోసుకుంటూ చిన్న తనంలో ముంగారు పంటలు పండించిన పొలాల్ని పలకరిస్తూంటే, చేజారిపోయే చేలల్లో ఎవరో చీనిచెట్లు నాటుతుండటం చూసి ఇదేం పిచ్చి పనబ్బా అని ఆశ్చర్యపోతాడు. అది డబ్బు సంపాదించే ఎత్తనీ, ప్రభుత్వం భూస్వామి నష్టపోకుండా ప్రతి చెట్టుకీ నష్టపరిహారం చెల్లిస్తుందని, ఇదే కాక ఇంకా ల్యాండ్ ట్రిబ్యునల్‌కి పోయి మరింత 'నష్టపరిహారం' సంపాదించుకుంటారని, చారెడు భూమి ఉన్న చిన్న రైతులు నష్టపోతారు గాని డబ్బున్న వాళ్ళు మరిన్ని డబ్బులు చేసుకుంటారని జానకి రాముడికి ఓబులేసు చిన్నాయన బోధపరచడం ద్వారా యధార్థాన్ని మనకళ్ళ ముందుంచుతాడు రచయిత. పితృస్వామ్యం, రాజ్యం స్త్రీల జీవితాల్ని ఎంత దుర్మార్గంగా ఛిద్రం చేస్తాయో 1947 అధికార మార్పిడి క్రమంలో తలెత్తిన దేశవిభజన పురికొల్పిన హింస, రక్తపాతం నేపథ్యంలో చాలా చక్కగా చిత్రించిన కథ 'అవిభాజ్యం' ఎక్కడ దాడులు జరిగినా, హింస చెలరేగినా ప్రధాన లక్ష్యంగా మారేది స్త్రీలే! వారి మనోభావాలతో నిమిత్తం లేకుండా స్త్రీ ఎక్కడుండాలి, ఏదేశంలో ఉండాలి నిర్ణయించేది రాజ్యం, కుటుంబం, ఇవి పరిరక్షించే పితృస్వామిక వ్యవస్థ.

'సామాన్య పాఠకుడే నా గురి' అంటున్న దేవపుత్ర గారి కథలు చాలా సూటిగానూ, సరళంగానూ అంతే సున్నితంగానూ పాఠకుల్ని హత్తుకుంటాయి. హాస్య వ్యంగ్య కథల్ని విమర్శకులు పెద్దగా పట్టించుకోరు అంటున్న ఈ రచయిత అటువంటి చక్కని కథల్ని రాశారు. సమకాలీన రాజకీయ సాంఘిక పరిస్థితులు ప్రతిబింబించేలా దేవపుత్ర గారు హాస్య, వ్యంగ్య కథలు మరింత పదునుగా రాయగలరని ఆశించవచ్చును.

*

# సీమ వ్యవస్థలోని పతన విలువలు చిత్రించిన - కథలు

పుస్తక పరిచయం

☆ జి. వెంకట క్రిష్ణ

భౌతిక వాస్తవికతను యధార్థంగా చిత్రించడమే రాయలసీమ రచయితల ప్రధాన లక్షణం. కథల్లో శిల్ప నిర్మాణాలూ, ప్రయోగాలూ గట్రా ఏవీ లక్ష్యంగా పెట్టుకోకుండా, నేలబారుగానే అనుకున్నా సరే, కథా వస్తు ఆవిష్కరణ చేయడం రాయలసీమ రచయితల వుమ్మడి లక్షణం. ఆ వొరవడిలోనిదే కడపజిల్లా నుంచి పాలగిరి విశ్వప్రసాద్ 'చుక్కపొడిచింది' కథల సంపుటి 1991 - 97 మధ్య తను రాసిన పది కథలతో వున్న ఈ పుస్తకం రాయలసీమ జన జీవిత భౌతిక వాస్తవికతా విభిన్న పార్శ్వాల్ని పట్టుకుంది. ప్రాంతీయ అస్తిత్వం సహజంగా రచనలో ప్రతిబింబించడం కూడా రాయలసీమ రచయితల సహజలక్షణమే అనుకుంటే విశ్వప్రసాద్ రాసిన ప్రతి కథా అలా వుండటానికి సీమ జీవిత విధానమే కారణం. కఠినమైన దుర్భర దారిద్ర్యం వల్ల మానవ సంబంధాలో అపసవ్యత, చారిత్రికంగా అబ్బిన పెత్తందారి జాడ్యం, ఆధిపత్యభావజాలం రాయలసీమ వ్యవస్థను పట్టి పీడిస్తున్నాయని ఈ సంపుటిలోని ప్రతికథా వివరిస్తుంది.

స్థూలంగా చూసినపుడు రాయలసీమ రచయితలలోని వుమ్మడి లక్షణాలు యీ కథల్లో కన్పించినా సూక్ష్మంగా పరిశీలించినపుడు విశ్వప్రసాద్‌లో కథకుడు చక్రవేణు కథాసంవిధానం కన్పించడం ఆశ్చర్యం కల్గిస్తుంది. ఇది పోలిక కోసం కాదుగానీ రాయలసీమ జన జీవితంలోని పతన విలువల చిత్రణ వద్ద యీ పోలిక కుదురుతోంది.

'మనిషి' కథలో తండ్రి మరణాన్ని కోరుకుంటాడు రాంరెడ్డి. కథలో ఆర్థిక పరిస్థితుల వల్ల తండ్రి మరణాన్ని కోరువడం గ్రామీణ ఆర్థిక నిస్సహాయత పర్యవసానమని సరిపెట్టుకునే పాఠకుడికి, తర్వాత కథల్లో వొళ్లు గగుర్పొడిచే జుగుప్సాకర సంఘటనలు తారసపడతాయి. 'కరివేపాకు' కథలో తనను ప్రేమించి, పెళ్ళి తర్వాత సంబంధం కొనసాగించడం వల్ల భర్తను వదులుకొని చివరికి హైక్లాస్ వ్యభిచారిణిగా మారి కేవలం తన ప్రేమ అప్యాయతల్ని మాత్రమే కోరుకుంటున్న మెర్సీని మెర్సీలెస్‌గా వొదులుకునే విస్సూ, 'ముసురు' కథలో ఫ్యూడల్ ఔదార్యంతో పిచ్చిదానికి అన్నం పెట్టిస్తూ ఆమెకు అన్నం ఎరచూపి అర్థనగ్న నృత్యాలు చేయించుకొని ఆనందించే చంద్రం, 'పాములు' కథలో వుద్యోగం కాపాడుకోవడం కోసం భార్యను పై అధికారికి తార్చే రవిచంద్రా, సుఖాలకోసం లొంగిపోయే కల్పనా, 'చెదిరిన చిత్రం' కథలో కొడుకు తీవ్ర జ్వరంతో మరణశయ్యపై వుంటే మిగిలిన ఆరు రూపాయలతో సెక్సు సినిమాను చూసే తండ్రి పాత్రా, 'తోలుబొమ్మలు' కథలో రెడ్ల దగ్గర తన చిన్నపాటి ఆధిపత్యం నిలుపుకోవడం కోసం భార్యనూ, వదిననూ తార్చే నన్నప్పా.

'చుక్కపొడిచింది' కథలో ప్రతీకారం తీర్చుకోవడం కోసం జీతగానితో సంబంధం పెట్టుకొని, అతనితో ప్రత్యర్థుల్ని చంపించే స్త్రీ పాత్రా,

'చెప్పుకిందపూలు' కథలో అప్పుకోసం చెల్లెల్ని రెడ్డి దగ్గరకు పంపిస్తానని వొప్పుకునే గుమ్మయ్యా, యిట్లా ప్రతి కథలోనూ జీవన విలువల పతనం కనిపిస్తుంది. దీనికి కారణం వ్యవస్థ అనీ, అజ్ఞానమనీ, నిస్సహాయతనీ రచయిత చిత్రణలో తెలసిపోతూండ వచ్చుగానీ, వీటిని చిత్రించడానికే రచయిత ఈ కథల్ని రాసిండకపోవచ్చుగానీ, అనివార్యంగా యీ జుగుప్సాకర దృశ్యాలు మనముందు నిలబడి యీ సంపుటిని కన్యాశుల్కం లాగా బీభత్సరస ప్రధానం చేస్తున్నాయి.

ఈ సంపుటిలో రాయలసీమ కక్ష్యలూ కార్పణ్యాల మీద విశ్వప్రసాద్ స్త్రీలచేత తిరుగుబాటు చేయించిన కథలు రెండున్నాయి. కరువూ - కక్ష్యలూ ఒకే నాణేనికి రెండు ముఖాలని చెప్పిన కథా వుంది. స్త్రీలు చైతన్యమైతే కక్ష్యలు తగ్గుతాయనే సరియైన స్పృహ యీ కథల్లో ప్రస్ఫుటంగా కనిపిస్తుంది. రాయలసీమకే ప్రత్యేకమైన యిట్లాంటి విషయాల మీదే కాకుండా వ్యవస్థ చేతిలో వ్యక్తి నిస్సహాయత మానవత్వ సిద్ధాంతం లోని డొల్లుతనం మీద ప్రశ్నలు సంధించిన కథలూ యీ సంపుటిలో వున్నాయి. అంశాల్ని పైపైనే తడమడం వల్ల యీ కథల్లో పై ప్రశ్నల విరాట్ స్వరూపాన్ని ఆవిష్కరించలేకపోవడం నిరాశ కల్గిస్తుంది. ఎంతో సమర్థవంతంగా నడిపిన 'బతుకు బండి' కథ చివర్లో కేవలం మానవత్వం మీద చర్చ నిస్సహాయంగా చూపడం కోసం చిత్రించినట్లుంది.

ఇలాంటి లోపాల సంగతి ఎలా వున్నా యీ సంపుటిలో నెమ్మదిగా, గంభీరంగా నడిచే కథాకథనం, రాయలసీమ ఎండలాంటి కరకరమనే భాషా, స్త్రీపాత్రల చిత్రణా పాఠకుల్ని ఆకట్టుకుంటాయి.

*

# 'నేనూ మా అమ్మ'

☆ ఆర్. శశికళ

"నేనూ మా అమ్మ" కొన్ని విలువలు తిరస్కరిస్తూ మనుషుల జ్ఞాన మూలాలు ఎక్కడున్నాయో వెదికే ప్రయత్నం చేసింది. సాధారణ జీవితం గడుపుతూ చాలీ చాలని అవసరాలతో గడుపుతున్న దిగువ మధ్యతరగతి జీవితానికి, ఒంటరి స్త్రీ బ్రతుకుపోరు, మానసిక ఘర్షణకు ప్రతిబింబం ఈ పుస్తకం. తల్లిదండ్రులను, ప్రేమించే ప్రతివ్యక్తినీ సున్నితంగా స్పృశిస్తుంది ఈ పుస్తకం. డాక్టర్ హరికిషన్ బాలల కథా రచయిత. తన బాల్యాన్ని, జీవిత గమనాన్ని తన తల్లిద్వారా అర్థం చేసుకో ప్రయత్నం చేశాడు. తనలో తాను తిరిగి తల్లిద్వారా సామాజిక సంబంధాలు; స్వార్థపూరితమైన బంధుత్వాలకంటే స్నేహితులతో అన్ని విధాలా అండగా ఉండటం; ముగ్గురు చిన్నపిల్లలుగా ఉండగానే భర్తను కోల్పోయిన తన తల్లి నిలదొక్కుకొని నిలబడ్డ ఆత్మవిశ్వాసాన్ని; పిల్లలను మంచి మార్గంలో పెంచుతూ వారికి మంచి భవిష్యత్తు కోసం అనుక్షణం కష్టపడ్డ స్త్రీ మూర్తిని ఆవిష్కరించాడు. కోట్లాది తల్లులు ఈరోజు ఇటువంటి జీవితాలను గడుపుతున్నారు.

ఒంటరి స్త్రీ ఆవేదన, ఘర్షణ, పెనుగులాట, సంఘం సృష్టించిన విలువలను గురించి ఆలోచిస్తూ నిస్సహాయంగా మిగిలిన ఆత్మన్యూనతా భావం డాక్టరు హరికిషన్ ఈ కథల్లో పాఠకులకు విప్పి చెప్తూ, తన్ను తాను నిజాయితిగా ఆవిష్కరించుకొంటాడు. తన కాళ్ళు సక్రమంగా భూమి మీద నిలబెట్టడానికి ఎవరు కారణమో వెతుక్కునే క్రమంలో డాక్టరు హరికిషన్ ఈ కథలు వ్రాశాడా అన్పిస్తుంది. సున్నితమైన హాస్యం, శైలి, భావం - ఈ కథలను వదలకుండా చదివిస్తుంది.

భర్తలేని స్త్రీ పట్ల ఉన్న మూఢనమ్మకాలను, నిరాదరణను, ఆ భావజాలం పట్ల నమ్మకంతో బిడ్డపెళ్ళిని కూడా కళ్ళార చూడకుండ తన్నుతాను చాటు చేసికొని కన్నీటి తడితో "దేముడా నా బిడ్డ సల్లగుండాల" అనే తల్లి నిస్సహాయ వేదనను ఆవిష్కరిస్తాడు. నేను చిన్నగున్నపుడు మా నాయన గురించి నాకేమీ తెలీకపోయినా అన్నింటిలోనూ ఆయన పేరే రాయాల్సివచ్చేది. ఇదేందబ్బా లేనోళ్ళ పేరు రాసేదని ఒకసారి అమ్మపేరు రాస్తే... "వెధవా ఇదికూడా తెలీదా... ఏం రాయాల్నో" అని మాస్టారు వుతికి ఆరేసినాడు. నన్ను చదివిస్తూ వున్నది, పెంచుతూ వున్నది అంతా మాయమ్మ కృష్ణవేణమ్మనే కానీ అన్నింట్లోనూ నేను 'సన్నాఫ్ హుసేనయ్యనే' పేజీ 29.. ఈ కథ స్త్రీలకు సమాజం ఏపాటి గౌరవం ఇచ్చిందో చూపించాడు. ఇప్పుడిప్పుడే తల్లిపేరు కూడా వ్రాయడం వాడుకలోకి వస్తోంది. బహుశా ఫెమినిస్టు ఉద్యమ ఫలితం కావచ్చు. ఉద్యమాల ద్వారా పెల్లుబుకిన చైతన్యం కావచ్చు. విద్యా విధానంలోని తప్పుడు విలువలను, అవలక్షణాలను, పరీక్షలు, అయ్యవార్లతిట్లు, రాట్లు, పాట్లు- వాటిల్లోంచి తానెట్టాబయటపడింది డాక్టర్ యం.హరికిషన్ కథ ద్వారా చెప్పే ప్రయత్నం చేశాడు. జీవన విధానంలో తేడాలుండవచ్చు కానీ పిల్లలు మాత్రం కష్టపడరాదు అనుకునే ప్రతి తల్లీ ఈ కథల్లో కన్పిస్తుంది. మా అమ్మకు ఆత్మాభిమానం ఎక్కువ. ఈ లోకమంటే అసహ్యం, భయం అని ఆమెలోని నిగూఢమైన గాయాలను పరిచయం చేస్తాడు. మూడు కథలు టైటిల్‌కు దగ్గరగాలేవు... కానీ ప్రతి కథ ద్వారా తమ అభివృద్ధికి కారణమైన వారిని గూర్చి ఆత్మీయంగా స్పృశించాలని చెప్పకనే చెప్తున్న డాక్టర్. హరికిషన్ గారిని అభినందిస్తూ - కుళ్ళి కంపుకొడ్తున్న విలువలకు వ్యతిరేకంగా తన కలం మరింతగా పదునెక్కాలని కోరుకుంటూ మీ అందరిని "నేనూ మా అమ్మ" కథలు చదవాల్సిందిగా కోరుతున్నాను.

*

## కవిత్వం

### మంజీర కవితలు ఎనిమిది పాటలు రెండు

## ఎర్రసైన్యమై తిరిగివద్దాం

రండి! బాధల్ని నెమరేసుకుందాం
కష్టాల్ని కలబోసుకుందాం
రండి! రారండి! పోరాటాన్ని పెనవేసుకుందాం
రండి! ఓదార్చుదాం! బాధాతప్త నగరాన్ని
'ఏకశిల'గా మిగిలిన శోక నగరాన్ని
రండి! అక్కున చేర్చుకుందాం! బిడ్డల్ని కోల్పోయిన తల్లిని
రండి! పొగుడుదాం! పోరాటాల పురిటి గడ్డని
రండి! ఇన్నాళ్ళూ శత్రువు చొరనివ్వని
విచ్చు కత్తుల నగరాన్ని వెల్లువలా ముంచెత్తుదాం
విజయ పతాక నెగరేద్దాం
ఉరుకుదాం, ఊరేగుదాం
ఆడుదాం, పాడుదాం, ఎరుపుమయం చేద్దాం
సభలు జరుపుకుందాం, సంబరాలు జరుపుకుందాం
బిడ్డల పండుగ జేసుకుందాం, వీరుల పాట పాడుకుందాం

* * *

లక్షలుగా కదలి వచ్చాం, ఓరుగల్లును ఆక్రమించాం
శత్రు శక్తి ఏమీకాదని ఎలుగెత్తి చాటాం
అయినా! కామ్రేడ్స్, ప్రజలారా!
మనమింకా గెలువలేదు
మనమింకా గెలువలేదు
ఎందుకంటే మనం నిరాయుధులం
వాడింకా సాయుధుడే
అందుకే ప్రజలారా! అందుకోండి ఆయుధాలు
ఈసారి ఆయుధాలతో తిరిగివద్దాం
ఎర్రసైన్యమై వద్దాం
ఓరుగల్లును ఆక్రమిద్దాం
(ప్రభాకర్ రెడ్డి నెత్తురొలికిన నేపథ్యంలో, వరంగల్ సభల నాటి అనుభవాలను గుర్తు చేసుకుంటూ)

## సరిహద్దును రక్షించండి

రక్షించండి రక్షించండి
సరిహద్దును రక్షించండి
మార్కెట్కై నిర్మించిన హద్దు
దోపిడికి ఎంచుకున్న సరిహద్దు
మనదేశ సరిహద్దుకు
ప్రమాదం ముంచుకొచ్చింది
రక్షించండి రక్షించండి
ఐఎంఎఫ్ అప్పుకోసం
ఆంక్షలకు తలొగ్గి
'బహుళజాతి' దోపిడికి
బంగారు తివాచీ పరిచాం
సరిహద్దు దాటి వచ్చే స్వేచ్ఛ
సగౌరవంగా ఇచ్చేశాం
పశ్చిమాన, ఈశాన్యాన
భద్రతకు భయంలేదు
సరిహద్దు భద్రతా దళాన్ని
ఇక్కడికే పంపండి
సియాచిన్ సరిహద్దు కావల
ఎగిరిన నేస్తం చేతిలోకే
ఎర్రజెండా వచ్చింది
ఇండో - టిబెటన్ ఫోర్సుకు
ఇంకెంతమాత్రం పనిలేదు
సరిహద్దును రక్షించండి

పంపించండి, వెంటనే
ఇక్కడికే పంపండి
మార్చమనే వాళ్ళకంటే
సరిహద్దులు మొత్తంగా
చెరిపేసే వాళ్ళే ప్రమాదం
సైన్యాన్నంతటినీ ఇక్కడికే పంపండి
దేశం నట్ట నడి బొడ్డున
తెలంగాణ పల్లెల్లో
అంతర్జాతీయ వాదులతో సరిహద్దుకు
అంతులేని ప్రమాదమొచ్చింది
గోసి, గొంగడిగాళ్ళు
ఎర్రజెండా చేతబట్టి
భూస్వామ్యం సరిహద్దును
నాగళ్ళతో దున్నేస్తున్నారు
అమాయకుల్లా కనిపించే
పల్లెటూరి పోరగాల్లు
ఆయుధాలు చేతబట్టి
దొరలు గీసిన హద్దులు
ధైర్యంగా చెరిపేస్తున్నారు
బయటి శక్తులతో సరిహద్దుకు
ముప్పేమీ లేనేలేదు
ఈ ప్రజలపైనే యుద్ధం చేసి
మన దోపిడీ సరిహద్దును
నిలబెట్టుకుందాము రండి
ప్రజాస్వామ్యం పడగను
కాపాడుకుందాము రండి
సరిహద్దు భద్రతా దళాలన్నీ
ఇక్కడికే పంపండి
చిరుగుపాత స్త్రీలైనా
బోసినోటి తాతలైనా
ముక్కున చీమిడి కారే
మూడేండ్ల పిల్లలైనా
జాలి అసలే చూపకండి
అంతర్జాతీయ వాదులతో కుమ్మక్కై
మనదేశ సరిహద్దుకు
ముప్పు తెస్తున్నది వీళ్ళే
అందరినీ కొట్టండి
అన్నిటినీ కూల్చండి
యువకులైన వాళ్ళను
అస్సలుకే వదలకండి
కాల్చేసైనా వాళ్ళను
మన సరిహద్దును రక్షించండి
రక్షించండి రక్షించండి
సరిహద్దును రక్షించండి

## నిషిద్ధ స్వప్నం

నేలను నిరంతరం స్పృశిస్తున్నాను
నింగిని, చందమామను
వెన్నెల చల్లదనాన్ని ఆస్వాదిస్తున్నాను
తూర్పుగాలి మోసుకొచ్చే
పొలాల వెచ్చదనాన్ని
మనసారా అందుకుంటున్నాను
నిన్నటిదాకా నాతో గుసగుసలాడి
నేడు నింగికెగసిన తారల్ని
అందుకోవాలని
నిరంతర ప్రయత్నం చేస్తున్నాను
నిర్బంధంలో వుంటేనేం
ఆంక్షలకు అందని
నిషిద్ధ స్వప్నాన్ని
వీక్షిస్తూనే వున్నాను.

## ఆమె

ఆమె ఇన్నాళ్ళుగా
అతనినే నమ్మింది
ఇప్పుడు
అతనితో కలసి
విముక్తిని నమ్మింది

## ప్రతిచర్య

ఊహించి నువ్వొకటి చేసావు
వ్యతిరేక ఫలితం చూసావు
దౌర్జన్యం నువ్వు చేసావు
ఐక్యత వాళ్ళు నేర్చారు
నిర్బంధించాననుకున్నావు
ప్రతిఘటనను నేర్పావు
నిస్సిగ్గుగా కాల్చేసావు
ఆయుధావసరాన్ని గుర్తించారు
ప్రజలపై పగబట్టావు
ప్రభుత్వం మాది కాదని
రాజ్యాధికారం కోసం
తుపాకులందుకుంటున్నారు.

## మంచుకురిసినప్పుడు

మంచు కురిసినప్పుడు
మలినపడ్డ మల్లె తెల్లనవుతుంది
వాడిపోయిన మల్లె రాలిపోతుంది
ధాన్యం తూర్పార బట్టినపుడు
తాలుతప్పలు గాలికెగిరిపోతాయి
గట్టిగింజలు కుప్పపడ్తాయి
నిర్బంధం పెచ్చరిల్లి
పార్టీ సంక్షోభంలో పడ్డపుడు
గుండెజారిన వాళ్ళు జారిపోతారు
ధైర్యాన్ని దీపం చేసుకున్న వాళ్ళు
గమ్యం చేర్తారు

## తోటకెలా చెప్పను ?

మనిద్దరం కలసి నడచిన
ఆ తోట దృశ్యంలోకి
నేను ఒంటరిగా అడుగుపెట్టాను
ఆనాడు మనకు
పరిమళం పంచిన పూలు
గతం గుర్తుచేస్తూ
నీ సుగంధాన్ని వెదజల్లాయి
కొమ్మలపై ఊయలలూగుతూ
ఆకుల వేణువులపై గాలి
నీ పాటలే పాడింది
నీ ఆచూకి అడిగింది

ఆ తోటకెలా చెప్పను
అమరత్వ శిఖరాల మీద
ఆకాశం పూతోటలో నవ్వు
అరుణ పుష్పానివైనావని.
(ఒక ఊరి ప్రజలు కా॥ స్వర్ణ పాటను గుర్తుచేసినపుడు)

## రూపొందుతున్న చరిత్ర

అబ్బా...... అమ్మా..... అయ్యో
ఆ..... అయ్యో చచ్చిపోతున్నా
ఊ..... ఆ...... బతికించండి
అయ్యో! ఏమిటా అరుపులు
కంగారుపడకు! ఒక తల్లి
శిశువుకు జన్మనిస్తోంది

పోలీసుల సమూహిక దాడులు, చిత్రహింసలు
మిస్సింగ్‌లు, ఎన్‌కౌంటర్లు
హత్యలు, కిడ్నాప్‌లు, దగ్ధం, విధ్వంసం
మందుపాతర పేలుళ్ళు, అంబుష్‌లు, రెయిడ్‌లు
అయ్యయ్యో! ఏమిటీ పరిణామం
భయపడకు! నేలతల్లి ఒడిలో
నూతన వ్యవస్థ యాతనపడుతోంది

అవును నేస్తం! విధ్వంసంలో నుండి
విధ్వంసంలోకి కాదు ప్రయాణం
విధ్వంసంలో నుండి నిర్మాణంలోకి
రూపొందినది స్పష్టంగానే వుంటుంది
కాని, మార్పునర్థం చేసుకోవడమే కష్టం

భయంకరమైన తుఫాను
గొప్ప ప్రశాంతతకు దారి తీస్తుంది
విసుగెత్తించే గందరగోళంలోంచి
ఒక ఆలోచన ఆవిష్కృతమవుతుంది
కఠినమైన, నిర్దాక్షిణ్యమైన వర్గయుద్ధంలో

చరిత్ర రూపు దిద్దుకుంటుంది
దిశ తెలిసిన ప్రయాణమే అయినా
మార్గం మంచుకమ్మింది
అదును చూసుకున్నాడేమో
వాడు యుద్ధం ప్రకటించాడు
మార్గాంతరం లేక మనం
ప్రతిఘటిస్తూనే వున్నాం

మబ్బులు విడిపోయేనాటికి
ప్రజా యుద్ధం ఒక వాస్తవంగా
రూపుదాలుస్తుంది.

## మదనపల్లి మల్లి

తీగే నాగుల ఉయ్యాలలో....
మదనాపల్లిలో ఒరిగిన మల్లెపేరేందే   తీగే నాగుల ఉయ్యాలలో
విరిసి కట్టిన కొప్పు దిద్దిన కుంకుమో   "
చామన ఛాయున్న ముద్దబంతి ముఖమో   "
మంచులాంటి మనసున్న మాట చల్లదనమో   "
చింగూ లెగదోపీన చిన్నా చిన్నదుగులో   "
మల్లె పేరు నర్సక్కా మా మంచి అక్కో   "
మల్లె పూవాసుంటీ మగువాల బతుకో   "
మండేటి మాటల్లో మసి అవుతుంటే   "
చితిమీద బెట్టిన చితికి పోయిన బతుకో   "
బండోలె బతికేటి బదునాముల బతుకో   "
ఈ బతుకూ మనకొద్దు బతకొద్దూ అందో   "
లోకంలో పోరుల్లో స్త్రీలు సగమందో   "
రాజ్యామే మనదైతే రాజా బతుకందో   "
ఆంధ్ర స్త్రీల కన్నుల్లో ఆశా దీపాలే   "
మన్యంలో ఒరిగేన మాయక్క స్వర్ణో   "
ఆదివాసీల జ్యోతి అక్కా రాజేశ్వరీ   "
పంచాది నిర్మాల ధాజక్క కథలే   "
కథలన్ని వింటుంటే కన్నీళ్ళు రాలే   "
గుడ్ల నీళ్ళ నాపిందీ గుడ్లురిమి చూసే   "
కత్తినూరి దోపిడోడ కాసు కొమ్మందో   "
కరెంటు కోతల్లో ధర్నాలయిందో   "
కాశీరాం, శ్రీనన్నల మదిలో నిలిపిందో   "
వరంగల్లు మహాసభల వాలంటీరాయే   "
హన్మకొండ స్థూపానికి జెండ పట్టిందో   "
వసీర్మలైన స్వామి చిన్నారి తమ్ముడూ   "
నోటీ మాటలు రాని పాలులేని కూతురో   తీగే నాగుల ఉయ్యాలలో
కన్నీళ్ళు ఆపుకుంది కూలికి వోనందో   "
వరదల్లో మునిగీన తోటి ప్రజల జూసి   "
క్యాంపెయిన్లు చేసిందీ కన్నీళ్ళు తుడువా   "
తీగె తీగెకు ఎన్ని ఎర్రా మల్లెలో   "
మల్లెలు గోయాలీ మాలా గట్టాలీ   "
నర్సక్క మేడలేసి గుండె కద్దుకుంటమో   "
సర్కారుకు ఉరిబోసి సావు కబురు దెస్తమో   "
(ప్రతి లైనుకూ కోరస్ తిరిగి ఇవ్వాలి)
(1990 జూన్ 11న మాక్లూరు మండల ఆర్.వై.ఎల్ మహాసభలను భగ్నం చేయడానికి కా॥ జెల్ల ప్రసాద్, స్వామిలతో పాటు చంపివేయబడ్డ కా॥నర్సప్ప స్మృతిలో)

## నా కొడుకో నారాయణ రెడ్డి

చుక్కల్లో చందురూడ - ఎన్నేల సూపులోడ   ॥చు
నీ మోమూ నేడ జూతుమురో నా కొడుకో నారాయణ రెడ్డి
నీ జాడా నేడ బడుదుమురో   ॥నా
తోలుసూరు గుడ్డువాని తొమ్మిదీ మాసాలు మోస్తి
నువ్వు సక్కగుండలాని నల్ల నువ్వుల నడవలేదు
సూర్యచంద్రుల గ్రాణాల్లో సుక్కనీల్లు దాగలేదు
సర్కారు గ్రాణం నిన్ను మింగెనురో - నా కొడుకో నారాయణరెడ్డి
వాడు సత్తెనాశనమయ్యి పోవునురో   ॥నా
కడుపు సేతబట్టుకొని ముద్దదీసీ పెట్టుకున్న
ముద్దగూడా లేనివాడు ముక్కిమూలకు పండబెట్టిన
కన్నీరు కొంగు నిండెనురో - నా కొడుకో నారాయణ రెడ్డి
తల్సుకుంటే దుఃఖ మాగదురో   ॥నా
ఈ సేత నూనె అద్ది నా కొడుకును పెంచుకున్న
ఇదే సేత ఓటు గుద్ది ఈ "రాజ్యం"కు ఏరునైన
తిన్నింటి వాసాల్ లెక్కబెట్టిరిరో - నా కొడుకో నారాయణ రెడ్డి
నా కడుపు మీద కాలబెట్టిరిరో   ॥నా
ఒంట్లో రక్తం ముద్దజేసి బిడ్డలాకు జన్మనిస్తిమి
మన సేతుకు గీతగీసి నొస్టిరాత రాసుకుంటిమి
ఎమినోల్ల నీడకోసం ఓట్ల చెట్టె పూయవడ్తిమి
విషం పాముకు పాలుపోసి నమ్మి పెంచి పెద్దజేస్తే
మోసపోయి మొదటి కొస్తిమిరో నా కొడుకో నారాయణ రెడ్డి
నా రక్త గుడ్డుల బాపుకుంటిమిరో
న్యాయాన్ని అడ్గినందుకు నట్టేట ముంచుతుండ్రు
కనుకున్న బిడ్డలంత కండ్లముందె వోతుండ్రు
షరుతు మనుషులు మీరు మాటంటే ఇడువబోరు
ఈ రాజ్యం కూలకుంటె ఉన్న కొడుకులు దక్కరేమొ

*

## జి. వెంకటకృష్ణ కవితలు ఆరు

### కవిత్వం

ఒక ముగ్గును గీచి
వాకిలిని ప్రత్యక్ష్యం చేయడం

ఒక విత్తును నాటి
సృష్టిని విరబూయించడం

ఒక అడుగును వేసి
బాటల నేర్పరచడం

### శేషాచల ప్రయాణం

సంధి కొట్టిన యీ నేల
శాపాల్ని మోస్తోంది
శవాల్ని కాల్చే ఎండ
కావుమని అరుస్తోంది
దేహాన్ని ఆయుధంగా చేసుకున్న కల
గొంతుతెగిన మాదిగపిల్ల అయింది
రాయబార నాటక చివరి అంకం
నాగుపడగ పంజా విసురుతోంది
రహస్యం బహిర్గతమై
గాలింపు పులికి వేట అవుతోంది
ఈత నేర్పిన వ్యూహం
ఎదురీత యీదుతోంది
నిప్పు ఆరిన రేణువు
రాణువై మంటను ఆర్పుతోంది
గాయాన్ని జ్ఞాపకంగా మిగుల్చుకున్న దేహం
అవమాన భారాన్ని పెనుదూరాలకు మోస్తోంది
కాలం నిషేధమై
కలలను గురి చూస్తోంది
ప్రయాణం దుర్గమమై
తొమ్మిది శవాలను మోసిన
శేషాచల మవుతోంది

### జలగండం

పచ్చని పైరును
కళ కళలాడించే తడి
అస దృశ రూపాన పాతాళం అడుగున
రేపటి పంటను వెక్కిరించేను

మూడు తరాల జ్ఞాపకాల వూటలు
నిండిన ఏడుమట్ల బావి
ఎండిన తన ఎదచారికల్ని
మట్టి వేళ్ళతో తడిమి చూసుకునేను

నీళ్ళు తారాడిన దరులను
బండరాళ్ళ గుండె అరలోంచీ ఎదిగిన కొమ్మలు
తొండలూ పాములూ పాకిన గగుర్పాటున తాకేను

గట్టున పైరును
పచ్చగ మెరిపించిన బావి అలలు
చెట్ల కొమ్మల రావడిగా కరకరలాడేను
రవ్వా రవ్వా రాచుకొని కాలం కరిగే సమయాన
చేలకు ప్రాణం నింపిన బావి చెట్లు మొలిచి పాడుబడేను
భూమిన నీడను పరిచే కొమ్మలు రెమ్మలు
రైతు బావిని చీకటితో నింపేను.

### రెండు దారులు - ఒక వ్యథ

ఆ దారిన వెళ్తే
తలుపులు మూసిన జ్ఞాపకాల
తలపులు తెరుచుకుంటాయి
ఉక్కిరిబిక్కిరి చేసే సుడులై ఒక్కసారిగా కళ్ళలో ముసురుకుంటాయి

ఆ దారిన వెళ్తే
సాయంత్రపు షికారుగాలిని
తాకుతూ ఆ రహదారి
తన షికారు కథలను నెమరు వేసుకుంటుంది
తన వేటలో వొరిగిన ప్రాణాలనూ
యింకిన రక్త మాంసాలనూ
ఆత్మగతంగా తలపోసుకుంటుంది

రహదారిది దాహాలదారి
ఒక కార్తీకమాసపు వుదయం
తలుపులు మూసిన ఆ యింటి
వసంతాన్ని
హరించిన మహమ్మారి

ఆ దారిన వెళ్తే ఏ వేసవి సాయంకాలమో
ఆమె కోసి యిచ్చిన
తన హృదయమంత మధురం నింపిన
చిత్తూరు మామిడిపళ్ళ
తీపి జ్ఞాపకం వొక్కసారిగా
మనసును చేదు చేస్తుంది

ఆ యింటి వరండాలో
వాల్చిన కుర్చీలు
ఆపేసిన సాహిత్య సంవాదాల్నో
కొనసాగించలేకపోయిన
కవితా చరణాల్నో
తలచుకొని చిన్నబోతుంటాయి

తన చేతులతో తడిమిన
పుస్తకాలు లేక
వెలవెలబోతున్న గూళ్ళూ
ఆ పాదాల మునివేళ్ళు చేసే
స్వరాల ఆలాపనలు సోకక
బేలతనమంటిన గదులూ
పిల్లల అల్లరి సోకక తెల్లబోయినగోడలూ
సంధ్యవాలిన ఆ యింటిలో
చంద్ర కళాగమనమెపుడని
మనల్ని మరీ మరీ ప్రశ్నిస్తాయి

ఆ దారిన వెళ్తే
ఎండావానా చలీ దేన్నీ లెక్కచేయక
ఆ యింటి యిల్లాలు పాడిన పాట
జ్ఞాపకమొస్తుంది
ఇంట్లోకి అడుగుపెడుతూనే
కాళ్ళకు చుట్టుకుపోయే పిల్లలూ
ఆ పుస్తక ప్రపంచంలో సేదదీరే
పాఠకులమై మనమూ
సమూహాల్ని అక్కున చేర్చుకునే
తల్లి కళలా ఆమె
జ్ఞాపకమొస్తుంది

ఆదారిన వెళ్తే
రహదారికి బలిఅయిపోయిన
నిండు జీవితం జ్ఞాపకమొస్తుంది
అదాటున మెరసి మాయమైన
పచ్చని సంసారం జ్ఞాపకమొస్తుంది
(డా.తుమ్మల రామకృష్ణ సహచరీ కథకురాలూ చంద్రకళ స్మృతికి)

## తీరదు చింత

ఉసిళ్ళను ఎదురు చూసే వానలా
నాగలిని ఎదురు చూసే చాళ్ళలా
వాళ్ళకై ఎదురు చూసాను

వాళ్ళవయిన యిన్ని మాటలైనా విని
నా యే గాయానికైనా మాలాములా
పూసుకుందామని నిరీక్షిస్తాను

సామూహిక యోగుల్లా
నిశ్శబ్దాన్ని ధ్యానం చేస్తున్న పక్షుల్లా
వుపద్రవాల మడివొడ్డున
మూగబోయిన నెగుళ్ళ మధ్యకు
గుక్కెడు ఎక్కిళ్ళనూ
గుప్పెడు అక్షరాలనూ చల్లి
చితి రాజేద్దామనే వెళతాను

చింతల చితిలో కాలుతూ
సంతాప ఘడియలు గడిచాక
కళ్ళలో నానినాని గట్టు మీద ఎండుతూ
ఘనీభవించిన దుఃఖాన్ని
నేత్రభాషలో ప్రవహింపజేస్తారు

కుళ్ళిన మళ్ళలో నిలిచిన నిలువెత్తు కన్నీటిలో
సుడులు తిరిగే కనుగుడ్లను
కనురెప్పల వోదార్పుల సరిహద్దులు దాటిస్తారు

గాద్గికమైన సంభాషణలు
గుండె గొంతుకలోన కొట్లాడి కొట్లాడి
లోపల రగిలే గాయాలకు మరికొన్ని గాయాలు జతకూడుతాయి

నెమ్ము సోకిన దేహాల శీతల వూపిరులు తాకితాకి
అనుభవాల శెగలు కొత్తకథలవుతాయి
నిత్యగాయాల నదులు కదా వాళ్ళు
చేతి వేళ్ళకు పూటలు నింపుకునే చెట్టును నేను
యిరువురిని వొరుసుకుంటూ కాలం

## దాలికాగు

భీతువులు పాడిన పాటలు
బధిర బెతోవెన్ కూర్చిన స్వరాలు
నిరంతర పదుబాట్ల గాటన కాలపు నాగుకాట్లు
వొరుపుల కోరలకు చిక్కిన నేలలు
వలస ఆక్రమణలైన ఆత్మగౌరవాలు
అస్తిత్వం మాయనా?
ఆత్మలకు తగిలిన గాయం మానునా?
పరాధీన భావనల అలియనేషన్
కాళ్ళుదిగిన నేల మీదికి ఎగిరొచ్చిన పక్షులు
ఆశ్రయమిచ్చిన చెట్టునే ఆక్రమింపజూసేనా

నిజం కాలానికి నిలిస్తే అబద్ధం
కాలతీరం దాటిన అబద్ధం నిజం
ఏరు దాటిన వాడి చేతుల్లో నావగతి
అమ్మతనం దగ్ధత
సహోదరత్వం వుద్విగ్నత
భాషలోని అచ్చులూ హల్లులూ మధ్య యుద్ధ గీతిక
భాష ఒకమాయ
భావం జగన్మాయ
నేల మాత్రమే నిజం - నేల మీద పారే నీరు పచ్చినిజం

ధీరువులు పాడిన దుఃఖం
ఆనకట్టల ముందు కన్నీరు
యిరు తీరాలనూ దహించే నాల్కలు
గాయం చిగుర్చే చెట్టుకు గమించే గాలులు
కొమ్మ కొమ్మకూ రెమ్మ రెమ్మకూ రవలించే నాదాలు
గాయాలు స్రవించే పరాధీనత రమించే
నగ్న దేహాల రణాన్నినాదాలు

* * *

ఈ అచ్చుకు హల్లు పొదగిట్టదు
ఈ కలయికలో ఆనందం లేదు
కొత్త భాషలో యీ కవిత
కొంగ జపాన్నీ
ప్రాంతాల అవ్యాజానురాగాన్నీ లిఖించదు
ఏ భూమిక మీదైనా
నాటనాధిపత్యాన్ని ధిక్కరించకమానదు

నీ భాషలో
ఎగిరొచ్చిన పక్షికి వలసత్వము
స్థిరనివాసమే
కాలువల వెంబడి పారిన కుట్రంతా
రేగడి విత్తుల వైట్‌మాన్స్ బర్డనే

* * *

ఈ నేల రసికారుతున్న గాయం
ఒక పచ్చినిజం
నుసినుసిగా మారుతున్న ఆత్మగౌరవం
ఒక పురి విప్పే ఫీనిక్స్
"అరే భాయ్ యీ జమీన్‌ను విముక్తం చేయి" ఒక గెంతెత్తిన ప్రతిఘటన

*

దేశరాజు కవిత

## .... ముంగిట ముత్యము వీడూ

అనుకోని కలలా
ఊహించని మెలుకువలా
అంతా హఠాత్తుగా
నదిపై ప్రయాణం అంత సులువేమీ కాదు

* * *

ఊగిసలాట
నరాలను ఉద్రేకపరిచే విద్యుత్
చిలికితే చల్ల చిందొచ్చు
చితికితే కన్నీళ్ళు ఒలకొచ్చు
వంతెన కింది చీకటిని బాహు సందోహంతో వెనక్కునెడితే
ప్రభవించిన ఓ వెలుతురు గీతం!

* * *

ఎలాంటి సమయమది
ఎంత ఉద్వేగానుభవమది
పొదవి పట్టుకున్న రాములక్కాయ
నెలల తరబడి తియ్యని కలలతో పెంచుకున్న రంగుల పుష్పం
నీటి పాలవుతుందేమోనని ఎంత భయం
జీవితం పుటుక్కున ముగిసిపోతున్నట్టు

* * *

ఊపిరి తీశామా గాలినే పీల్చామా
వెండి వెలుగుల వెలుతురు పక్షి కనబడేవరకూ
గుర్తు చేసుకున్నా జ్ఞప్తికొస్తుందా
అణువణువునా సంబరాన్ని నింపిన ఆ ఉద్విగ్నత!

ముగిసిన దిగ్విజయోత్సవంలో ఒకరు
ఆనందపు విశ్రాంతి
మొదలైన ప్రారంభ ఆర్భాటాలతో మరొకరు
నిదుర నవ్వుల కాంతి

* * *

ఓ హెచ్చరిక
ఇది గరళ సంతోషపు మిశ్రమ సంగమం
నావికుడా పడవ జాగ్రత్త
పడవనల్లుకున్న అనుబంధపు పరిమళాలు జాగ్రత్త!!

* * *

పదిలంగా అల్లుకునే శక్తిలేక
ఇనిస్టాల్‌మెంట్లలో కొనుక్కున్న సౌఖ్యం ఆ గూడు
అయితేనేం మహాద్వారం తెరిచి లోపలికెళితే
ఎలా ఊహించుకుంటే అలా మారిపోయే పొదరిల్లు అది
అటువైపు తలుపు తెరిస్తే వెండి వెలుగుల జాబిల్లి
తోసుకొచ్చే చల్లని గాలుల అల్లరి అల్లిబిల్లి
నీలాకాశాన్ని నాలుగు కోళ్లకు బిగించి కడితే
అవ్యక్తమైన భాషతో ఆనందంగా పలకరించే కనుదోయి

నావికుడా
అప్పుడది ఇల్లా వాకిలా?
ఉద్యానవనమా?!

* * *

నిముష నిముషం ప్రాణవాయువులూదుతూ
ప్రవాహం పరిమళాల పరవళ్ళు తొక్కుతోంది

నిదుర నవ్వులు దోబూచులు ఆడుతున్నాయి
కనుదోయి కవ్వింతలు నేర్చాయి
అడుగులు నడకలై నడకలు పరుగులై
చెంగు చెంగున ఎగురుతూ లేళ్లతో పోటీపడుతున్నాయి
చీకటి కాఫీ తోటల మధ్య పలుకుల పంచదారలు
అప్రతిహతంగా జాలువారుతున్నాయి

నావికుడా
అప్పుడది ఊరా అడవా
హృదయమా

* * *

ఇది స్వప్నమూ కాదు కాంక్షా కాదు
కఠినానంద వాస్తవమూ
జీవితమే సఫలమూ

ఇప్పుడు మరో హెచ్చరిక
నావికుడా
ప్రవాహ గతిని తెలిసి మసలుకో
పసితనాన్ని ప్రాణపదంగా పొదవి పట్టుకో దాచుకో!!
(ఆశకీ, ఆకాంక్షకీ)

*

**యార్లగడ్డ రామచంద్రారావు కవిత**

## జర పయిలం బిడ్డా

అల్కిన సెల్కు
సినుకులేక అట్టకట్టినట్టు
బిర్రబిగిసిన గీ బతుకంత
బర్రెబత్తల బారాతే గంద బిడ్డా

గడీల నాటి బిడ్డలం
గడిలు పాయె దొరలు పాయె
గంతల్నె కొత్తరకం దొరలొచ్చి
కోతమీస కోత పెట్టిపాయె
పొద్దుగల పొద్దిమింక ఒక్కతీర్గ
సీకట్ల తద్మలాటల
సూపుకు సుక్కలందిందెంపుడు బిడ్డా

కల్లు తీసెనాడు కండ్లు కల్పిండో
కోత కోసెనాడు గుండె గీటిండో
ఎర్కలే గాని
మాఘం పొద్దుల పోశన్న
పుస్తె కట్టింది యాదినె బిడ్డా
ఆశికంల కాగలిన్చుకుంది యాదినె బిడ్డా

గాడికెల్లి ఎట్ల గడ్సిందొ మర్సినా గాని
పెండబెట్టి అల్కిన ఇంట్ల
పేరంటం జర్గింది లేదు బిడ్డా
ఒక్కనాడు ఒడిల సందమామ ఒల్కింది లేదు బిడ్డా

గుడ్సెక్కి కోడి కూస్నా
పొయ్యిల పొద్దు నిండా తెల్లార్క పాయె
మెత్కెన్క మెత్కు కోసం
పొద్దెన్క పొద్దు కోసం
'రెక్కెన్క' రెక్కలిర్గదీస్కున్న
సేలగట్టపొంటి
ఇంట్ల పాసిపనిపొంటి
ఆసెన్క ఆస ఎల్లమార్పోయింది యాదినె బిడ్డా
కాలమెన్క కాలం గత్తరైంది యాదినె బిడ్డా

గీ బండగాడ్కెల్లి
గా కొసదాంక భూతల్లి
పచ్చసీర కట్టి కుల్కుతుండె
మరి అన్యాయమెందొగాని
బండెన్క మా బద్కులన్ని
ఎండపొద కాగికాగి మండుతున్దె

గీ బత్కుమీన మన్నురాత
ఏ బాడ్కవ్ రాసిపోయిండొగాని
కూదుకుంద నిందుకుంటె
కున్కు కమ్మగెలగుంటది బిడ్డా

దిక్కు దిక్కు దూస్కొచ్చి
నేల దోసిట్ల రాసులెక్కపోసిన
గుడ్సె గుంజ లెక్క పాత్కపోయింది నిజం బిడ్డా
గాపన్చన గీపన్చన సాగిలంపడి
పాతాళంల పాతరై నెట్కచ్చింది నిజం బిడ్డా

గీ పుట్కలు దిష్టిపుట్కలెట్లాయెనొ
పైసల్లేని పానాసరం పడిపాయె
పుట్కలెట్లాయెనొ గాని
బిడ్డలు మన్మలు
కష్టాల కొట్టంలోనె దూడలైతిరి
మతలబు లెర్కలేకపాయినా
ఏగాని కోసం ఎట్టి పాలైతిరి

డొంకదార్లెగాని
మా అడుగుల్ని నెత్తికెత్తుకున్న
నిట్టెందార్లేవి బిడ్డా
సంకటి కాలం ఆపసోపాల కాలమె గాని
మారిన కాలం మాకు
జొన్న పొత్తిలెక్క అందిందెపుడు బిడ్డా

మొల్కరాని ఇత్తులెక్క
ఎప్పుడొ మన్నుల ఊటెండిపాయె
ఉద్కని గింజలెక్క
గిప్పుడు అయిసై పాయె
మొండిబారి నదుమొంగిపాయె
మన్నంటుకున్న ఊపిరి
మిన్నంటుకున్దుకు సిద్ధమైపాయె

* * *

బిడ్డా
కొత్త కొత్తగా ఇన్కుంటుంటి బిడ్డా
తెల్లోన్కి నల్లోన్కి పచ్చోన్కి
పొట్టోన్కి నద్దిముక్కోన్కి
యాదయాదోన్కి
గీతలు సెర్గిపోయినంటుండ్రు
గీ భూతల్లికెల్కి గా సుక్కల నేలదాంక
యాదేదిలోకమూ ఒక్క తీర్గ కల్సిపోయిందంటుండ్రు
నిజమంటవా బిడ్డా

అయినా నాకు తెల్వ కదుగుతా బిడ్డా
ఇంక ఇది
పైసతాడు తెప్పె బొంగురం గాదంటవా గీలోకం
బల్మిగలోదు బల్మిటికి
బత్కులకు బుగులు బుగ్గి పూసెడి
బందూకుల కానగదంటవా గీలోకం

నే నమ్మ బిడ్డా నే నమ్మ
గడీల గీతల్ల మా బత్కులు సెర్గిపోయిన తీర్గ

పైస బత్కినన్ని రోజులు
గీ కొత్త కొత్త సందూక్ల
మా బత్కులు సిక్కుబడి
సెవాలై గీపెట్టెడి యాష్ట తర్గదు బిడ్డా తర్గదు

నువ్వు మాత్తరం
జర పయిలం బిడ్డా
గీ యవ్వ మాట య్యాదుంచుకోబిడ్డా
గీ లోకమన్తా పెద్ద పరాసికం
యాసాలు మారినై, మోసాల తీరు మారినై
ప్యాదోల్లు ఎకసెక్కమాయె సిత్రమేమి మార్లె
పిడికెట పేణం పట్టి
పిండేటి తీరు మార్లె
పైసల బత్కమ్మ సుట్టు
పొర్లెడి బత్కులొక్క తీరుమార్లె
జర పయిలం బిడ్డా
బాంచనంటె బందలదొడ్లొ కుక్క తీరు బిడ్డా

బత్కు బిడ్డా
జర నీవైనా మానంతోటి ఇమానంతోటి
మన్సుతోటి బతుకు బిడ్డా
మాలెక్క నదిలొ తేలిన ఇస్క లెక్క
ఇర్గిపోకు బిడ్డా ఇర్సుకు పదుబిడ్డా
సచ్చెడి నీయవ్వ మాట సద్దిమూట
నీ లెత్వీసన్నుల పెట్ల దాస్కోబిడ్డా
సెన్గపూల లెక్క ఇరిసి
సెమ్ట సుక్కను దీపమెట్కో బిడ్డా
అడ్గు నేల దాటి ఎగ్రకుండ అద్మి పట్టుకో బిడ్డా
అద్మిపట్కో

*

[illegible] సూర్యనాథ్ కవిత

## కొంత చీకటి - మరికొంత వెన్నెలా

రాత్రులు కొన్ని
ఎప్పటికీ తెల్లారవు
కన్నీళ్ళు కొన్నిసార్లు
ఎన్నటికీ అగవు

క్షణాలు కొన్ని
యుగాలుగా తోస్తాయి
కమ్మిన ముసుర్లు కొన్ని
ఎప్పటికీ తెరిపివ్వవు

వెంట ఉండిన ఊహలు కొన్ని
రెక్కలు తెగి కూలిపోతుంటాయి
నింగికెగిసిన గాలిపటాలు కొన్ని
బొద్దుముడి తెగి కొట్టుకు పోతాయి

చేతులు కొన్ని
కంపరం పుట్టిస్తుంటాయి
చూపులు కొన్ని
ద్వేషాన్ని పలికిస్తుంటాయి

వెలుగుల నీడలు కొన్నిసార్లు
భయపెడుతు వుంటాయి
నీడల జ్ఞాపకాలు కొన్ని
ఎప్పటికి వెంటాడి వేధిస్తాయి

ఇచ్చిన మాటలు కొన్ని
వమ్ము అవుతుంటాయి
అడుగుల చప్పుళ్ళు కొన్ని
పీడకలలవుతుంటాయి

చల్లగాలులు కొన్నిసార్లు
గుండె గాయాల్ని పగిలిస్తుంటాయి
అడవి గాచిన వెన్నెల
ఆవిరైపోతుంది

రాత్రులు కొన్ని
దివిటీల్లా వెలుగుతుంటాయి
కన్నీళ్ళు కొన్నిసార్లు
ఆగ్రహం తెప్పిస్తాయి

క్షణాలు కొన్ని
మెరుపులై మెరుస్తాయి
కమ్మిన ముసుర్లు కొన్ని
కొత్త వెలుతురుకు తోవనిస్తాయి

వెంట ఉండిన ఊహలు కొన్ని
కొత్త చిగుళ్ళు వేస్తుంటాయి
నింగికెగిసిన గాలిపటాలు కొన్ని
పిల్లలు పూయించిన హరివిల్లులవుతాయి

చేతులు కొన్ని
ఉత్తేజకరమైన కరచాలనాలవుతాయి
చూపులు కొన్ని
వెలుతురు పాటలవుతాయి

వెలుగుల నీడలు కొన్నిసార్లు
తోవ చూపిస్తాయి
నీడల జ్ఞాపకాలు కొన్ని
ఎప్పుడూ హెచ్చరిస్తాయి

ఇచ్చిన మాటలు కొన్ని
చివరిదాకా నడిపిస్తాయి
అడుగుల చప్పుళ్ళు కొన్ని
భరోసా యిస్తుంటాయి

చల్లగాలులు కొన్నిసార్లు
వెన్నెల పూవుల్లా పూగుతాయి
అడివిగాచిన వెన్నెల కొంత
కార్చిచ్చై రగులుతుంది

*

## కాశీం ఖైదు కవితలు అయిదు

### ప్రియురాలి ఉత్తరం

నిన్న పెదాల నుంచి
రాలిపడిన
పుప్పొడి రేణువులాంటి
అక్షరాలతో రాసుకొని
అపురూపంగా
గుండెగదుల్లో దాచుకున్నవి
ఇవ్వాళ
దగ్ధం చేయాల్సిందే

అవి స్మృతులైతే
చూసేవాళ్ల సమస్య
అవి రహస్యాలైతే
రాజ్యం ఊర్కోదు

కనురెప్పలపై రాసిన
ప్రియురాలి ఉత్తరం
కాలిపోతున్న
అమరవీరుడి
స్వప్నంలా నావైపే చూస్తుంది

ఏకాంత క్షణాల్ని పెన్నులో నింపి
చిన్నప్పుడు
పులిజరి పండ్ల రసంతో
ముల్లుకర్రను స్నానమాడించినట్లు
ప్రేమను డైరీ నిండా చల్లితే
రైడింగ్ విషపు చూపుల్తో
గేలి చేయబడ్డది

కర్రు తగిలి పరవశించిన భూమిలా
సంఘర్షించిన భావాలు
మంచుకు కళ్లు తెరిచిన
మల్లె మొగ్గల్లా రాసిన డైరీ
డంప్‌లో దొరికిన సాహిత్యమట

చెదల పురుగు నోటి ముద్దను
దొంగిలించి
మా అమ్మ పెద్దచీరను దాచుకున్నట్లు
బైండింగులో భద్రపర్చి
వచ్చిపోయే వారి దోసిళ్లలో
నాలుగు అక్షరాలు పోసినందుకు
పుస్తకాలతో రాజ్యాన్ని కూల్చే
కుట్రదారులమయ్యాం

### శత్రు శిబిరంలో

తొలకరి చినుకుల్లో
తలస్నాన మాడిన నాగలిని
మా అమ్మ
ఎర్రమన్నుతో అద్దినట్లు
మేము
గుడితలపులనే కదా
మునివేళ్లతో తాకింది

వసంత కోకిల ముక్కు
లేత చిగుర్లను తాకినవేళ
కొండ మెట్లనే కదా మా పాదాలు ముద్దాడింది

చిగురిస్తున్న
ఆకుమెడలో వేసిన
మూడుముళ్లనే కదా మేము చూసింది
పసుపు కుంకుమ
పెదాల కొసన పూచిన
మంత్రాలనే మేము విన్నది

* * *

మమ్మల్నిద్దరిని పట్టడానికి
మీ చేతులకు
నలభై ఎకె47లు మొలిపించాలా
పెకలని
వందల గొంతుల మధ్య
మేము మాత్రం ఎక్కడికి పోగలం

మా వాళ్ల రక్తంతో
మీరు అనాదిగా రాసిన
పుస్తకాల్లో ఈది
నేను రోజుకు మూడుగంటలు
బ్లాక్‌బోర్డుపై అక్షరాలై మాట్లాడేవాడినే కదా

ఆమె మీ న్యాయదేవత సాక్షిగా
నల్లకోటుకు చెవుల్ని తగిలించి
యువర్ ఆనర్
చదివే విరామరహిత వాక్యాల కోసం
పుస్తకాల్లో పారాడేదే.

* * *

అసుర సంధ్యవేళ
గబ్బిలాలు
చింతచెట్టుకు వేలాడినట్లు
మా రెండు మెడల్లకు

ఎన్ని ప్రశ్నలని వేలాడదీసి
రక్తాన్ని తాగుతారు

మా కళ్లలోని
కొన్ని రహస్యాలను ఊడబీకి
శత్రు శిబిరానికి తగిలిస్తామనుకున్నారా
మేము
త్యాగాల సముద్రంలో ఎగిసిపడి
హత్తుకున్న కెరటాలమని
మీకూ తెలుసు

మా స్వప్నాలపై
టార్చర్ రహదారిని
నిర్మించలేరని తెలుసు

మీ ప్రశ్నలను సహించలేని
మా హృదయాలను
గుండు సూదులతో
ఎన్నిసార్లు గాయం చేయగలరు

గద్దలు మృత కళేబరంపై
జాలి చూపినట్లు
మా కంట్లో ఘనీభవించిన
నీటి బిందువుకు
మీ సానుభూతి అక్కర్లేదు
అది పదునెక్కటమే
ఈ క్షణాలకు అవసరం

## నా బ్యారక్‌లో

తలవంచి
అడుగు పెట్టామంటే
కాకుల శబ్దమే కాని
వాటి గూటిలో
రాయి వేసిన
సూర్యున్ని చూడలేము
గోధూళి వేళ కన్పించదు
అమరులు
నక్షత్రాలై మాట్లాడుతారని
చుక్కల్ని చూడనివ్వరు
మేఘాలు మాత్రం నీటి చుక్కలై
అప్పుడపుడు
కిటికీ దగ్గరకు వొచ్చి మాట్లాడుతాయి
ఎన్నో రాత్రులు నిద్రపోయాయి
ఒక్కటీ నాతో మాట్లాడలేదు
మబ్బుల్ని ఆకాశానికి వేలాడదీసిన చంద్రుడు
వెన్నెలను పారేసుకొని
జైలు గోడలపై ఉన్న
కరెంటు తీగలకు వేలాడాడు
పొద్దున్నే
ఒక తెల్లని పావురం
చంద్రుని చావు కబురు
ముక్కుకు కరుచుకొని
నా బ్యారెక్‌లో వదిలిపోయింది
వేపచెట్టుపై
తగలబడుతున్న
పావురాల గూళ్ల మధ్య
పొలం గెట్టున
ఎద్దుగిట్ట కింద నలిగిపోయిన
బురకపిట్టలా
అప్పుడే కళ్లు తెరిచిన
పసిగుడ్డు కనిపించింది
రెప్పపాటు కాలంలో
ఆకుల దోసిల్లో ఒదిగి
స్వేచ్ఛా రెక్కలు తొడుక్కొని
ఎగిరిపోయింది

## స్మృతులు

పెనవేసుకున్న
పావురాల కనురెప్పల్లా
ఎంతకు వీడని
స్మృతులు

ఆకురాలుతూ
వసంతాన్ని వాగ్దానం చేసినట్లు
సంఘర్షిస్తున్న భావాలు
వలసపోతున్న పక్షుల గుంపులా
బస్సుతో పాటు
ఆలోచనల పరుగు

కిటికీలో నుంచి
తొంగిచూస్తున్న ఆకాశం
వరిమడిలో
వేపచెట్టుకు వేలాడుతున్న
రైతు శవం చిరునామా కోసం
గడ్డిపూలను అడుగుతున్న దృశ్యం

నాగలిని పడేసుకొని
కర్రు
భూమి స్పర్శను అరువివ్వమని
ట్రాక్టర్‌ను అడుగుతుంది

దగ్ధమవుతున్న భూమిలో
ఎద్దుగిట్టలకోసం
ఆరిద్ర పువ్వు
బూడిదలో పొర్లాడుతుంది

లేత వేపచిగురు నవ్వులపై
మేకపిల్ల
తల్లిపాల పొదుగును ముద్దాడుతుంది
ఇపుడు
నా బాల్యపు గుర్తులపై
పాదం మోపి
నిన్న కాగితంపై
ప్రేయసి అల్లిన ఊహల
మడతలను విప్పి
లేగదూడలతో పంచుకుంటున్నాను

మా తెల్లావు కనుకొలుకుల్లో
రత్తక్క చివరి శ్వాస వెలుగుతుంది

## మెతుకు జాడకోసం

ఒక మెతుకు
నా పెదవు దగ్గరకు వచ్చి
ప్రియురాలి కరస్పర్శలా తాకింది
తలెత్తి చూశాను
కనురెప్పల క్రింద ఊరిన
చెమట చుక్కలా మెరుస్తూ
నా నేస్తం
నన్ను కన్నార్పకుండా చూస్తుంది
నేను
మెతుకు గుండెలోంచి చూస్తే
అన్నం ఉడికిన కుండ కనిపించింది

కొమ్మపై
కోకిల గొంతులో
తొంగి చూస్తున్న వసంతమై
ప్రేమ రెక్కలు తొడుగుకొని
మట్టి పరిమళమై ఎగిరింది

ఒక రోజంతా
బంతిపూల తోటలో
జ్ఞానమై విచ్చుకున్న
చారిత్రక భౌతిక వాదం
బావిలో బొక్కెనలా
సమాజాన్ని తోడేస్తుంటే
ప్రియురాలి చూపుల్లో
ఈదులాడిన

చెలమల కనుపాపల్లో
పొడిచిన చందమామ వెలుగులో
మట్టిలేచి
విస్తరాకు ముందు బంతి కూర్చుంటే
మల్టీనేషనల్ సంతలో
మెతుకు తప్పిపోయింది
తప్పిపోయిన తల్లికోసం
లేగ పరిగెత్తినట్లు
మెతుకు జాడ కోసం
మేమిద్దరం బయలుదేరాం

*



## పేగు బంధం

ఎంతసేపూ జననాల్ని మరణాల్ని
వెంటేసుకుని జీవితాంతం చరమ సత్యంగా మోయడమే బాధ

మరీ బాధ!
మన ప్రేమలు బంధాలై బిగుసుకున్నాక
అనుబంధాలై జీవితమంతా పెనవేసుకున్నాక
తాడు తెగినట్లు పుటుక్కున తెగిపోతే
ఓర్చలేనంత బాధ

ముచ్చట్లు, ముప్పిరిగొన్న ముద్దు మురిపాలు
ప్రతిక్షణం అంటిపెట్టుకున్న ఆత్మీయతలు
తల్లీ కొడుకూ పేగుబంధమై
బతుకంతా ఆవిరయిన కొడుకై అక్కున చేర్చుకున్నాక
అమాంతం గద్దలా మృత్యువు తన్నుకుపోతే
తట్టుకోలేక పోవడమే బాధ!

ఒడిలో పడుకున్న తన ప్రియాతిప్రియమైన వాడిని
హఠాత్తుగా జార్చుకున్నాక,
ఇంకేమీ చేయలేక మిన్నకుండి పోవడమే
మరీ బాధ.

"మై హూఁ నా"
నేనున్నాను కదా! అని భరోసా ఇచ్చిన వాడికి
ఏ భరోసా ఇచ్చి మళ్ళీ తెచ్చుకోవడం,
వెనక్కి రా రమ్మని పిల్చుకోవడం ఎలా!
తనతో కలిసి తన చెలిమి కాండ్ల దగ్గర
అందరి అమ్మలా ఉప్పొంగడం, సంతోషంతో తడిసిపోవడం ఇంకెలా!
అమ్మలా కాక అక్కలా; అక్కలా లేక స్నేహితురాలిలా
చెట్టాపట్టాలేసుకుని చెంగుచెంగున గెంతుతూ ఇంకెలా తిరగడం

అమ్మను, అమ్మమ్మని, పెద్దమ్మల్ని
తనివితీరా సంతోషపెట్టే ఆ ఆరింద ఆహ్లాదపు
భాషణల మాధుర్యమెలా వెనక్కి రప్పించడం

తను వెళ్లిపోవడం సరే!
తాను కొనిపించుకున్న ఈ చొక్కాల్లో
నా బిడ్డ ముద్దుముద్దుగా మురిసిపోయే దృశ్యాల్ని
నేనెలా చూడటం

"దేవుడు ప్రేమించినవాళ్ళే చనిపోతారంటావా"
నీవు కొనుక్కొచ్చిన టీ షర్టుల మీది వాక్యాలు
నిజంగానే నిజమైనందుకు ఇంకెంత శోకించను!

అన్నాయ్ పంపిన అపురూప కానుకలతో
ఆనందించే నీవు
ఆనందాన్ని చరమగీతంగా పాడుతూ ఎలా సాగిపోయావో
మళ్ళీ నా దగ్గర కొచ్చి వినిపించవూ!

తల్లీ కొడుకు బంధమేదో
సన్నని దారమే అయినట్లు చాలా తేలిగ్గా తెంపుకుపోతే
తెగని దారాలకు చుట్టుకుని ఊపిరాడని దుఃఖంతో
నేనెలా బతకడం.

రాత్రులు నాకు మిగిలిన రణరంగాలు
పగళ్ళు నాకోసం ఎదురు చూసే మందు పాతరలు
శోకవహ్నిలో దగ్ధమవుతూ, దహించుకుపోతూ
జీవితం ఇక మిగిలిన శేషంగా ఎలా బతకడం.

రాగ్ బాబూ! ఒరే మున్నా!
నా బంగారుకొండా!
నా చిన్నారి స్నేహితుడా!!!
ఒక్కసారి వచ్చిపోరా .
మళ్ళీ నిన్ను ఎలా పంపకుండా ఉండాలో
నాకు బాగా తెలుసు!

(ఓదార్చబోయిన నన్నే ఓదార్చిన కమలకు....)



## దాశరథి రంగాచార్య

మానవుడే మనజెండా, మానవతే ఎజెండా - ఇలా మొదలు పెట్టి మాట్లాడాలనుకున్నాను - నాకూ సభలకు రావాలని, మీ మధ్యలో ఉండాలనీ ఉంది. కానీ ఆరోగ్యం సహకరించటం లేదు. మహాసభలు లాంఛనమే అయినా అదిచ్చే స్ఫూర్తి మాత్రం అపారంగా ఉంటుంది. సాహిత్య రంగంలో విరసం చేసిన కృషి గొప్పది. చాలా పనిచేసింది. నాదొక్కటే బాధ - సంస్థలో రెండో శ్రేణి నాయకత్వం ఎదగటం లేదు - కారణాలు ఆలోచించాలి.

సాహిత్య సంస్థలకు ఒకప్పుడు పార్టీ డైరెక్షన్ ఇస్తుండేది. ఇప్పుడది లేదు - మనమే అందరం కూర్చుని ఆ దిశానిర్దేశం చేసుకోవాలి - మహా సభలు విజయవంతం కావాలి.

## నారాయణ స్వామి

### యిరవయ్యవ మహాసభలు జరుపుకుంటున్న విరసానికి జేజేలు!!!

ఒక సాహిత్య సంఘం 36 యేండ్లు నిరాఘాటంగ మనగలగడం - అదీ, ప్రభుత్వం కన్నెర్రలకు ప్రతిరోజా గురి అవుతూ బ్రతకగలగడం - అంతే గాక సజీవంగా, మరింత వుత్సాహంతో, నిత్య యవ్వనంతో జలపాతంలా వురకలెత్తడం - అంత సామాన్యమైన విషయం ఏమీ కాదు. అందుకే ఈ సభల సందర్భంగా విరసానికి జేజేలు. పుట్టిన గడ్డకు వేల మైళ్ళ దూరంలో వున్నా, విరసంతో వున్నది పేగు సంబంధం కదా, అది తెంచుకోలేక, విరసం కోసం అనుక్షణం తపిస్తున్నాను. నిరంతరం విరసం ఒక జీవనదై పరుగులెట్టాలని, తెలుగువారి సాహిత్య సాంస్కృతిక జీవితాన్ని ప్రగతిశీలంగా సుసంపన్నం చేయాలని మనసారా కాంక్షిస్తున్నాను.

విరసం గత సభలకూ ఈ సభలకూ వొక స్పష్టమైన తేడా వుంది. పోయినేడాది విరసం ప్రభుత్వ నిషేధానికి గురయింది. గతంలో యే ప్రభుత్వమూ ఆర్జించని కీర్తి, ఈ ప్రభుత్వం విరసాన్ని నిషేధించి సంపాదించుకొంది. బహుశా ఇది మన దేశ చరిత్రలోనే మొదటి సారి కావచ్చు - వొక రచయితల సంఘాన్నే మొత్తంగా నిషేధించి ప్రభుత్వం మీసం దువ్వుకోవడం. అయితే ఆ దువ్విన మీసం మీద నిమ్మకాయ కాదు కదా వొక యాగను కూడా నిలబెట్టలేకపోయింది. సర్వవ్యాప్తంగా పెల్లుబికిన తీవ్ర నిరసన వెల్లువలో ప్రభుత్వ 'రోషం' కొట్టుకుపోయింది. నిషేధం యెత్తివేయక తప్పింది కాదు. తన మీసం దించుకోక తప్పింది కాదు. తెలుగుదేశంలోని ప్రగతిశీల కవులూ, రచయితలూ, కళాకారులూ, బుద్ధిజీవులూ ఒక్కతాటిమీదకు వచ్చి విరసంపై నిషేధాన్ని ముక్త కంఠంతో ఖండించారు. ప్రభుత్వం విధించిన నిషేధం చెల్లదనీ, వాక్సభా రచనా స్వాతంత్ర్యాలు రాజ్యాంగం ప్రసాదించిన మౌలిక హక్కులనీ వాటిని కాలరాచే అధికారం దుష్ట ప్రభుత్వాలకు లేదని ప్రకటించారు. సమాజంలో చెడును వ్యతిరేకించడం కోసం, సమూలంగా మార్చడం (అది సాయుధంగా అయిన సరే) కోసం, కొత్త విలువలనీ సంస్కృతినీ నిర్మించడం కోసం రచయితలు ఒక్కతాటిమీదకు వచ్చి సంఘంగా ఏర్పడి సాహిత్యం సృష్టించే హక్కు మౌలిక హక్కు అనీ, దాని గుంజుకునే అధికారం ప్రభుత్వాలకు ఎంత మాత్రం లేదని స్థాపించగలిగారు. ఈ విజయం మామూలు విషయంకాదు. ఇది ఒక కొత్త చరిత్రకు నాంది. ఈ మహాసభలు ఈ విజయాన్ని సెలెబ్రేట్ చేసుకుంటున్నాయి.

అయితే విరసం ఈ సెలెబ్రేషన్ సందర్భంగా ఒక విషయం స్పష్టంగా గమనించాలి. విరసం ఆహ్వాన సంఘం కరపత్రం, ఏ ప్రజాస్వామిక ప్రగతిశీల రచయితకైనా ఛాతీ ఉప్పొంగించేవిధంగా ఉంది. పేరున్నొక్క తెలుగు రచయితలూ, కవులూ, బుద్ధి జీవులూ అంతా దానిలో ఉన్నారు. వాళ్ళందరూ విరసానికి యివ్వాళ్ళ సంఘీభావం తెలుపుతున్నారు. కష్టకాలంలో, నిషేధకాలంలో, ప్రభుత్వ బెదిరింపులకు జడవక విరసం వెన్నంటే ఉన్నారు. విరసం రచయితలు జైళ్ళలో బంధించపడ్డప్పుడు, చిత్రహింసలకు గురయినప్పుడు, బూటకపు ఎన్‌కౌంటరయినప్పుడూ వీళ్ళంతా విరసానికి అందించిన తోడ్పాటు మామూలు విషయంకాదు. ప్రభుత్వమూ, పోలీసులూ అనేక రకాలుగా బెదిరించజూసినా, నానా రకాలైన విష సర్పాలై కాటేసినా బెదరకుండా విరసాన్ని గుండెల్లో దాచుకున్నరు. వాళ్ళంతా స్థూలంగా ఏమి కోరుకుంటున్నారో చాల స్పష్టమే. వాళ్ళంతా యివ్వాళ్ళ ఒక విశాలమైన ప్రగతిశీల ప్రజాస్వామిక సాహిత్య సాంస్కృతిక వేదిక అవసరం వుందని ప్రగాఢంగా నమ్ముతున్నారు. విషపూరితంగా మనజీవితాలని కబళించివేస్తున్న గ్లోబలైజేషన్‌నూ, స్థానికంగా మన మీద దుర్మార్గమైన ఆధిపత్యం చలాయించి బ్రతుకులని దుర్భరం చేస్తున్న శక్తులనూ ఎదిరించడానికి రంగం సిద్ధం చేసే ఒక కొత్త సాహిత్య, సాంస్కృతిక వేదిక కావాలనుకుంటున్నారు. సమాజాన్ని మార్చేందుకు ప్రజా బాహుళ్యాన్ని వుద్యుక్తుల్ని చేసేందుకూ, ప్రజల జీవితాన్ని అస్తవ్యస్తం చేస్తున్న ఆధిపత్య వ్యవస్థని కూలదోసేందుకూ అవసరమైన అన్ని రకాల సాంస్కృతిక వాతావరణాన్ని ఈ విశాల వేదిక సృష్టించే ప్రయత్నం చెయ్యాలనీ, ఆ ప్రయత్నానికి విరసం ముందుండి చొరవ తీసుకోవాలనీ అనుకుంటున్నారు.

## సందేశాలు

విరసం తన వెంట వున్న వీళ్ళందరినీ కలుపుకుని అటువంటి ఒక సాహిత్య సాంస్కృతిక వేదికని నిర్మించాలి. తానే ఆ వేదికగా మారాలి. యింతకన్నా మంచి అవకాశం మళ్ళీ రాదు. ఇది విరసానికి వొక పునర్జన్మ లాంటిది. ఈ సభల సందర్భంగా విరసం తన పాత సంప్రదాయాల్నీ, అలవాట్లనీ, పద్ధతుల్నీ, అభిప్రాయాల్నీ ఆత్మవిమర్శ చేసుకుని కొత్తగా జన్మించాలి. వొక సాహిత్య సంఘానికి, సమాజాన్ని సమూలంగా మార్చే రాజకీయాలు కరదీపికగా ఉపయోగపడవచ్చేమో గానీ, దిశ నిర్దేశం చెయ్యవచ్చేమో గానీ, అవే సర్వస్వం కారాదు. ఒక సాహిత్య సంఘం సాహిత్యం కన్న రాజకీయాలకు పెద్దపీట వేస్తోంది అన్నది తన మీద మోపబడ్డ అపవాదేనని ఈ సందర్భంగా విరసం ఆచరణ ద్వారా పునరుద్ఘాటించాలి.

నిత్య నిర్బంధంలో తన సభ్యుల్లో సగం కన్న ఎక్కువ మంది ప్రభుత్వ హింసకు బలైపోతుంటే రాజ్యహింస గురించీ రాజకీయాలగురించీ మాట్లాడకుండా ఉండలేని పరిస్థితేనని అర్థం చేసుకోగలం.

కానీ కాంషియస్‌గా సాహిత్యం గురించీ, సాహిత్య విలువల గురించీ, మంచి సాహిత్యం సృష్టించాలనే శ్రద్ధ గురించీ, ఎప్పటికప్పుడు సృష్టిస్తున్న సాహిత్యంలో కొత్తదనమూ, వున్నత విలువలూ, సమాజంలోని విభిన్న శ్రేణుల, ప్రాంతాల ప్రజల ప్రజాస్వామిక ఆకాంక్షలనూ ప్రతిబింబించాలనే నిరంతర తపన గురించీ విరసం ముందుండి ఆలోచించాలనీ, వాటికనుగుణంగా తన కార్యాచరణను సాధ్యమైనంతగా రూపు దిద్దుకోవాలనుకోవాలని కోరుకోవడం, అందుకు కలిసొచ్చే అందరినీ కలుపుకుపోవాలనుకోవడం, అత్యాశ కాదనుకుంటా!

అట్లా కలుపుకుపోవడం వొక తాత్కాలిక ప్రాతిపదికపై కాకుండా ఒక శాశ్వత ప్రాతిపదికపై జరగాలనుకోవడం గొంతెమ్మ కోరిక కాదనుకుంటా! విరసం మరింత విశాలమై మరింత ప్రజాస్వామికమై, ప్రజలపైన ముఖ్యంగా నిరుపేద శ్రామిక ప్రజలపైన జరిగే అన్ని రకాల సాంస్కృతిక, సామాజిక హింసనూ వ్యతిరేకించే వొక ప్రత్యామ్నాయ సాహిత్య వాతావరణాన్ని సృష్టించాలని ఆకాంక్షిస్తూ.....

ఉదయం రెండుగంటలు
జూన్ 10, 2006
న్యూ జెర్సీ, అమెరికా.

## ప్రొ. కె.విజయ్ కుమార్

మిత్రులారా!

విరసం మహాసభలకి నా శుభాకాంక్షలు. ఈ ప్రభుత్వ అప్రజాస్వామిక చర్యని నిర్వీర్యం చేసి తిరిగి ప్రజలతో మమేకమవుతున్న విరసంకి అభినందనలు. మరింత దృఢదీక్షతో విరసంను తన ప్రజాస్వామిక సిద్ధాంతాన్ని ప్రజల వద్దకు తీసుకువెళ్ళాలని, నూతన ప్రజాస్వామ్యం పట్ల ప్రజలలో చైతన్యం తీసుకురావాలని కోరుతున్నాను. విరసం మహాసభలు జయప్రదం కావాలని ఆకాంక్షిస్తున్నాను. నూతన ప్రజాస్వామ్యం వర్థిల్లాలి.

ఐ.ఐ.టి., ఖరగ్‌పూర్

*

# శికారి

☆ పాణి

## నవలిక

### సీరియల్

(క్రితం తరువాయి...)

అంతెత్తున పొద్దు కరకరలాడుతా ఉంది.

నానా గాలికి యాడాడ్నో తిరిగి పేటకు వచ్చినాడు. ఆ టయమప్పుడు శికారి పేట వొళ్ళంతా కళ్ళు జేసుకొని ఉంటాది. సారాయి కుండల కింద మంట లేచి గమ్మన వాసన మొదలైనాదంటే - యింగ అటుకెల్లిపోనీక కర్నూల్లో ఎవరైనా బయపడాల్సిందే. కొత్తోల్లు అగపడితే శికారోల్లు బిర్రుగా జూస్తారు. యాడ మీద పడి కొడతారోనని పోయినోల్లకు గుండెలు జారుతాయి.

పేపర్లోల్లు, ఎక్సయిజోల్లు వచ్చినారేమోనని శికారోల్లు అంబు మీద బాణంలెక్క రడీగ ఉంటారు.

గుమ్లి నాలుగు ఎల్లిబాయలు, దనియాలు నూరి పందికూర వండి తింటా ఉంటే నానా వాకిట్లోకి వచ్చి నిలబడ్డాడు.

గుమ్లి తిని చెయి కడుక్కోని ఎంగిలినీళ్ళు మెట్ల పక్కన పారబోసి ఆ తల్లెలోనే యింత అన్నం కూర వేసి బండల మీదికి తోసింది. నానా తింటాంటేనే కూర కుండ ఉట్టిమీద ఎగబెట్టి వాకిలి దగ్గరికి నూకి కట్టమీదికి పోయినాది.

నానా తిని సుంకులమ్మ కట్టకాడికి పోయినాడు.

గుమ్లి సన్నదాన్ని ఎనకేసుకొని సారాయి బట్టీ ముందట గూకోని మజ్జమజ్జలో మెడ అంతా తిప్పి చెట్ల సందులోంచి కొట్టంకెల్లి చూస్తాంది.

అరగంటాయె, గంటాయె

డొక్కోడు బిసబిస నడుచుకుంటా కొట్టంలోకి పోయినాడు.

'లంగనాఒట్ట.... యా బరూస ల్యాకుండ ఎట్టికి తిరగడమే...' అని తిట్టుకుంది. వాడు లోనికి పోయినాడంటే కూర చుప్పాగా కాజేస్తాడని ఎరికే. 'తూ...తూ... ఈడు... ఈని అదవబతుకూ' అనుకొని కూడా గమ్మునైపోయినాది.

'పైటాల నాయకుకాడ పంచాతీ ఉండాదిగదా' అని మతికి జేసుకుంది. దాని గురిచ్చి నిన్న ఆయాసపడినంత ఈ పొద్దు అనిపిచ్చడంలేదు. లేచినాల్నుంచి పనిమీద పరుగు పందెం దీసినట్టున్నా లోన ఓ వార గడిబిడిగా ఉండాది. అంతే. డొక్కోడు రానూ గురిచ్చి అనవట్టి శానా దినాలే అయింది. ఏదో సొట్టకూతలు కూస్తుండాడులే అనుకుండది. నిన్నటాపొద్దు పూరాం బైటికి వచ్చినాది. 'ఈ నా ఒట్ట దాన్ని చేసుకుండేది గ్యారెంటీ. యింగ కాదన్నీక యాడయితాది? ఎవరివల్లయితాది! పంచాతీ కాడ అర్సుకొండేదేగాని లొంగ గూడక ఏంజేస్తాడు. వాయినకు రావాల్సినేటియి వాయినకొస్తాయి. రేపో ఎల్లుండో దాన్ని తోలుకోనొస్తాడు. లొంగకియ్యక, దానికి గాజులు తొడిగిపేనాక గూడ నాకాడ్నే గుంజుకుంటాడు' అనుకుండది.

యింట్లోకెల్లి డొక్కడు ఉసారుగా పోతా కనిపిచ్చినాడు. పొద్దున్నే యింత తాగినాడు. ముక్కుదాకా కూర పట్టిచ్చినాడు. కళ్ళ ముందు రానూ అగపడినాది. దాని కొట్టంకెల్లి అడుగులు పడినాయి. ఈ వరప్పుడు అది టాకీసుకాడ ఉంటుందని మతికొచ్చింది. 'అబ్బో... బ్లాకు టికెట్లు అమ్మేటప్పుడ సుడాలి... దానికత, ఏం తెలివి, ఏం నయాగారం. గబ్బరుకాడు... చూచ్చాసి రేట్లు పెంచుతా, దించుతా ఎదుటోల్లను హడలుగొడతాది. రానూ నోరు తెరిచి చేతులు గాల్లోకి ఎత్తినప్పుడు సూడాల, మబ్బులు రాలిపడతాయని అదురుబోవాల్సిందే?

అప్పుడు రానూ మొగం ఎంత గండుగైనా - దాంట్లో కూడా ఏద తలక్కుమనే మెరుపు ఉంటాది. డొక్కడికి అదే చరుక్కున తగుల్తుంటాది.

డొక్కడు రానూ కొట్టంకెల్లి పోతండాడని గుమ్లికి అర్థమైంది. కాని ఏంజేస్తాది! సన్నది చంకలోంచి దుసబిక్కోని ఆడుకుంటా ఆడుకుంటా కెనాలు కట్ట వారెంబటికి పోయినాది. ఓవ్... అవి గట్టిగా అరిసి ఆదలబాదలపోయి దాన్ని లాక్కొంచుకుండాది.

నిలబడి యింగోసారి కొట్టం కెల్లి జూసినాది. డొక్కోడు అగపల్లా. కెనాలు కట్టెంబటి బట్టీలు రగులుతా ఉండాయి. వొగాయమ్మ తలకు నీల్లు పోసుకొని కానిగ చెట్టు మొదట్లో బండమీన కూకొని లడలడ అరుస్తా ఉంది. శికారోల్లు ఏ అమాశకో పున్నానికో నీల్లుపోసుకుంటారు. గుడ్డలు మార్చుకుంటారు. ఆడోల్లే కొంచెం నయం... మగోల్లయితే యిగ చెప్పనీకలేదు. ఆయమ్మ సారాయి గాయదు. యింట్లో మొగోల్లు, పిల్లోల్లు మట్కా నడుపుతాంటారు. వామె బో సెతురు మనిసి. ఏదో అని ఒగటెమైన అందర్నీ నవ్విస్త వుంది. కట్టకింద మట్కా ఉసారుగ నడుస్తా ఉంది.

డొక్కోడు - రానూల ఎవ్వారం వదిలిపెట్టి గుమ్లి గూడక వామె మాటల్లో పడిపోయినాది.

పైటాలదాంక పేట కాకమీదుంటాది. బక్కెల్లి సారాయి దించుతా, యింకొక్కెల్లి మట్కా నంబర్లు వేస్తా.... తీరికే ఉండదు. కొంతమంది ఝాంకులోసారి కట్టకాడికి బైట రోడ్డుకాడికి చప్పుడు చేయకుండా బిసబిస నడుస్తా కనిపెట్టుకొని ఉంటారు.

సుంకులమ్మ కట్టమీన గోడకు ఆనుకొని నానా కూచోని ఉండాడు.

రానూ కొట్టం మీదికెల్లి ఆనందు టాకీసు కాడికి పోత్తా డొక్కోడు కనిపిచ్చినాడు.

'ఈ నాకొడుకుని కాలసేత యిరగదన్నాల. బగ్గిసి మనిసి గదా! ఆమైన బేకారుగ తిరిగేదేగాని ఒగపనిచేసేదిలా...' అనుకుండాడు. రోంచేపు పోతే లొంగ యింటికాడ పంచాతి ఉండాదిగదా అని మతికొచ్చినాది. పంచాతి అనుకోగానే నానాకు కలక్కుమంది. యా పొద్దటిదో... అనుకోకుండా.. మనసులో ఊరింది. ఎప్పుడన్నా అట్లా అయితుంటది. ఈతూరి అయితే పంచాతి అనగానే వొంటిమీద కొరడాదెబ్బలు చురుక్కుమన్నట్టయింది.

'కాలం బో గబ్బు నాకొడుకుది. మనుషులను సన్నగసొట్లు పెడతాది' అనుకున్నాడు. దిన్నం యాటకుపోతా, మజ్జమజ్జలో యింత సారాయి గాచుకుంటా బతికిన దినాలయి. అప్పటికి పెద్ద భార్య సచ్చిపోయి యాడదయింది. మల్లా చేసుకోలేదు. ఒకదినం సందెకాడ సారాయిదించి, సీసాలకు ఎత్తి - యింతతాగి కొట్టంలో పండుకోనుండాడు. చీకటి దినాలు కావడాన కన్నుపొడుచుకున్నా అగపడ్డం లేదు. ఆకాశంలో చుక్కలు తప్ప శికారి పేట మింద యింగే వెలుగూ లేదు. యాడోల్లాడ బైట అరుగులమింద, మంచాల్లో పైపెరక్కుండా నిద్రపోతుండారు.

కెనాలు కట్టమీంచి ఎక్సయిజోల్లు జీపులో వచ్చిపడినారు. వరసగా ఉన్న సారాయి బట్టీల్ని పగల్నూకినారు. అయినా మత్తుగ జోగుతా ఉండే శికారోల్లు లెయ్యలేదు. ఎక్సయిజోల్లు కొట్టాల్లోకి వచ్చినారు. నిద్రపోతుండేటోల్లను నిద్రలోనే పొర్లించి పొర్లించి తన్నినారు. ఆడోల్లను మొగోల్లను మంచాల్లోంచి ఈడ్చికొట్టినారు. ఆ పొద్దు శికారోల్లు నిద్రలో ఉండారుగాని, శికారోల్లకు యిది

మామూలే. దెబ్బలు తింటా కూడా లేచి అంతా ఎక్సయిజోళ్ల మీదికి కమురబడ్డారు. ఒకాయన చొక్కా చినిగిపోయింది. దాంతో వచ్చినోళ్లకు రోసం పుట్టి రాచ్చసుల మాదిరి తయారైనారు. ఆడోళ్లను మొగళ్లను కలిపి చేతులు కట్టేసినారు. ఈ సందిలో కొంతమంది పారిపోయినారు. నిండా పారుతాండే కెనాల్లోకి దుంకి ఈదుకుంటా అవతలి తట్టుకు పోయి చీకట్లో కలిసిపోయినారు.

నానాను, యింకొంత మందిని జీపులో వేసుకొని పోయినారు. తెల్లరే వరకు యాడివాడ యిరగదీసినారు. నానాకు పైఅంతా పులిసిపోయింది. కదల్లేక చేతగాలేదు.

'తలాకొక వెయిరూపాయలిస్తే వదిలేస్తాం, లేకపోతే కేసులు పెడతాం' అని ఎక్సయిజోళ్లు బెదిరిచ్చినారు. వెయ్యిరూపాయలంటే ఆకాశంలో చుక్కలు లెక్క పెట్టినట్టే. యిండ్లకాడ దెబ్బలు తిని పడిపోయినోళ్లు టేసను కాడికిపోయి బంగపోయినారు. ఎన్ని దెబ్బలు తినేకయినా రడీగాని కేసులంటే భయం. దుడ్లిస్తే కేసులుండయి గదా? అనుకుండారు. ఒగతూరి యిచ్చినామంటే - మల్ల యింకొన్ని దినాలపాటు సారాయిగాచుకున్నా చూచ్చూడనట్లుంటారని తలా అయిదొందలు యియ్యనీక వొప్పుకుండారు.

ఎక్సయిజోళ్లు కూడా 'ఈ నా కొడుకులు దుడ్లియ్యకుండ యాడికి పోతారు, పాతాళానికి పోయినా జుట్టు పట్టుకొని గుంజకరామూ...' అనుకొని యింగో నాలుగు దెబ్బలు కొట్టి వదిలిపెట్టినారు. మర్నాడే కొందరు ఉసి ఉన్నకాడికి కొండబోయి వాళ్ల చేతల్లో పెట్టి కాళ్ల మీద పడుదామనుకుండారు.

నానా కాడ నూర్రూపాయలు గూడక తేవు

దెబ్బల్తోని పెయ్యంత జల్లరమెత్తినాది

దుడ్లియ్యకుంటే ఎట్లరా బగవంతుడా? అని నానా దిగులుపడ్డారు. కుతికమీదికొచ్చిపడె.... పొద్దంత సారాయిగాచినా అడవులు, తుప్పలు పట్కోని యాటజేసినా మాపటిదాం అయ్యేటాలకు యిండ్లకాడికి అడక్కోను పోక తప్పడంలా... యాడ దొంగలకొచ్చి దుడ్లిద్దును...! అనుకుండాడు.

కడాకు వొగమాటనుకుండాడు

ఆ మాపిటాల చీకట్లు ముసురుకుంటా ఉన్నప్పుడు కెనాలు కట్టెంబటి రైలుటేసనుకు పోయినాడు. యాదోసబండి పోతాంటే ఎక్కి లెట్రిన్ కాడ కూచుండాడు.

ఆ పొద్దటికి తన పడవాట్లు తీరినాయని కండ్లు మూసుకుండాడు. బండి యా దిక్కు పోతుండదో, యా దేశం పోతుండదో రేత్రంతా పట్టించుకోలా...

దొంగలని, గొంతులు కోసేటోళ్లని, దుడ్లకోసరం ఏం జెయ్యనీకైనా తగ్గరని ఉండూర్లో అనిపిచ్చుకున్న శికారోడు కొత్రాని దేశాన, అంచున పదిరూపాయలు లేక, అడిగేకి నోరు రాక అగసాట్లు పడినాడు. ఆకలికి పేగులు చుట్టకపోతా ఉంటే తిక్కలోని మాదిరి కాళ్ళు పోయినసాటికల్లా నడిచినాడు.

'ఈ ఊరిపేరేందన్నా' అని అడిగితే కొందరు నగినారు. చెప్పినోళ్లు చెప్పినారు. ఆ ఊరేందో, కర్నూలుకు యాదిక్కున ఉందో తెలేలేదు.

యా ఊరైతేంది. కర్నూలుగాక పోయినాక... అని నిబ్బరం తెచ్చుకుండాడు. తిరుగుతా తిరుగుతా ఒక ఊర్లో లారీలు ఆగిండేసాట కొట్టం హోటల్‌కాడికి పోయినాడు. అయిదారు మంది మొగోళ్లు తింటా, టీ తాగుతా ఉండారు. ఒకాడామె వాళ్లు అడిగేటియి అందిస్తా ఉంది. ఆ హోటల్ వామెదే.

తినేటోళ్లంతా వెళ్లిపోయినాక, బైట బెంచికాడ గొగ్గిరికాళ్ళ మింద కూచోనుండే నానాకెల్లి ఆయమ్మ చూచినాది. కండ్లలోకి ఊపిరొచ్చిన మనిషిని చూచి శానా యిదైపోయినాది. ఒక తెల్లలోటాలో సగానికి టీ పోసిచ్చినాది. ఆకలి మీద నానాకు తాగేదానికి కూడా చేతిగాలేదు. చేతులు వొనికినాయి. కండ్లల్లో నీల్లు తిరిగినాయి. ఒకగుక్క తాగేతలికి లోపల బిగబట్టినట్లయింది. యింగ చేతకాలేదు. వొనుకుతా ఉండే చేతుల్లో లోటా పట్టుకోలేక కిందబెట్టబోయినాడు.

ఆయమ్మ జాలిగా 'తాగులే' అన్నట్ల జూసింది.

వామెకు ముప్పై ఏండ్లుంటాయి. గచ్చకాయ మాదిరి నిగనిగలాడతా ఉంది. మాదిగోళ్లామె. మొగాన బొట్టులేదు. పేరు నాగమ్మ.

ఆ పొద్దట్నుంచి నానా రోజుకోసారైనా ఆడికి వచ్చి ఎంగిలి ప్లేట్లు, లోటాలు కడుగుతా ఉండె. నాగమ్మ టీ పోసిస్తా ఉండె. నాలుగు దినాలయినా యిద్దరు ఒగతూరైనా పలకరిచ్చుకోలా. పేటలో గడిబిడిచేసే నానాకు మాటలు పోయి శానా దినాలయింది. ఊర్లో రైలెక్కినప్పటి నుంచి మాటలే లేవు. ఎవరితో మాట్లాడుతాడు? ఎవర్ని జూసినా భయమే. ఏదన్నా అడగాలంటే గొంతు పెగిలేదికాదు. మాట జీరబోయేది, గుడగుడమని చప్పుడు వచ్చేదే గాని మాట వచ్చేది కాదు.

ఒక దినం ఆమెనే అడిగింది. నానా తన పేరు చెప్పినాడు, ఊరు చెప్పినాడు. 'ఈడినుంచి కర్నూలు పోయేది ఎట్లా?' అని అడిగినాడు. ఆమె ఏదో అన్నది కాని నానాకు ఎక్కలేదు. అంతకు మించి చెప్పనీక చేతగాలే, అడగను చేతకాలే. ఆ పొద్దటి నుంచి నాగమ్మ మాపటిదాం మిగిలిపోయిండే ఉగ్గాని నానాకు పెట్టేది. ప్లేట్లు కడిగి టీ తాగి పోయినాడంటే గాలికొట్టిన కెల్లి గాలి మాదిరే తిరిగి పొద్దుగూకే టయానికి నాగమ్మ కాడిగి వచ్చేటోడు.

పద్దినాలకు నానా మామూలయినాడు. కొంచెం మాటల్లో పడినాడు.

ఒకనాడు సగం రేత్రిదనక ఆడనే ఉంటే - ఈ వరప్పుడు యాడికి పోతావులే, ఈన్నే పండుకో..." అనింది. దినాం టీ పోసిస్తున్నా నాలుగుదినాల దాకా నానాను పలకరిచ్చాలని కూడా అనిపించలేదు, కాని రానురాను నానా అంటే జాలి పెరిగింది. నానాగిన టయానికి రాకపోతే ఈ తిక్కనాకొడుకేంది. ఈ పొద్దు ఇంగారాలా' అనుకోవడం మొదలైంది. నానా మాట్లాడే శికారీ తెలుగుకు యిదైపొయ్యేది.

టిఫిను తిన్నోక వొచ్చినోళ్లు నానా మాటలు విని 'ఎవుడీడు?' అని అడిగేటోళ్లు.

"ఆ... మన దేశం గాదంటలే. వాడికతేందో వాడికే తెలేదు. యింగ మనకేంటికి? చేతికింద ఉంటాడు గదా అని యింత టీపోసి, మిగిలేటియి పెడుతుండా" అని చెప్పేది.

శికారోడని సెప్పనీక మనసురాలా.

'శికారోడని యాల చెప్పాలి! వీళ్లంత యాల బెదిరిపోవాల? ఏదో దొంగను జూసినెట్ల?' అనుకునేది.

యింగోవారం పోయింది. నాగమ్మ యాడివో పాతపంచె, పొట్టి చేతుల అంగీ తెచ్చిచ్చినాది. ఆ పొద్దు నీల్లు పోసుకొని తొడుక్కుండాడు.

దినాం కొట్టం బైట అరుగు మీద పండుకొనేటోడు. ఆనాడు నాగమ్మ "బైట ఏం పండుకుంటావులే. ఏకున మంచుపడతా ఉంది. లోనికి పా" అంది.

తెల్లారినప్పటి నుంచి నానా ఒకటే యాతనగా కనిపిచ్చినాడు. కండ్లలో బెదురు తొంగి చూసింది. నాగమ్మ పలకరిచ్చినా ఆఁ అనేటోడుగాదు, ఊఁ అనేటోడుగాదు. ఏదో ఎదారు చేస్తున్నెట్ల అగపడేటోడు. ప్లేట్లు, లోటాలు కడుగుదామనుకోలేదు. ఉండి ఉండి లేచి ఊర్లోకి పోయినాడు. రెండ్రోజుల దాంక రాలేదు. నాగమ్మ ఒకటేమైనన ఎదురుజూసినంది. ఆ రాత్రి నుండి ఆమెకు నానా అంటే తగని యిష్టం పుట్టుకొచ్చింది. ఏంచేస్తా ఉన్నా ఎవరు మాట్లాడతా ఉన్నా నానా మీదికి మనసు పోయేది. గడీకోసారి రోడ్డు మీదికి మెడసాచి చూసేది... 'వస్తాండా?' అని.

మూడోనాడు నానా వచ్చినాడు. కండ్లు పీక్కుపోయినాయి. జెరం

తగులుతున్న మనిషిలెక్క ఉండాడు. వచ్చి బల్లకు వారగా కింద కూచున్నాడు. నాగమ్మ మందలిచ్చబోయింది. పలకాలా, ఉలకలా. టీ పోసిస్తే దానికెల్లే చూడలా.

పడమటి కెల్లి ఎర్రగా మారిపోయింది. చేల మీది నుండి చల్లగా గాలి లోలతా ఉంది. ఉండుండి నానా అందుకుండాడు.

"మా ఊరు పోతా..." అన్నాడు.

ఆ మాట విచిత్రంగా బైటికొచ్చినాది. నాగమ్మకు సరిగా వినబడలేదు కాని, నానా ఏమన్నదీ తెలిసిపోయింది.

నాగమ్మ కొంచెం చెరచెరలాడింది. కానీ తమాయించుకొంది. లోన నుండి ఏడుపు తన్నుకొనొచ్చింది. కళ్ళల్లో పలచగా కన్నీటి పొర అల్లుకుండాదిగాని, దాన్ని కూడా అదిమిపట్టింది. మాట్లాన్నీక చేతగాలేదు. నానా చేతులు, పెదాలు సన్నగా వణకడం ఆమె చూస్తానే ఉంది. వాళ్లిద్దరి చుట్టూ చీకటి పల్చగా మొదలైంది. దట్టంగా అమకపోయేదాకా అట్లనే కదలకుండ మెదలకుండా ఉండిపోయినారు.

ఎప్పటికో నాగమ్మ లేచి గట్టు మీదుండే సెరవలు, బాణలి, సలాకు, లోటాలు లోన ఎగబెట్టింది. ఒగతూరి నానాకెల్లి బరువుగా చూచి కొట్టంలోకి పోయింది.

నానా లేచి చీకట్లో రోడ్డుమీనికొచ్చినాడు.

ఆ రాత్రి నాగమ్మతో కలిసినాల్నుంచి భయం పట్టుకుండాది. శికారి జాతిలో నాయక్‌కు చెప్పి గాజులు తొడిగిపించిన ఆడమనిషితోనే సంసారం చేయాలగాని యింగో ఆడదానితో కలవడం పాపం. కట్టడి తప్పినోన్ని బవాని దేవత నలిచిపారేస్తాది. జరంగాచి, కాళ్ళూ చేతులుపడిపోయి, మనిషి లోపల్లోపలికి గుంజకపోయి చచ్చిపోతాడని భయం. కావాల్సింటే ఎంతమంది ఆడోల్లనైనా పెండ్లిచేసుకోవచ్చుగాని, చాటుమాటున సమ్మంధం పెట్టుకోవాలనే ఆలోచనే రాదు. మొగల్లయినా, ఆడోల్లయినా అంతే.

రెండు దినాలు యాడాడనో ఎక్కీదిగీ తప్పలు పడి ఊరికొచ్చినాడు. దారిలోనే నానాకు నిజంగానే పైగాల్తున్నట్లనిపించి ముదర జట్టుకని పోయినాడు.

'ఈ దినంతో ఆకరైపోయినట్లే. బవానీ తల్లికి కోపమొచ్చినాది అనుకుండాడు. కట్టడి తప్పి బంగారు పేటలో తనకండ్ల ఎదటే యిద్దరు శికారోల్లు కాల్లూచేతులు సన్నబడి, వొల్లంత పాలిపోయి, పైతోలు యాడిదాడ ఊడిపోయి నరకమనుబగించి చచ్చిపోయిండేది మతికొచ్చినాది. తప్పు చేయనేగూడదు. ఒకేల చేస్తే - గేర్లో చేసినా, బైటచేసినా నాయక్కుడ చెప్పుకొని దండన అనుబగించాల. బవాని తల్లి కనికరిస్తే బతికి బయటపడొచ్చు... ల్యాకపోతే మట్లో గలిసిపోవాల్సిందే...

రైల్లో వచ్చేటప్పుడే నానాకు ఎక్సుయిజోల్లు కండ్ల ముందు కొచ్చినారు. లోన గుడగుడ అనింది. రైలు ఆగినప్పుడు మజ్జలో దిగిపోదామని మెట్లకాడికొచ్చి కూడా 'కాల్లు కడుపులూ పట్టుకని వాల్లబారి నుండి ఎట్లయినా తప్పించుకోవచ్చు. నాయక్కుగిన చెప్పకపోతే ఉరువు బతుకే లేదు' అనుకొని వెనక్కి తగ్గినాడు.

నెల దినాల కింద కనిపిచ్చకుండా పోయినోడు తిరిగి వచ్చేతలికి శికారిపేట్లో అంతా సంబరపడ్డారు.

"యాడికి పోయినావురా! లంగనాఒట్ట... నీ కోసరం తిరగని తావులేదు....." అని తిట్టినారు. ఎట్లయితేనేమిలే, తిరిగొచ్చినాడు అని అంతలేకే నవ్వినారు. కానీ నానా అదేం పట్టించుకొనే తట్లలేడు. నేరుగా పెద్ద లొంగ యింటికాడికి పోయినాడు. వాయినకు జరిగిండేదంతా చెప్పినాడు. అప్పటికే సగం గేరి నాయక్ యింటితానకొచ్చింది. నానా చెప్పిండేదంత విని లెక్కాచారం ప్రకారం యిరబై కొరడా దెబ్బలెయ్యాలని అన్నారు.

పెద్ద లొంగ కొట్టంలో గోడకు కొరడా ఎప్పుడూ యాలాడుతుంటాది. వాయన తమ్ముడు లోనికి పోయి కొరడా తెచ్చి అట్లా గాల్లోకి యిసిరినాడు. నానా జడుసుకుండాడు. ఓ వారగా నిలబడ్డాడు. వొనుక్కుంటా మజ్జలోకి వచ్చినాడు. లొంగ తమ్ముడు కండ్లు మూసుకొని బవాని తల్లిని తల్చుకుంటా కొరడాను చుట్టి గుండెకు అద్దుకుండాడు. వాయన కండ్లు తెరవటం, నానా పై మీద కొరడా చళ్‌చళ్ మనడం ఒకేతూరి జరిగింది.

పదిహేను దెబ్బలకే నానా దబ్బున పడిపోయినాడు. ఆ పైన అట్లట్ల యింగో అయిదుదెబ్బలు కొట్టి లొంగ తమ్ముడు కొరడా లోనికి గొండబోయినాడు.

ఎవరో యిద్దరు ముగ్గురు ఆడోల్లు, మగోల్లు నానాను రెట్టల కింద చేతులేసి లేవదీసి కొట్టం కాడికి తీసకపోయినారు.

బడబడ అరుపులతోటి, కేకలతోటి ఉండే శికారి గేరి ఆ పూటంతా చప్పుడు లేకుండా బరువుగా గాలి పీలుస్తున్నెట్ల ఉండిపోయింది.

గేర్లో ఎవరో అర్సుకుంటా దబదబా నడిచిపోతాంటే - ఆ చప్పిడికి నానా కనుగుడ్ల మీద నీటిపొరతో యివతలికి వచ్చినాడు. 'డొక్కోడు గలీజునాయలేగాని ఏంజేస్తాం? వాడుగాని, రానూగాని తట్టుకోలేక తప్పు చేసే కంటే పెండ్లి చేసుకొండేదే నయం. ఆచారం ఎట్లా కాదంటాం'. అనుకుండాడు.

బైట గడిబిడయితా ఉంటే లేచి సందులోకి చూచినాడు.

లొంగ యింటి ముందు శానామంది నిలబడుకోనుండారు. 'పంచాతి మొదలయినట్లుండది' అనుకుంటా అటుకెల్లి నడిచినాడు. రానూ, డొక్కోడు ఎదురెదురుగా నిలబడినారు. గుల్బారు ఏదో వదురుకుంటా ఒక్కెల్లి ఉండాడు. యాభై అరవైమంది జమైనారు. మజ్జలో లొంగ మంచమ్మీద కూచోనుండాడు.

గుమ్మి యింగా రాలేదే? అని అందరూ ఎదురు జూస్తుండారు.

గుమ్మి సారాయి దించి కొట్టంలోకి పోయినాది.

డొక్కోడు బువ్వతిని పోతాపోతా వాకిలి దగ్గరికి నూకిపోయినాడుగాని చిలుకు పెట్టలా... పిల్లి దూరి పొయికాడ మూడుక్కోని పండుకుంది. గుమ్మి చప్పుడు చేసేతలికి లేచి, వొళ్ళిరుచుకుంటా, తోకపైకెత్తి ఆయమ్మను రాసుకుంటా బైటికి పోయింది.

ఆడికి నయం, డొక్కోడు తిన్నకాడికి తిని సట్లుతీసి ఎగబెట్టినాడు. తల్లెకాడ పడుండే ఎముకల్ని పిల్లి సప్పరించి సప్పరించి పారేసింది.

గుమ్మి మొగున్ని తిట్టుకుంటా ఎముకల్ని ఎత్తిపారేసి, తల్లె కడిగి ఎగబెట్టి పిల్లదాన్ని సంకనేసుకొని, 'అందరూ పోయినట్లుండాది' అనుకుంటా లొంగ యింటికాడికి నడిచింది.

గుమ్మిపోయి ఒక్కెల్లి నిలబడ్నాది.

రెండాకులు, వొక్కసీటి, పదిరూపాయల నోటు రేకు కుర్చీ మీద ఉండాయి. లొంగ ఒగతూరి గుమ్మికెల్లి చూచినాడు. అటిటు తలతిప్పి నానా కోసరం ఎతికినాడు. నానా అందరికంటే ఎడంగా చేతులు ఎనక్కి కట్టుకొని కనిపిచ్చినాడు. మిగతా అందరి మొగాల్లోకి చూచినాడు.

"తాంబూలం అయిపోయినట్లేగదా" అన్నాడు లొంగ.

డొక్కోడు నిక్కరు జోబిలో పెట్టుకోనింటే గాజుల పొట్లం తీసి రానూ చేతికిచ్చినాడు. పై కాయితం తీసి పసుప్పచ్చ, బులుగు రంగు గాజులు తొడుక్కుంది రానూ.

ఎవరూ ఏం మాట్లాడలేదు.

యింగపొండి... అన్నెట్ల చూచినాడు లొంగ. వచ్చినోల్లు చిన్నగ కదలడం మొదలు పెట్టినారు... గుమ్మి అట్లనే నిలబడుకోనుంది.

'ఊరిక అర్సుకుండేదేగాని, జరిగేటియి జరుగుతానే ఉంటయి. అనుకుంటా నానా కూడ తిరగి సుంకులమ్మ కట్టమీదికి వచ్చినాడు.

(ఇంకా వుంది)



కళాప్రదర్శనలు యిస్తున్న కళాకారులు




కళాప్రదర్శనలు యిస్తున్న కళాకారులు



కాకరాల, శిఖామణి తదితరులు

భూపాల్, కృష్ణాబాయి, వరవరరావు, శ్యామల, చలసాని ప్రసాద్, వంగపండు



## మనము ఫౌండేషన్ పుస్తకాల పరిశీలనాపట్టిక

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | KLVA101M133 |
| పుస్తకం పేరు | అరుణతార |
| తారీఖు | 08 February 2025 |
| ముందు అట్ట | yes |
| వెనుక అట్ట | yes |
| మొత్తం పేజీలు | 73 |
| పెద్ద సైజు పేజీలు | no |
| ఖాళీ పేజీలు | no |
| లేని పేజీలు | no |
| తయారు చేసినది | Bhanu |
| పేజీలు విడదీసినది | Bhanu |
| స్కాన్ చేసినది | Priyanka |
| పరీక్ష చేసినది | HASEEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| పరిస్థితి | good |